13-5-86

# నాలుగు నవలలు

('మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నల్లకారు

రచన: ఎమ్. వి. వి. సత్యనారాయణ

## మృత్యుమందిరం

రచన: వసుంధర

## సినీతార (ఆత్మ) హత్య

రచన: వాణిశ్రీ

## రెండు శవాలు

రచన: ప్రతాప రవిశంకర్

పొగమంచు — ఆరవ భాగము

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—78**
జూన్, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# నల్లకారు

ఎమ్. వి. వి. సత్యనారాయణ

పట్నానికి ఒక మూలగా అభివృద్ధి చెందుతోన్న ప్రాంతం అది. మూడువైపులా విస్తరించుకొన్నపట్నం ఎగుడుదిగుడుగా కనిపిస్తోంది. నాలుగోవైపున విశాలమైన కొండ తూర్పున సముద్రంవరకూ పరచుకుని పండుకుని వుంది.

ఒకే రకంగా నిర్మించిన ఇళ్ళు వున్న ఆ కాలనీ హౌసింగ్ బోర్డు వారిది. ఇళ్ళు జనంతో పూర్తిగా నిండ లేదు కాని ఆ కాలనీలో ఒక మాదిరి బార్ వెలసింది.

లోయ అంచునవున్న బార్ కి. దగ్గరలోనే దట్టంగా పెరిగిన చిట్టడవి వుంది. కాలనీలో చెదరు మదురుగా కిళ్ళీ షాపులూ, ఒక లాండ్రీ, రెండు కిరణాకొట్లు వెలి శాయి. వాటికి కాస్త మధ్యగా బాంక్ భవనం కూడా చోటు చేసుకుంది. తీర్చిదిద్దిన తారురోడ్లమీద సిమెంట్ ఎలక్ట్రిక్ స్తంభాలు నాగరికతకు సాక్ష్యంగా నిల బడ్డాయి.

# 4

మధ్యాహ్నం పదకొండు గంటల సమయం.

నిషా బార్ ముందు ఆటో ఆగింది.

ఆటోలోంచి భూషణం దిగి డ్రైవర్‌కి అద్దె చెల్లించాడు. రోడ్డుకేసి చూశాడు. ఒకరో ఇద్దరో నడుస్తున్నారు. తప్పితే నిర్జనం అనే చెప్పుకోవాలి. కాలనీకి వెనకవున్న కొండమీద ఎండ ప్రతిఫలించి కాలనీలో అప్పుడే వేడి గాలిని విసురుతోంది.

భూషణం చేతిలోవున్న బాగ్ తడిమి తృప్తిగా చూచి, బార్ కేసి నడిచాడు.

నిషాబార్‌లో జనం లేరు. కౌంటర్ ఖాళీగా వెక్కిరిస్తోంది. కుర్చీలు తలక్రిందులుగా బెంచీల మీదా, టేబుల్స్‌మీద విశ్రాంతి తీసుకొంటున్నాయి. హోలు అప్పుడే శుభ్రం చేసినట్టుంది. మద్యం వాసనతో బాటు ఫినాయిలు వాసన కలగాపులగంగా వస్తోంది.

భూషణం కౌంటర్ ముందు నిలబడ్డాడు. ఎవరూ అతడి దగ్గరకు రావడంగానీ అతడి వునికిని గుర్తించడం కానీ జరగలేదు.

"సుబ్బరామయ్యా," పిల్చాడు భూషణం.

సుబ్బరామయ్య ఆ బార్ యజమాని.

ఎవరూ జవాబు పలకలేదు. భూషణం హోలులోంచి లోపలికి నడిచాడు.

వంటయింట్లో పొయ్యి మండుతోంది. పొయ్యి మీద పెద్దసైజు గంగాళంలో నిండుగా నూనె మరుగుతోంది. క్రింద ఒక ప్రక్కగా మసాలా కలిపిన పాత్ర వుంది. దాని ప్రక్కనే వుల్లిపాయ ముక్కల రాశి వుంది. ఆ రాశి మీద పచ్చి మిరపకాయ ముక్కలు పేర్చినట్టు వున్నాయి. గది గోడలు మసిబారి వున్నాయి. అయినా ఆ గదిలో

వస్తోన్న వాసనలు ఎంత ఆకలి చచ్చిపోయిన వాడికయినా అవురావురుమనే ఆకలి పుట్టించేలాగా వున్నాయి.

వంటయింట్లో యెవరూ లేకపోవడంతో ఆ గదిని దాటుకుంటూ ముందుకు నడిచాడు భూషణం.

వంటయింటికి వెనకగా పెరడు వుంది. పెరట్లో నుయ్యి దగ్గర వంటవాడు కోళ్ళను తలలు కట్ చేసి ఒక ప్రక్కగా పెడుతున్నాడు. కన్నన్ నీళ్ళు తోడు తున్నాడు. వాళ్ళిద్దరూ తమ పనులు ఆపకుండానే భూషణంకేసి చూశారు.

భూషణం వాళ్ళని పలకరింపుగా నవ్వి, "రాత్రికి కార్యక్రమం సిద్ధం చేస్తోన్నట్టున్నారు." అన్నాడు.

వంటవాడు కోళ్ళను చంపేపని అయిపోయినట్టుగా పెద్ద కత్తిని ఒకప్రక్కగా పెట్టి లేచాడు. నల్లటి ఇనుప కత్తి రక్తంతో తడిసి ఎర్రగా చందనం పూసుకున్నట్టుంది. చివరిగా తల తెగిన కోడి యింకా గిలగిల కొట్టుకుంటూ నేలమీద పొర్లుతోంది.

"అవునండి! చెయ్యాలికదా!" అన్నాడు సమాధానంగా.

"సుబ్బరామయ్య ఎక్కడికి వెళ్ళాడు?" అడిగాడు భూషణం.

"టవున్ వెళ్ళారు. పలావ్ రైస్ మంచిరకం వచ్చాయట!" అన్నాడు కన్నన్.

"సుబ్బరామయ్య వచ్చేవరకూ బాటిల్ దొరకదా?"

"తాళం చెవులు ఇచ్చి వెళ్ళారు."

"వెరీగుడ్! చికెన్ యెంత సేపట్లో అవుతుంది?"

"ఇప్పుడప్పుడే యెక్కడ సార్?" వంటవాడు నిర్లక్ష్యంగా కోళ్ళను కాళ్ళు పట్టి మోసుకు వెళ్ళిపోయాడు.

# 6

భూషణం వంటవాడు వెళ్ళిన దిశ కేసి కోపంగా చూచి "వీడికి యింకా బుద్ధి రాలేనట్టుంది. కష్టమర్స్‌తో యింత తల బిరుసుగా మాట్లాడతాడేం?" అన్నాడు.

కన్నన్ చాలా మామూలుగా నవ్వి, "వాడికి కష్టమర్స్‌తో పనేమిటి సార్! బేరర్‌ని నేను కాబట్టి నాకే కష్టమర్స్‌పట్ల గౌరవం వుండాలి." అన్నాడు.

"సరే! ఒక కోడిని త్వరగా ఫ్రై చేయించు. బహుమతి మర్చిపోలేదని చెప్పు. జానీవాకర్ బాటిల్ తీసి వుంచు" అన్నాడు భూషణం.

కన్నన్ కళ్ళెగరేసి, "జానీవాకరే! ఏమిటి సార్ విశేషం?" అన్నాడు.

"విశేషం ఏముంది? ఏం? నేను జానీవాకర్ తాగకూడదా?"

"ఏం లేదుసార్! ఎప్పుడూ జానీవాకర్ గురించి మీరు అడగలేదని ఆశ్చర్యపోయాను. అంతే!"

కన్నన్ నీళ్ళు నిండిన బకెట్లు రెండు చేతులతో పట్టుకుని వంటయింట్లోకి నడిచాడు. భూషణం అతడిని అనుసరించుకుంటూ వంటింట్లోకి వచ్చాడు. కన్నన్ బకెట్లు వంటయింట్లో దింపి హాల్లోకి నడిచాడు. భూషణం హాల్లో అడుగు పెడుతూనే, "సుశీల వుండే గది ఎక్కడ?" అన్నాడు.

కన్నన్ మాట్లాడలేదు.

భూషణం బాగ్ తెరచి నోట్ల కట్టల్లోంచి అయిదు రూపాయల నోటుతీసి కన్నన్ చేతిలో పెట్టాడు. కన్నన్ మొహం మెర్క్యురీ దీపంలాగా తళ తళ లాడింది. చటుక్కున నోటు అందుకుని బనీను జేబులో పెట్టుకున్నాడు.

"రాత్రంతా అలసిపోయి వుంటుంది. ఇప్పుడు నిద్ర లేస్తుందని నాకు నమ్మకం లేదు సార్!" అన్నాడు కణ్ణన్ వినయంగా.

"ఆ సంగతి నేను చూసుకుంటాను. నాకు ఆమె గది చూపించు చాలు" అన్నాడు భూషణం బాగ్ మూసి.

"రండిసార్!" కణ్ణన్ హొల్లోంచి ప్రక్కకి నడిచాడు. భూషణం బాగ్‌ను జాగ్రత్తగా గుండెలకదుముకుని కణ్ణన్ వెనకనే నడిచాడు.

గుమ్మంలో అంతవరకూ వాళ్ళిద్దరినీ పరీక్షగా చూస్తోన్న వంటవాడు అసహ్యంగా వుమ్మి తిరిగి తన పనిలో నిమగ్నమైపోయాడు.

## 2

భూషణం తలుపు తట్టాడు. లోపలనుండి యెవరో కదిలిన సూచనగా మంచం కిర్రుమంది. భూషణం తిరిగి తలుపు తట్టాడు. లోపలవున్నవాళ్ళు బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటోన్నట్టనిపించింది.

"ఎవరు?" చిరాగ్గా అడిగింది ఆడగొంతు.

"సుశీలా! నేను భూషణాన్ని. తలుపు తెరువు."

"ఇప్పుడా? ఒకగంట ఆగి రారాదూ!" చిరాగ్గా అంది సుశీల.

"తలుపు తెరువ్. నీతో అర్జంటుగా మాట్లాడాలి."

"అబ్బా....బద్ధకంగా వుంది" సుశీల లేచినట్టుంది. గుమ్మంవద్ద మెత్తగా అడుగుల చప్పుడయింది. భూషణం ఆత్రుతగా తలుపులకేసి చూడసాగాడు.

తలుపులు తెరుచుకున్నాయి. సుశీల గుమ్మం అవతల నిలబడివుంది. రోజ్ కలర్ బ్లవుజ్, పూల పరికిణీ కట్టుకునివుంది. బ్లౌజ్‌కీ పూల పరికిణీకి మధ్య జానెడు వెడల్పున

నగ్న శరీరం నున్నగా మెరుస్తోంది. గాఢమైన నిద్ర లోంచి లేచినట్లు ఆమె కళ్లు మగతగా యెర్రగా వున్నాయి. కోల మొహం, ఎర్రటి పెదిమలు, నున్నగా మొనదేరిన గడ్డం క్రింద శంఖంలాంటి కంఠం శరీరానికి తగినట్లు ఒంపు సొంపులూ....

భూషణం ఆమెకేసి ఆవులించి చూశాడు.

సుశీల అతడిని విడ్డూరంగా చూచి, "ఏమిటిది? వేళ గాని వేళ వచ్చావు?" అన్నది.

"నీతో వివరంగా మాట్లాడాలి."

"ఏ విషయం?"

"గుమ్మం అవతల నువ్వూ, ఇవతల నేనూ — ఇలా వుండే మాట్లాడాలా!"

"ఎప్పుడూ ఆడదాని మొహం చూడనట్లు చూస్తోంటే నాకు భయం వేస్తోంది. అంతే!" నవ్వింది సుశీల మత్తుగా.

"ఏం?" కొంటెగా అడిగాడు భూషణం.

"రాత్రి డాన్స్‌తో ఒళ్ళు నలిగిపోయి వుంది."

"ఇంక నీకు ఆ బాధ వుండదులే!"

సుశీల కళ్ళు విప్పుకు చూచి, ప్రక్కకి తప్పుకుంది. భూషణం గొంతులో ఆమె యెన్నడూ వినివుండని ఆత్మ విశ్వాసం ధ్వనించింది. భూషణం గదిలోకి నడిచాడు. సుశీల తలుపు దగ్గరగా వేసింది. భూషణం మంచంమీద కూర్చున్నాడు. సుశీల మంచం దగ్గరగా వచ్చి నిలబడింది. భూషణం ఆమె చెయ్యి పట్టుకోబోయాడు. సుశీల దూరంగా జరిగింది.

"సంగతి చెప్పు" అన్నది సుశీల.

భూషణం నవ్వి, "సంగతి చెప్పేవరకూ నిన్ను ముట్టుకో కూడదా?" అన్నాడు. సుశీల కొంటెగా నవ్వింది.

భూషణం బాగ్ తెరచి నోట్లకట్టలు తీసి మంచం మీద పోశాడు.

"రా. లెక్క పెట్టు" అన్నాడు.

"ఎక్కడివి? బాంకును దోచావా?" అడిగింది సుశీల.

"నేను దొంగలాగా వున్నానా?"

"..................."

"నీకోసం ఈ డబ్బు సంపాదించాను. నా పొలాన్ని ఫారం అమ్మేశాను."

"నాకోసమా? అదేమిటి? నేను అమ్మమని చెప్పానా?"

"నువ్వెందుకు చెబుతావు. నీ వయసు — సొగసు చెప్పాయి. అందుకే నా పొలాన్ని రామ్మూర్తికి అమ్మేశాను. మొత్తం పదివేలు యిచ్చాడు. నాతో వచ్చెయ్ మా యింటికి. అంటే మా స్వగ్రామం పోదాం."

"పోయి...."

"మన యిద్దరికీ పెళ్ళయినట్టు చెబుతాను. నువు మా యింటి కోడలివి కావడానికి ముసలితనంలో నా రాక కోసం తపిస్తోన్న నా తల్లిదండ్రులకు అభ్యంతరం వుండదు."

"ప్చ్.... నేను నీతో వచ్చేస్తానని యెలా అనుకున్నావ్?"

"ఏం?" ఆశ్చర్యంగా చూశాడు.

"నా శరీరంలో నాకంటూ ఏం మిగిలిందని!"

"అలా అనక! నాకు నువు కావాలి. అంతే!"

"నా వెనకవున్న చరిత్రతో!"

"నాకు తెలియదనా? నిన్ను నాతో సమానంగా గౌరవంగా చూసుకుంటాను. ప్లీజ్ — కాదనక!"

"నా పరిచయాలు అంత సులువుగా నన్ను వదులు

తాయా?"

"మాది మారుమూల కుగ్రామం. నీ పరిచయాలు గుర్తుంచుకుని అంతదూరం వస్తారని నాకు నమ్మకంలేదు."

"నిన్ను అనుమానిస్తోన్నట్టు భావించక. నువ్వయినా నన్ను ఎంతకాలం ఆదరిస్తావ్? నా ఒంట్లో సుఖం ఇవ్వ కలిగే వేడి వున్నంతవరకే కదా!"

"ప్లీజ్. అలా మాట్లాడక! నిన్ను జీవితాంతం ప్రాణంలా కాపాడుకుంటాను."

సుశీల కళ్ళు తడిగా మిల మిల మెరిశాయి. ఆమె కళ్ళలో కొత్త కాంతి! భవిష్యత్తుమీద ఆశ!

"డబ్బుతీసి బాగ్ లో పెట్టు" అంది సుశీల.

"ఒప్పుకున్నట్టే కదా!"

"అయితే చిన్న ఇబ్బంది. సుబ్బరామయ్యగారు ఒప్పుకోవాలి?"

"నువ్వు కేవలం డాన్సర్ వే కదా! అంతకంటె మీ పరిచయం ముందుకి వెళ్ళిందా?"

"లేదు. ఈ నెల జీతం అడ్వాన్సుగా తీసేశాను. వారం రోజులలో నెల అయిపోతుంది."

"ఆ వారానికి, లేకపోతే నువ్వు వాడుకున్న అడ్వాన్స్ మొత్తం చెల్లిస్తాను. నేను మాట్లాడతాను."

"వద్దు. వారం కంప్లీట్ చేస్తాను. ఆయనకీ మరో డాన్సర్ను చూసుకోవడానికి కాల వ్యవధి కావాలి కదా!"

"ఆల్ రైట్. నీ యిష్టానికి వ్యతిరేకంగా చెప్పను. ఈ డబ్బును జాగ్రత్త పెట్టు."

"డబ్బు మనదగ్గర దేనికి? ఖర్చులకు కొంత వుంచుకొని బాంక్ లో పడెయ్యవచ్చును గదా!"

భూషణం తలూపాడు. డబ్బును బాగ్‌లో సర్దాడు. గుమ్మందగ్గర అలికిడయింది.

"నేను కణ్ణన్‌ని" అన్నాడు కన్నన్ గది బయట నుంచి.

"లోపలికి రా కన్నన్!" అన్నాడు భూషణం.

తలుపులు తెరుచుకుని కన్నన్ గదిలో అడుగు పెట్టాడు.

"చికెన్ రెడీ అవుతోంది. హాలులో ఇప్పుడు సర్వీసింగ్ చేయడం బాగుండదు. గదిలోకి తీసుకురమ్మంటారా?" అడిగాడు కన్నన్.

భూషణం తలూపి. "ఒక జానీవాకర్ కూడా!" అన్నాడు.

కన్నన్ తలూపి, అక్కడే నిలబడిపోయాడు. భూషణం అర్థం చేసుకున్నట్టుగా తల పంకించి పాంటు జేబులో చెయ్యిపెట్టి అయిదు రూపాయిల నోటుతీసి, "వంటవాడికి యివ్వు" అన్నాడు.

కన్నన్ నోటు అందుకుని వినయంగా నవ్వి బయటకు వెళ్ళిపోయాడు.

సుశీల చటుక్కున తలుపు దగ్గరకు వేసివచ్చి భూషణాన్ని కౌగిలించుకుంది. భూషణం ఆమెను పొదివి పట్టుకుని. "త్వరగా తయారవ్వు. లంచ్ తెస్తాడు బేరర్." అన్నాడు.

సుశీల అతడిని విడిచిపెట్టి బట్టలపెట్టెకేసి నడిచింది. భూషణం ఆమెనే కళ్ళార్పకుండా చూడసాగాడు.

# 3

కన్నన్ బయటకి వచ్చినవాడు హాలులో వ్యక్తిని చూచి తెల్లబోయాడు. కుర్చీని కిందికి వాల్చుకుని త్యాగ

రాజు కోరగా చూస్తూ కూర్చున్నాడు. అతడి చూపులు కణ్ణన్ వైపు వున్నాయి.

'వీడు యెందుకు వచ్చినట్టు?' అని పరి పరి రకాలుగా మనసులో తర్జన భర్జన పడసాగాడు కణ్ణన్.

అతడి ఆలోచనలు పసిగట్టినట్టుగా త్యాగరాజు ఫెళ్లున నవ్వాడు. ఆ నవ్వుకి అర్థాలు లాగుకుంటే అర లక్ష వస్తాయని కణ్ణన్‌కి తెలుసు.

త్యాగరాజు పట్నంలో పేరుమోసిన రౌడీ. అతడికి చాల అర్థబలం వుంది. అర్థంవున్నచోట అంగబలమూ వుంటుంది. అది ప్రపంచంలో రివాజు. పోలీసు రికార్డు కెక్కగలిగీ, ఎక్కలేని అర్థబలం అది. అందుకే త్యాగరాజు అంటే వణుకుతారు ఎక్కువమంది. పట్టపగలు హత్యచేసి కాలర్ ఎత్తుకుని వెళ్ళగలిగే దమ్ము త్యాగరాజుకి ఒక్కడికే వున్నట్టు పట్నంలో వున్న రౌడీలకు తిరుగులేని నమ్మకం.

"ఇలా రా నాయనా! కణ్ణా!" పిల్చాడు త్యాగరాజు.

కణ్ణన్ తారెత్తిపోయాడు. త్యాగరాజు అంత సున్నితంగా పిల్చాడంటే ఆ వ్యక్తి జాతకం ముగిసిపోతుందని చాలమంది చెప్పుకోవడం విన్నాడు కణ్ణన్. అయినా వెళ్ళక తప్పదు అనుకుంటూ కణ్ణన్ ముందుకి నడిచాడు. త్యాగరాజు కూర్చున్న కుర్చీకి కొంత దూరంలో నిలబడ్డాడు.

త్యాగరాజు అతడిని చూసి మరల నవ్వాడు. డబ్బాలో రాళ్ళువేసి గిలకరించినట్లు అతడి నవ్వు వికారంగా వుంటుంది.

"గదిలో బొమ్మతో వున్నది భూషణమేనా?" అడి

గాడు త్యాగరాజు.

కన్నన్ అనుమానంగా చూసి తలాడించాడు.

"ఎందుకురా అలా వణికిపోతావ్ పిరికి సన్నాసీ! వాడిని పిల్చుకురా! నేను రమ్మన్నానని చెప్పు!" అని అంతలోనే ఫెళ్ళున నవ్వి, "వాడి శృంగారం వెలగ బెట్టాకే రమ్మను. తొందర లేదు" అన్నాడు.

"అలాగేనండి" అని కన్నన్ తిరిగివచ్చిన దారినే వెళ్ళి గది తలుపు తట్టాడు. తలుపులు తెరిచాడు భూషణం.

"మీ కోసం త్యాగరాజుగారు వచ్చారు సార్! మీ పనయిపోతే మాట్లాడడానికి రమ్మంటున్నారు." అన్నాడు కన్నన్.

"త్యాగరాజా! నా కోసమా!" ఆశ్చర్యంగా చూశాడు భూషణం. కన్నన్ నిర్లిప్తంగా చూశాడు.

"వస్తున్నట్టు చెప్పు" అని భూషణం కొంతసేపు ఆగి క్రిందకు వెళ్ళాడు.

"ఏమండోయ్! భూషణంగారూ! ఏమిటి విశేషం? బార్‌లో పట్టపగలు మకాం వేశారు" త్యాగరాజు కళ్ళెగ రేశాడు.

భూషణానికి ఆశ్చర్యం ఇంకా ఎక్కువయింది. తనని త్యాగరాజు చూడ రావడమే ఆశ్చర్యం అనుకుంటే, తనిని అంత పరిచయంగా పిలవడం మరీ ఆశ్చర్యకరం!

అయినా భూషణం తన మనోభావాలు కనిపించ నివ్వటంలేదు.

"ఏం లేదు. చిన్న పనిపడి ఇటు వచ్చాను." అని మాత్రం అన్నాడు.

"పనేమిటో తెలుసుకోవచ్చునా?"

"నా వ్యక్తిగతం!"

"సరే! అడగను. పౌర్‌శ్రీ షారం అమ్మతో న్నట్టు మాట వరసకయినా నాకు కబురు పెట్టవద్దా?"

"కబురా? దేనికి?"

త్యాగరాజు చిరాకుగా చూశాడు.

"నాకు అమ్మడానికి!"

"అది అమ్మకం అయిపోయింది కదా!"

"తెలివిగా మాట్లాడుతున్నట్టు భ్రమపడక! అమ్మక ముందే నాకు కబురు పంపి వుంటే బాగుండేది."

"నా ఆస్తిని అమ్ముకోవడానికి మీకు కబురు పెట్టాలా?"

"నీ ఆస్తి? ఏ వూరు మనది?"

భూషణం అసహనంగా చూశాడు. మాట్లాడలేదు.

"ఏవూరు మనది? యెక్కడికి వచ్చాం? వచ్చిన నాలు గేళ్ళలో ఎంత ఆస్తి సంపాదించాం? సంపాదించిన ఆస్తిని అమ్ముకునేటప్పుడు ఆ ప్రాంతాల్లో వుండే పెద్ద మనుషు లకు చెప్పవద్దా? చెప్పండి భూషణంబాబుగారూ!" వెక్కిరించాడు త్యాగరాజు.

"పెద్దమనిషి ఎవరు?"

త్యాగరాజు ఒకసారి తన గుబురు మీసాలు దువ్వు కున్నాడు.

"నేను వుండగా మరొకడు పెద్దమనిషి నంటూ వస్తాడా?" అన్నాడు.

భూషణం హేళనగా చూశాడు.

"నిజమే! నువ్వుండగా మరొకడు పెద్దమనిషినని ఎలా వస్తాడు?"

"అంటే నీ వుద్దేశ్యం?"

"నీ గొప్ప నువ్వే చెప్పుకుంటున్నావు. అదే నే

నన్నాను. అంతే!"

"నేను నీ దృష్టిలో పెద్దమనిషిని కాదా!"

"నా దృష్టిలో నువ్వేమిటో నేను చెప్పనక్కర లేదు."

"ఏం?"

"నీ గొప్పతనం తెలియనివాడు పట్నంలో వుండడు."

త్యాగరాజు అనుమానంగా చూశాడు.

"నీ మాటల్లో హేళన లేదుకదా!"

"హేళనా? ఎందుకు? నా పొలాన్ని నేను అమ్ము కుంటే ఎందుకు అమ్మావని అడగవచ్చావు. నీలాంటి పెద్ద మనిషికి తెలియకుండా అమ్మినందుకు నెపం వేశావు. ఉంటేగింటే నీ మాటల్లోనే హేళన వుండాలి."

త్యాగరాజు కోపంగా చూచి, "నువు నన్ను అవమాన కరంగా చేసి మాట్లాడుతున్నావు. ఫలితం తెలుసా?" అన్నాడు.

భూషణం వెక్కిరింపుగా చూచి కుర్చీలాక్కుని కూర్చు న్నాడు.

"అబ్బే! తెలియదే!" అన్నాడు.

"భూషణం! నాకు కోపం వస్తే మనిషిని కాను. తెలుసా?"

"నీకు కోపం దేనికి రావాలి?"

"నీ పొలాన్ని నాకు అమ్మివుండవలసింది."

"అమ్మకం జరిగిపోయిన దాని గురించి వాదించడం వివేకమైన విషయం కాదనుకుంటాను. ఒప్పుకుంటావా?"

"అంటే నేను అవివేకినా?"

"ఏమో నీ విషయం నీకే బాగా తెలిసి వుండాలి."

"ఏమిట్రా నువ్వు వాగేది?" త్యాగరాజు కోపంగా

లేచాడు.

భూషణం నిర్లక్ష్యంగా చూశాడు. త్యాగరాజుకి అతడి ధోరణి మరింత కోపం తెప్పించింది. ముందుకు దూకి భూషణం ఫిల్టు పట్టుకున్నాడు. కుడిచేత్తో ముఖంమీద బలంగా కొట్టాడు.

అయితే భూషణం ముహంమీద దెబ్బ తగిలేలోపుగా త్యాగరాజు బాధగా అరిచి పొట్ట పట్టుకున్నాడు. భూషణం శక్తికొద్దీ అతడి పొట్టలో గుద్దాడు.

త్యాగరాజు చేతిలోంచి ఫిల్టు విడుదల కాగానే భూషణం చటుక్కున లేచి, మోకాలెత్తి అతడి తొడల మీద గురిచూచి బలంగా పొడిచాడు.

త్యాగరాజు కెవ్వున అరచి చేత్తో పట్టుకుని నేలమీద కూలబడిపోయాడు, భూషణం అతడికి అవకాశం యివ్వ దల్చుకోలేదు. చెయ్యెత్తి బలంగా మొహంమీద చరి చాడు. త్యాగరాజు పళ్ళు బిగబట్టి బాధను ఓర్చుకుంటు న్నాడు.

ఇంతకాలం తనచేతిలో తన్నులు తిన్నవారే కనిపిం చారు. కాని, ఇలా తన్నులు తినడంలో ఎలాంటి నరకం వుందో తెలియచెప్పిన వాళ్ళు లేరు.

త్యాగరాజు కళ్ళు చికిలించి చూశాడు. భూషణం వంటయింటికేసి చూస్తున్నాడు. వంటఇంటి గుమ్మంలో నిలబడిన వంటవాడూ, కణ్ణన్ గుడ్లప్పగించి చూస్తున్నారు. వాళ్ళ కంటికి త్యాగరాజుకంటె భూషణం భయంకరంగా కనిపిస్తున్నాడు.

భూషణం పరాకుగా వుండడం చూచి త్యాగరాజు కాళ్ళుచాచి అతడి మోకాళ్ళమీద తన్నాడు. భూషణం కట్టె విరిగినట్టు నేలమీద దబ్బున పడ్డాడు. త్యాగరాజు

నెమ్మదిగా లేచాడు.

భూషణం పడుతూనే త్యాగరాజు ఆలోచన కని పెట్టాడు. తనమీదకు దూకుతోన్న త్యాగరాజును ఈడ్చి డొక్కలో తన్నాడు. త్యాగరాజు గింగరాలు తిరిగి కుర్చీ మీదపడి వెనక్కి దొర్లిపోయాడు. రక్తం కక్కు కున్నాడు.

భూషణం తాపీగా లేచి నెమ్మదిగా కండరాలను స్వాధీనంలోకి తెచ్చుకుని త్యాగరాజును సమీపించాడు. కాలర్ పట్టుకుని మొహం పైకెత్తాడు. త్యాగరాజు పరిస్థితి, పరిసరాలను గమనించేటట్టు లేదు.

భూషణం అతడిమీద కాండ్రించి వుమ్మి మెల్లగా వదిలిపెట్టాడు. నిశ్శబ్దంగా తన గదికేసి నడిచి వెళ్ళి పోయాడు.

## 4

గుమ్మందగ్గరే వున్న సుశీల భయంతో బిగుసుకుపోయి వుంది. ఆమె కళ్ళు మూసుకుని మెల్లగా వణుకుతోంది.

అకస్మాత్తుగా ఆమె భుజంమీద చేయి పడింది. ఆమె వులిక్కిపడింది. కళ్ళు తెరచి చూచింది. భూషణం ఆమె మొహంలోకి చూస్తూ కనిపించాడు. ఆమె తేరుకుని అతడిని వాటేసుకుంది.

భూషణం సుశీలను నడిపించుకుంటూ గదిలోపలికి వెళ్ళి తలుపు దగ్గరకు చేరవేశాడు. ఆమెను మంచంమీద కూర్చుండబెట్టి బాత్‌రూంలో చొరబడ్డాడు.

సుశీల మెల్లగా నిట్టూర్చి తలుపు తెరచి బయటకు చూచింది. కణ్ణన్ ట్రేతో వస్తూ కనిపించాడు. గదిలో సుశీలను చూశాడు. ఆమె మొహంలో ఎలాంటి భావమూ

లేదు. కణ్ణన్ నిర్లిప్తంగా గుమ్మంలో నిలబడి ఆమెకు ట్రే అందించాడు.

భూషణం బాత్‌రూంలోంచి బయటకు వచ్చాడు. ట్రేను చూచి తృప్తిగానవ్వి, "కణ్ణన్! సుబ్బరామయ్య రాగానే నాకు కబురు చెయ్యి" అన్నాడు.

కణ్ణన్ వెళ్ళిపోయాడు.

"సుబ్బరామయ్యతో చెబుతావా ఈ సంగతి?" అన్నది సుశీల.

భూషణం తలుపు గడియపెట్టి వచ్చి, "అవును. మన విషయమూ, ఆ రాస్కెల్‌గాడి విషయమూనూ" అన్నాడు.

సుశీల ట్రేమీద మూత తొలగించింది.

ఇద్దరూ భోజనానికి వుపక్రమించారు.

వాళ్ళు భోజనం ముగించేసరికి సుబ్బరామయ్య వచ్చాడని అతడి గొంతునుబట్టి భూషణానికి తెలిసింది. తలుపులు దగ్గరగా వేసుకోమని హెచ్చరించి, భూషణం బయటకు వెళ్ళాడు.

సుశీల తల వూపి అతడి వెనకే గడియపెట్టింది.

భూషణం వెళ్ళేసరికే వంటవాడూ, కణ్ణన్ కలసి జరిగిన సంగతి అంతా సుబ్బరామయ్యకి వివరించసాగారు.

"త్యాగరాజు ఎక్కడ?" అడిగాడు సుబ్బరామయ్య.

"మీరు వచ్చేముందే ఏదో ఆటో యిటువస్తే అది బేరం మాట్లాడి పంపించేశాం సార్!" అన్నాడు వంటవాడు.

భూషణానికి కుర్చీ చూపించి, "నువు కాస్త సహనంతో వ్యవహరించవలసింది. అతడితో అనవసరంగా కలహానికి దిగావు. మీరిద్దరూ బయట తన్నుకుంటే నాకు

అభ్యంతరం లేదు," అన్నాడు సుబ్బరామయ్య.

భూషణం శాంతంగా చూచి, "నా పరిస్థితిలో నువ్వున్నా నిన్నూ అలాగే రెచ్చగొట్టేవాడు. లేకపోతే అతడికి నాతో ఏం పని చెప్పు?" అన్నాడు.

"ఏమైనా నీ వరస నాకు నచ్చలేదు." అన్నాడు సుబ్బరామయ్య కటువుగా.

"విషయం పూర్తిగా వినకుండా నువ్వు నన్ను తప్పు పడితే నేను ఏం చేయాలి?"

"నీ విషయం విని నేను బాధపడేదేం వుంటుంది? నేను లేనప్పుడు నా ఇలాకాలో వున్న మనిషితో నువ్వు గదిలో గడపడంలో అర్థం లేదు."

"సారీ సుబ్బరామయ్యా! నీకు విషయం చెప్పాలనే అనుకున్నాను. ఇంతలో ఆ రాస్కెల్ గాడు అంతా రసాభాస చేశాడు. నేను సుశీలను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను."

సుబ్బరామయ్య తన చెవులను తనే నమ్మలేనట్టు చూశాడు.

"సుశీలను నువ్వు పెళ్ళి చేసుకుంటావా?"

"అవును."

"అదేమిటి? అంతకంటె మంచి ఆలోచన నీకు రాలేదా?"

"సుబ్బరామయ్యా! నా పరిస్థితులనుబట్టి నేను ఒక నిర్ణయానికి వచ్చాను. స్నేహితుడిగా నువ్వు చేయగలిగిన మాట సహాయం చెయ్యి చాలు!"

వంటవాడూ, కణ్ణన్ మొహాలు చూసుకున్నారు.

"సుశీలను వదిలిపెట్టి నేను బార్ మూసుకోవాలి. స్నేహితుడిగా నేను చేయగలిగేది అంతే కదా!!"

"సుశీలతోనే బార్ వుందా? మరో అమ్మాయిని వెతుక్కోలేవా? ప్లీజ్. నాకోసం! నా పోర్ట్రెయిట్ అమ్మి స్వగ్రామం వెళ్ళిపోయి సుశీలతో కొత్త జీవితం మొదలు పెడతాను."

"సుశీలలాగా సహకరించగలిగే అమ్మాయి నాకు దొరకవద్దా? దొరకడం అంత సులువనుకుంటున్నావా?"

"నేనూ ప్రయత్నిస్తాను. ప్లీజ్, కాదనక!"

"అమ్మాయిని దొరకనివ్వు. అయినా నీ ప్లాన్ గురించి నాకు ముందుగా చెప్పలేకపోయావా?"

"పోర్ట్రెయిట్‌కి మంచి బేరం వచ్చింది. అమ్మకం సొమ్మే గాకుండా నాకు పదేళ్ళ కాలంవరకూ నెలకు రెండు వందలరూపాయిలు పంపిస్తానని రామ్మూర్తి ఒప్పందం పడ్డాడు"

"త్యాగరాజు అంతకు క్రితం నీ పోర్ట్రెయిట్‌ని కొనడానికి సిద్ధపడ్డాడట కదా. అతడినికూడా అమ్మేముందు సంప్రదించి వుండవలసింది."

"పదేళ్ళపాటు వాడు మాటకి కట్టుబడి వుంటాడన్న నమ్మకం ఏమిటి?"

"నిజమే! కోరి వాడితో తగవు పడ్డావు."

"ఏడిచాడు. చావుదెబ్బ తిని పారిపోయాడు."

"వారం రోజుల్లో ప్రయత్నించి నాకు మరో అమ్మాయిని ఏర్పాటుచేసి నువు వెళ్ళిపోవడం మంచిది. ఈ లోపులో అయినా నీ జాగ్రత్తలో నువ్వుండు."

భూషణం కృతజ్ఞతగా చూశాడు.

"నేను సుశీల గదిలోనే ఉంటాను. ఆమెను విడిచి పెట్టడానికి యెంత సొమ్ము యివ్వమంటావో నిర్మొహమాటంగా అడుగు" అన్నాడు భూషణం.

సుబ్బరామయ్య తలూపాడు.

భూషణం లేచి వెళ్ళిపోయాడు. మరో అర గంటలో బాగ్ తీసుకుని రోడ్డుమీద అడుగు పెట్టాడు. బాంకు ఉన్న ప్లాట్ కేసి చక చక నడవసాగాడు.

# 5

"క్రింగ్ .... క్రింగ్ .... క్రింగ్ ...."

రామ్మూర్తి చేతిలో ఉన్న మందు సీసాను టేబులు మీద పెట్టి టెలిఫోన్ వున్న బల్లకేసి నడిచాడు. రిసీవర్ ఎత్తి "హలో.... రామ్మూర్తి స్పీకింగ్ ...." అన్నాడు.

"రామ్మూర్తీ.... నేను త్యాగరాజును మాట్లాడు తున్నాను. నీకు పౌల్ట్రీ అమ్మిన భూషణం నామీద చెయ్యి చేసుకొన్నాడు. తెలిసిందా?"

"భూషణమా? నీమీదా? ఆశ్చర్యంగా వుంది."

"నేను ఆస్పత్రినుండి మాట్లాడుతున్నాను. నాకు తగల రాని చోట తగిలాయి దెబ్బలు. వాడు వూరు వదిలి వెళ్ళే లోపున పగ తీర్చుకుంటాను. నువు అనవసరంగా వాడి దగ్గరనుండి పౌల్ట్రీ కొన్నావు. వాడికి యెంత యిచ్చావో చెప్పు. నీకు డబ్బు చెల్లిస్తాను."

"నీకు అమ్మడానికా కొన్నది? మా యింట్లో ముగ్గురు గ్రాడ్యుయేటు కొడుకులున్నారు. వాళ్ళకి బతుకు తెరువు కోసం కొన్నాను. నాతో నీకు వాదం అనవసరం!"

"నా సంగతి తెలిసే మాట్లాడుతున్నావా?"

"ఎందుకు అందరినీ బెదిరిస్తావు? అయినా నీకు పౌల్ట్రీ ఏం చేసుకోను?"

"అక్కడినించి పౌల్ట్రీ నిమార్చి స్మాల్ స్కేల్ ఇండస్ట్రీ పెట్టించుతానని మా బావమరిదికి ఆశ పెట్టాను. లక్ష రూపాయలవరకూ లోన్ కూడా గ్రాంటయింది."

"నేను ఆ విషయంలో ఏం చేయలేను."

"ఆల్ రైట్! నేను ఆస్పత్రినుండి బయటకు రావాలి. మీ యిద్దరి పని చెప్పాలి."

"ముందు నువు బయటికి రా. తర్వాత సంగతి చూసు కుందాం!" అని ఫోన్ పెట్టేశాడు రామ్మూర్తి.

ఫోన్‌లో మాట్లాడటం అయితే మాట్లాడాడు కాని అతడి మొహంలో ప్రేత కళ వచ్చింది. తన మాటలకి తనకే ఆశ్చర్యం కలుగుతోంది. ఏమిటి? తను త్యాగరాజు లాంటి గూండాతోనా అలా మాట్లాడగలిగింది? ఏ ధైర్యంతో? తనకి అంగబలం ఏమున్నది-ముగ్గురు కొడు కులూ, ఇద్దరు పనివాళ్ళూ తప్ప!

# 6

టెలిఫోన్ గణగణ మ్రోగింది. బాంకు యేజంటు రిసీవరెత్తాడు.

"హలో....గుడ్‌విల్ బాంక్, హౌసింగ్‌బోర్డు కాలనీ బ్రాంచ్ నుండి మాట్లాడుతున్నాను." అన్నాడు ఏజంట్.

"నమస్తే. మీ బాంకులో భూషణానికి అక్కౌంటు వుంది. ఈ రోజు డబ్బు విత్‌డ్రా చేశాడా?"

"మాట్లాడేది ఎవరూ?"

"భూషణం శ్రేయోభిలాషిని."

"ఆ విషయం మీకెందుకు?"

"చెప్పాను గదా అతడి శ్రేయస్సుకోరే అడిగాను."

ఏజంట్ ఫోన్ పెట్టేశాడు.

నిమిషం తర్వాత ఫోన్ మరల రింగయింది.

ఏజంటు ఫోన్ యెత్తాడు.

"ఈజిట్ గుడ్‌విల్ బ్రాంచ్?...." అడిగారు ఫోన్‌లో ఎవరో.

"ఎస్ ...."

"నేను భూషణాన్ని. ఈ రోజు డబ్బు విత్ డ్రా చేయాలనుకొంటున్నాను. కాష్ సిద్ధం చేయండి."

"మీరు భూషణం అని నమ్మకం ఏమిటి? బ్యాంక్ కి వస్తే ఎటూ తీసుకుంటారు కదా!"

అవతల ఫోన్ పెట్టేశారు.

ఏజంట్ చిరాకుగా చూశాడు. ఈ కాలనీలో బిజినెస్ లేదు. వున్న పదిమంది ఖాతాదారుల్లో భూషణం ఒకడు. నిన్న సొమ్ము డిపాజిట్ చేశాడు అతడు. అదయినా యెంత? ముష్టి తొమ్మిదివేల చిల్లర.

భూషణం డబ్బు మీ బ్రాంచ్ లో యెంత వుంది?

అతడి అక్కౌంటులో నిన్న యెంత వేశాడు?

ఎప్పుడు డబ్బు విత్ డ్రా చేస్తాడు?

ఇప్పుడేమైనా విత్ డ్రా చేశాడా?

ఇవీ తనకి ఉదయంనుండీ వచ్చిన పది ఫోన్ కాల్సూనూ. భూషణం ఎక్కౌంటు గనుక మూసేస్తానంటే టౌన్ వెళ్ళి మెయిన్ బ్రాంచ్ నుంచి కాష్ తీసుకు రావాలి. కాస్త పెద్ద మొత్తంలో సొమ్ము కావాలంటే తను ఆ పద్ధతినే సురక్షితంగా ఉంటుందని యెన్నుకున్నాడు.

తలుపులు తెరుచుకొని కాషియర్ వచ్చాడు. అతడి చేతిలో విత్ డ్రాయల్ స్లిప్ ఉంది.

"భూషణానిదా?" అడిగాడు ఏజంట్

కాషియర్ ఆశ్చర్యంగా చూశాడు.

## 7

సుబ్బరామయ్య తలెత్తి చూశాడు. భూషణం వస్తూ కనిపించాడు.

భూషణం వెనక యెవరో కొత్త స్త్రీ నడుస్తూ

వస్తోంది. ఆమెను చూడగానే ఎగిరి గంతేసినంత పని చేశాడు సుబ్బరామయ్య.

మగవాళ్ళని పిచ్చెక్కించే హొయలు ఆమెలో సుశీల కంటె ఎక్కువ మోతాదులోనే వున్నాయి. సుశీలలో కాస్త సంసార పక్షం ఆడతనం వుంది. ఈమెలో అది లేదు. లేకపోవడమే తనకి కావలసింది. అయితే ఈమె సుశీలలాగా వినయంగా మెలగుతూ పనిలో సర్దుబాటు చేసుకుంటుందో లేదో!

భూషణం సుబ్బరామయ్యను సమీపించాడు.

"ఈమె లత! సుశీల స్థానంలో చేరుతుంది." అన్నాడు భూషణం.

ఆమె సుబ్బరామయ్యకి నమస్కరించింది. నమస్కారంలోనే హొయలు చిలికినట్టు సుబ్బరామయ్యకు అనిపించింది.

"భూషణం నీకు షరతులు చెప్పాడనుకొంటాను."

ఆమె తలూపింది. భూషణం మెల్లగా దగ్గాడు.

"నేను ఈ రోజే సుశీలతో వెళ్ళిపోవాలనుకొంటున్నాను. ఆమె ఎకౌంటులో మీకు రావలసివున్నదెంతో చెప్పు సుబ్బరామయ్యా!" అడిగాడు భూషణం.

సుబ్బరామయ్య చకచక లెక్కలు వేసి "రెండువేల నాలుగువందలు!" అని కాగితంమీద వేసి యిచ్చాడు.

భూషణం ఆ కాగితాన్ని జేబులో పెట్టుకుని లతకేసి చూశాడు. "రా! సుశీలతో మాట్లాడుతూ కూర్చుందువుగాని" అన్నాడు.

లత తలాడించి అతడి వెనక బయలుదేరింది.

"రాత్రంతా ఏమయ్యావు?" అడిగింది సుశీల.

"తర్వాత చెబుతాను. ఇక్కడ ఎలా మెలగాలో

లతకి అన్ని విషయాలూ చెప్పు. నేను బాంకులో డబ్బు ఇవ్వమని స్లిప్ యిచ్చి వచ్చాను." అన్నాడు భూషణం.

"మనం ఈరోజే బయలుదేర తామా?"

"అవును. మెయిల్ కి వెళ్ళిపోదాం. సర్దుకొని వున్నావు కదా?"

"నువు బాంకుకి వెళ్ళిరా! మెయిలు ఒంటి గంటకి కదా!"

భూషణం గదిలోంచి బయటికి వచ్చేశాడు. రోడ్డు మీదకు అడుగుపెట్టాడు. బాంకువైపుగా నడవసాగాడు. రోడ్డుకి చివరగా ఎవరిదో కారు ఆగి ఉంది. నల్లకారు.

భూషణం తల దించుకొని బాంకులో ప్రవేశించాడు. పది నిమిషాల తర్వాత బరువుగా ఉన్న బాగ్ తో బయటికి వచ్చాడు.

ఏజంట్, భూషణాన్ని ప్రశ్నలువేసి విసిగించి విసిగించి వదిలాడు. ఏజంటును వదుల్చుకు నేసరికి భూషణానికి తల దిమ్మెక్కిపోయింది.

నిర్జనంగా ఉన్న రోడ్డుకేసి ఒక్కసారి చూశాడు. నల్లకారు ముందుకి వస్తోంది. భూషణం ముందు నల్లకారు సడన్ బ్రేకుతో ఆగింది.

భూషణానికి ఏం జరుగుతుందో తెలిసేలోపులో కారు వెనక కిటికీ భూషణం ముందుకి వచ్చింది. భూషణం తలెత్తి కిటికీకేసి చూశాడు. కారు కిటికీలకు నల్లటి తెరలు కట్టివున్నాయి.

కిటికీలోంచి తెర తప్పించుకొని ఒక చెయ్యి వెలుపలికి రావడం, భూషణం చేతిలోంచి బేగ్ లాక్కోవడం, భూషణం అరవబోయేంతలో రెండో చేతిలో ఉన్న ఆయుధం అతడి మెడమీద విసురుగా పడటం అంతా

కన్ను మూసి తెరిచే లోపుగా జరిగిపోయింది.

మొదలు నరికిన చెట్టులాగా భూషణం క్రింద పడి పోయాడు. అతడి గొంతులోంచి రాబోయిన కేక గొంతులోనే ఆగిపోయింది.

కారు ఒక్క దూకులో ముందుకి పరుగెత్తింది.

# 8

కాలింగ్ బెల్ అదే పనిగా మ్రోగుతోంది.

మైక్రోస్కోప్ క్రింద ఉన్న మెటీరియల్‌ను సర్దుకొంటున్నవాడల్లా లేచి తలుపువైపు నడిచాడు సారధి.

కీ హోల్‌లోంచి బయటికి చూశాడు. చీర కనిపించింది. చీర కట్టుకున్న వ్యక్తి తప్ప గుమ్మంలో ఎవరూ లేరు. సారధి తలుపు తెరిచాడు. ఆమెకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"డిటెక్టివ్ శిరీష్‌గారు మీరేనా?" అడిగిందామె.

"కాదు. వారితో మాట్లాడాలా?" అడిగాడు సారధి.

ఆమె అవునన్నట్టు తలూపింది.

"లోపలికి రండి" అని దారి ఇచ్చాడు సారధి. ఆమె లోపలికి అడుగు పెట్టింది. సారధి డ్రాయింగ్ రూంలోకి నడిచాడు. ఆమెకు సోఫా చూపించి, "కూర్చోండి. మీ పేరు?" అన్నాడు సారధి.

"నా పేరు సుశీల. నాకు కాబోయే భర్తను ఎవరో హత్య చేశారు." ఆమె మొహాన్ని చేతులతో కప్పుకొని యేడుస్తోంది.

సారధి ఆమెకేసి పరీక్షగా చూశాడు. ఆమెను ఎక్కడో చూసినట్టుంది.

"ఆలోచనలకు సమయం కాదు" అనుకొంటూ లోపలికి వెళ్ళాడు.

అప్పుడే డిటెక్టివ్ శిరీష్ రిసీవర్ క్రెడిల్ చేస్తూ కని పించాడు.

"మీ కోసం సుశీల అనే ఆవిడ వచ్చింది. ఏదో హత్య కేసు విషయమై మాట్లాడాలట!"

"భూషణం హత్యకేసా!" అడిగాడు డిటెక్టివ్ శిరీష్.

"అడగలేదు. డ్రాయింగ్ రూంలో కూర్చుండ బెట్టాను."

"నువు తయారవు. హెచ్. బి. కాలనీకి వెళ్ళాలి." అంటూ డిటెక్టివ్ శిరీష్ అతడి సమాధానంకోసం ఎదురు చూడకుండా డ్రాయింగ్ రూంకేసి నడిచాడు.

సుశీల శిరీష్‌ను చూడగానే ఏడుపు ఆపింది.

"విషయం క్లుప్తంగా చెప్పమ్మా! మేము బయటికి వెళ్తున్నాం," అన్నాడు డిటెక్టివ్ శిరీష్.

సుశీల క్లుప్తంగా తనకీ భూషణానికీ ఉన్న పరిచయం గురించి చెప్పింది.

"శిరీష్‌గారూ! మేము త్వరలో పెళ్ళి చేసుకోవాలను కున్నాం. ఆయన బాంకుకి వెళ్ళి డబ్బు విత్ డ్రా చేసి తిరిగి వస్తున్నారట. ఎవరో ఆయనని మెడనరికి నా బతు కుల్లో నిప్పులు పోశారు. ఇంకా శవం అక్కడే రోడ్డు మీద దిక్కు లేకుండా పడివుంది. శవాన్ని చూడటం నాకు కడుపులో దేవుతోంది. నాకు తగిన పద్ధతిలో మీరు సహాయం చేయగలరని నాకు సుబ్బరామయ్య చెప్పాడు," అంది సుశీల.

"రండి. మేమూ కాలనీకి వెళ్తున్నాం. క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ నన్ను రమ్మని ఫోన్ చేశారు."

సుశీల లేచింది.

పోర్టికోలో హారన్ మ్రోగింది.

"పదండి. మా సారధి కారు సిద్ధం చేశాడు." అంటూ శిరీష్ హుందాగా అడుగులు వేసుకొంటూ బయటకు నడిచాడు. సుశీల బయటకి రాగానే తలుపులు తాళం వేశాడు.

ఇద్దరూ పోర్టికోలో వున్న కారు వద్దకు నడిచారు. సుశీలకి వెనక సీటు చూపించి, డిటెక్టివ్ శిరీష్ సారధి ప్రక్క కూర్చున్నాడు.

డాట్సన్ ముందుకి ఉరికింది. తారురోడ్డును మింగుతూ జరజర సాగే పాములాగా డాట్సను నేషనల్ హైవే లోకి మళ్ళింది. గాంధీనగర్ వద్ద మలుపు తిరిగి సీతమ్మ ధారలో అడుగుపెట్టింది. కొండవారగా వేసిన రోడ్డు లోకి తిరిగింది. హెచ్. బి. కాలనీలోకి మళ్ళింది.

రాత్రిళ్ళు బార్ ముందు తప్ప అంత జనం గుమిగూడి రోడ్డుమీద చేరడం కారులో ఉన్న ముగ్గురిలో యెవరూ చూడలేదు. పోలీసులు ఆ గుంపును అదుపులో పెట్టడానికి లాఠీలు గాల్లో ఝాడిస్తున్నారు.

డాట్సన్‌ని గుంపుకి కాస్త దూరంలో ఆపి సారధి డోర్ తెరచుకొని దిగాడు. వెనకడోర్ తెరచి పట్టుకొన్నాడు. సుశీల దిగింది.

డిటెక్టివ్ శిరీష్ కారు దిగి హుందాగా అడుగులు వేసుకొంటూ గుంపులో చొరబడ్డాడు. గుంపుకి అవతలప్రక్క రెండు జీపులూ, ఒక వేనూ ఆగి ఉన్నాయి.

క్రైం బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ గోపాల్ శిరీష్‌ను చూచి "రా! నీ కోసం ఎదురు చూస్తున్నాము" అన్నాడు.

రోడ్డుమీద రక్తం మడుగు చింతపిక్క రంగులో పెచ్చుకట్టి ఉంది. దానిమధ్య శవం వున్నట్టుంది. శవం

మీద దుప్పటి కప్పి ఉంచారు.

"శవాన్ని చూస్తావా?" అడిగాడు గోపాల్.

శరీఫ్ సమాధానంగా తలూపి, వొంగి మొహంమీద ఉన్న గుడ్డను తప్పించి చూశాడు. మెడ మూడు వంతులు తెగిపోయి ఒక ప్రక్కగా వ్రేలాడుతోందా అన్నట్టు పొజిషన్‌లో మార్పు ఉంది. హతుడి మొహంలో తీవ్ర మైన బాధ ఇంకా వ్యక్తమవుతోన్నట్టు మొహంలో కండరాలు ముడుచుకుని వున్నాయి.

"ఏదో పదునుపాటి ఆయుధంతో ఒకే వ్రేటుతో ఇంత గాయం చేయగలిగాడు హంతకుడు. వెంటనే ప్రాణం పోయివుండాలి. అందుకే నేలమీద పడ్డవాడు పడ్డట్టు ఉండిపోయాడు" అన్నాడు డిటెక్టివ్ శరీఫ్, దుప్పటి మూసి.

"అవును. డాక్టర్ కూడా అలాగే అభిప్రాయపడ్డాడు" అన్నాడు గోపాల్.

"హత్య జరిగేటప్పుడు ఎవరైనా చూచి ఉంటారు. అసలు మీకు ఫోన్ చేసిందెవరు?" అడిగాడు శరీఫ్.

"గుడ్‌విల్ బాంక్ ఏజంట్."

"ఆయన యింకా యేం చెప్పారో చెప్పు!"

"బాంకులో కూర్చుండే మాట్లాడుకొందాం. శవాన్ని మార్చ్యురీకి పంపడం ఒక్కటే మిగిలింది" అంటూ గోపాల్ తన సిబ్బందికి ఆదేశాలిచ్చాడు.

పోలీసులు రోడ్డుమీద కొంతమేరకు రాళ్ళు వుంచి ఆ వలయంలోకి యెవరూ జొరబడకుండా అదుపు చేస్తున్నారు.

శరీఫ్, గోపాల్ బాంక్‌లో అడుగుపెట్టారు. వాళ్ళిద్దరి వెనుకగా సారథీ, సుశీలా లోపలకి వెళ్ళారు. బాంక్

మేనేజర్ వాళ్ళను సాదరంగా ఆహ్వానించి ఆసనాలు చూపించాడు.

"నా కళ్ళముందు ఇంత దారుణం జరుగుతుందనుకో లేదు. భూషణం డబ్బు తీసుకొని రోడ్డుమీద అడుగు పెట్టాడు. నా గది కిటికీలోంచి అతడిని పరిశీలించ సాగాను...."

"మీ మాటకి అడ్డు వచ్చాను ఏజంటుగారూ! భూష ణాన్ని మీరు ప్రత్యేకంగా పరిశీలించడానికి కారణం యేమైనా వుందా? కేవలం కాకతాళీయంగానా?" అడిగాడు డిటెక్టివ్ శిరీష్.

"మంచి ప్రశ్న వేశారు" అని ఏజంటు తనకి ఉదయం నుండీ వస్తోన్న ఫోన్ కాల్స్ గురించి వివరంగా చెప్పాడు....

"ఆఫ్టరాల్ తొమ్మిదివేల రూపాయలకోసం అంత మంది వ్యక్తులు భూషణంమీద నిఘా ఉంచారంటే చాలా విచిత్రంగా వుంది. డబ్బు చెల్లిస్తూ మీరు భూషణాన్ని హెచ్చరించి ఉంటే బాగుండేదేమో!" అన్నాడు గోపాల్.

"యూ ఆర్ కరెక్ట్! నేను ఆ పని చేశాను. అతడు మరో గంటలో పట్నం వదలి దూరంగా వెళ్ళిపోతాడని తెలిసి ప్రమాదం లేదని ఆశించాను."

"భూషణం రోడ్డు మీద వెళ్తోంటే....తర్వాత యేమైంది?"

"నల్లటి అంబాసిడర్ కారు భూషణాన్ని సమీపిం చింది. భూషణానికీ నాకూ మధ్య కారు అడ్డం వుంది. కారు సడన్ బ్రేక్‌తో ఆగింది. ఏం జరిగిందో తెలిసేలోపుగా కారు వేగంగా వెళ్ళిపోయింది. భూషణం కింద పడి

పోయాడు. మెడ ప్రాంతం నుండి తూములోంచి వర్షపు నీరు వస్తున్నట్టు రక్తం గోడుమీదకు పారుతోంది. నేను కళ్ళు తిరిగి కిటికిదగ్గరే పడిపోయాను. కాషియర్ ఎందుకో లోపలికి వచ్చి నన్ను చూచి మొహాన నీళ్లు చల్లాడు. పోలీస్ స్టేషన్ కి రింగ్ చేశాను" చెమటలు పట్టిన మొహం తుడుచుకొన్నాడు ఏజంటు.

"కారు నెంబర్ చూశారా?"

"లేదు—కాని ఆ కారు 69వ సంవత్సరం మోడల్."

"కారులోంచి యెవరైనా కనిపించారా?"

"చెప్పడం మరచాను. కారుకు చుట్టూ నల్లటి తెర లున్నాయి."

శిరీష్ సాభిప్రాయంగా గోపాల్ కేసి చూశాడు. గోపాల్ తలూపి లేచాడు.

"థాంక్యూ! చాల విలువైన సమాచారం యిచ్చారు. పని పడితే మరల మిమ్మల్ని కలుస్తాను" అన్నాడు గోపాల్ చెయ్యి చాపి.

ఏజంటు కరచాలనం చేశాడు.

నలుగురూ బయటకు వచ్చారు.

గోపాల్ సుశీలకేసి చూచి, "ఈమె యెవరు?" అన్నాడు.

శిరీష్, గోపాల్ కి సుశీలను పరిచయంచేసి ఆమె గురించి చెప్పాడు. గోపాల్ నుదురు చిట్లించాడు.

# 9

"భూషణం మీద మీ అభిప్రాయం ఏమిటి?" అడిగాడు గోపాల్.

సుబ్బరామయ్య వినయంగా చూశాడు.

"భూషణం నాకు నాలుగు సంవత్సరాలుగా తెలుసు.

కష్టపడి పైకి వచ్చినవాడు. పది కోళ్ళతో మొదలుపెట్టిన కోళ్ళఫారం యీ రోజు పదివేల రూపాయలకు అమ్మగలిగాడంటే అతడి కృషి అర్ధమౌతోంది. అయితే అతడిది మొండిపట్టు."

"సుశీలను అతడు పెళ్ళి చేసుకుంటానంటే మీరు ఆశ్చర్యపోలేదా?"

"నిజమే! అప్పుడప్పుడూ సుశీలతో గడిపేవాడు. పెళ్ళి చేసుకొంటానంటే నా చెవులను నేనే నమ్మలేకపోయాను. నాకు సుశీలవంటి డాన్సర్‌ను వదులుకోవడం కష్టంగా అనిపించింది. అయితే లత అనే కొత్త డాన్సర్‌ను వెతికి తీసుకువచ్చాడు భూషణం."

గోపాల్ అనుమానంగా చూచి, "భూషణం హత్య గురించి మీరేం చెబుతారు?" అన్నాడు.

శరీఫ్, సారధిని సైగచేసి పిలిచి అతడి చెవిలో యేదో చెప్పి బయటకు పంపేశాడు. సుబ్బరామయ్య తనలో తాను తర్జనభర్జన పడుతోన్నట్టు అతడి ముఖకవళికలు చెబుతున్నాయి.

"చెప్పండి. ఫరవాలేదు. మీ ప్రాణరక్షణ బాధ్యత మేము తీసుకుంటాం."

"నిన్న త్యాగరాజుతో తగాదాపడ్డాడు...."

గోపాల్ పాయింట్ నోట్ చేసుకొని, "త్యాగరాజు అంటే సంతపేట రౌడీయేనా? ఇద్దరికీ గొడవ యేమిటి?" అన్నాడు.

"నా కంటె కణ్ణన్ మీకు బాగా చెబుతాడు" అని సుబ్బరామయ్య లోపలికి వెళ్ళాడు.

సారధి లోపలికి వచ్చాడు. శరీఫ్ చేతికి కాయితం యిచ్చాడు. ఆ కాగితంలో యేవో అంకెలూ, కారు పైర్ల

డిజైనూ వున్నాయి. సుబ్బరామయ్య కణ్ణన్‌ని వెంటపెట్టు కొని వచ్చాడు.

కణ్ణన్ త్యాగరాజుకీ భూషణానికీ జరిగిన ఘర్షణ కళ్లకి కట్టినట్టుగా వర్ణించాడు.

"వాళ్లిద్దరూ ఘర్షణపడటం యింకా యెవరెవరు చూశారు?"

"సుశీల తనగది గుమ్మంలో నిలబడి వుంది. నేనూ వంట వాడూ వంటయింటి గుమ్మంలో వుండి చూశాము...."

"మీలో యెవ్వరూ కలగజేసుకోలేదా?"

"ఎటు మాట్లాడినా త్యాగరాజుతో తంటా తెచ్చు కొన్నట్టే సార్! కష్టమర్స్ గొడవలు మాకేల?" అన్నాడు కణ్ణన్.

"త్యాగరాజు మరల ఇక్కడికి వచ్చాడా?"

"తెలీదు సార్!"

"అతడు గాయాలతో నర్సింగ్ హోంలో చేరినట్టు భూషణం నాతో అన్నాడు" మధ్యలో కలగజేసుకుని అన్నాడు సుబ్బరామయ్య.

"ఏ నర్సింగ్ హోంలోనో తెలుసా?"

"రామభద్రంగారిది. ఫెయిర్ లేడీ జంక్షన్‌లో ఉందట!"

"భూషణం పోట్రిఫారం అమ్మాడు. ఆ అడ్రసు చెబుతారా?"

సుబ్బరామయ్య చెప్పాడు. గోపాల్ రాసు కొన్నాడు....

"ఇంత మారుమూల బార్ పెట్టడంవలన ఏమిటి లాభం వస్తుంది చెబుతారా?" అడిగాడు శిరీష్.

"నాకు పెద్దగా లాభాలు ప్రస్తుతంలో రావు—ఆ విషయం తెలుసు సార్! అయితే భవిష్యత్తులో యింత చోటు కూడా ఈ పట్నంలో దొరికేలా లేదు. అందుకని ముందే ప్లాట్ తీసుకున్నాను. అయినా యిప్పుడు నా ఖర్చులు బాగానే పోతున్నాయి" చెప్పాడు సుబ్బరామయ్య.

# 10

"శవంమీద గానీ, దుస్తులమీదగానీ ఇతరుల వ్రేలి ముద్రలు లేవు" అని చేతిలో వున్న రిపోర్టును బల్లమీద ఉంచాడు గోపాల్.

"వ్రేలిముద్రలు పడే అవకాశం లేదు. భూషణం దగ్గర ఉన్న బాగ్ లాక్కోవడం వెంటనే కత్తితో గాయ పరచడం చేశాడు హంతకుడు. భూషణం వెనక డోర్ దగ్గర నిలబడ్డాడట. అంటే కారులో హంతకుడూ ఉన్నాడన్నమాట. ఏమైనా యిది ముందు పథకంవేసుకుని చేసిన హత్య!"

"అవును శిరీష్! భూషణం తన సొమ్మును విత్ డ్రా చేసుకొనేవరకూ వేచివున్నాడు హంతకుడు. పట్టపగలే రోడ్డుమీద హత్యచేసి పారిపోయాడు. నల్ల అంబాసిడర్ కోసం ప్రయత్నం చేయమని మా సిబ్బందికి ఆదేశాలిచ్చాను."

"ఫలితం వుంటుందనుకోను. రెండువందల రూపాయలతో నలుపురంగు మరో రంగుగా మారిపోతుంది."

సార్జెంట్ లోపలికి ప్రవేశించి శల్యూట్ చేసి సీల్ చేసిన కవరు గోపాల్ కి యిచ్చాడు. గోపాల్ అతడిని వెళ్ళిపొమ్మని సైగచేసి, కవరు తెరిచాడు.

"డాక్టర్ రిపోర్ట్! చదువుతా విను" అని గోపాల్

పైకి చదవసాగాడు.

"హత్య ఉదయం పదిగంటల ముప్పై—నలభై నిమిషాల మధ్య జరిగింది. పదునైన కత్తితో గాయపరచడంతో శ్వాసనాళం మొత్తం తెగిపోయింది. వెనుక వెన్నెముక పట్టు తప్ప తల మొండెంతో సంబంధం లేకుండా పోయింది. గాయం తగిలిన క్షణాల్లో ప్రాణం పోయి ఉంటుంది" చదవడం ఆపి, "ఆ తర్వాత గాయం లోతు, కొలతలు రాసి వున్నాయి. బ్లడ్ గ్రూప్ 'ఎ బి' అట" అన్నాడు గోపాల్.

శిరీష్ ముందుకి వొంగి, "కత్తి ఎలాంటిదో రాశారా?" అడిగాడు.

"రాశారు. పొడవుపాటి కత్తి అయివుండాలట! అందుకే గాయం మెడకి ఆ ప్రక్కనించి ఈ ప్రక్క వరకూ ఒకే లెవెల్‌లో సంభవించిందని రాశారు డాక్టర్."

"కత్తి మనకి దొరకదు. హంతకుడు కారులో పట్టుకునే పారిపోయాడు."

"సారథి నోట్ చేసిన కొలతలు యేవి? వాటనిబట్టి మనం కారు ఆచూకీ తీయగలమా?"

శిరీష్ తనకి సారథి యిచ్చిన కాగితం తీసి గోపాల్‌కి యిచ్చాడు "చక్రాల మధ్య కొలతలు నోట్ చేశాడు సారథి. సడెన్ బ్రేక్ వేయడంతో అంబాసిడర్ టైర్ల గుర్తులు స్పష్టంగా రోడ్డుమీద ముద్రపడ్డాయి. వెనుకనున్న చక్రాల టైర్లలో ఎడమ టైర్‌కి పెద్దసైజు నారింజ తొన మాదిరిగా పెచ్చు వూడిపోయింది. ఆ ప్రాంతం తప్ప టైరు ముద్ర స్పష్టంగా ముద్ర పడి ఉంది...." అన్నాడు.

"వెనక టైర్ అని యెలా చెప్పగలవు?"

"ముందు చక్రం టైర్ అయివుంటే రన్నింగ్ లో దాని మీదకు వెనక చక్రం వచ్చేది. ముద్ర కొంతవరకైనా చెరిగిపోయి ఉండేది కదా."

"యూ ఆర్ కరెక్ట్!"

"నర్సింగ్ హోంలో త్యాగరాజును కలుసుకుందాం— పద!" ఇద్దరూ జీప్ యెక్కి బయలుదేరారు.

నర్సింగ్ హోంలో త్యాగరాజుకి యింజక్షన్ చేస్తూ కనిపించాడు డాక్టర్. గోపాల్, శిరీష్ గదిలో అడుగు పెట్టి త్యాగరాజు పడుకున్న బెడ్ను సమీపించారు. ఇద్దరినీ చూడగానే త్యాగరాజు ఆశ్చర్యపోయాడు.

"ఎలా వుంది నీ ఒంట్లో?" అడిగాడు గోపాల్.

త్యాగరాజు బాధగా అటునుండి ఇటు తిరిగి "ఫరవా లేదు. డాక్టర్ గారు మాత్రం రెండు రోజులవరకూ కదల వద్దని చెప్పారు" అన్నాడు.

"నిన్ను భూషణం అంత గట్టిగా కొట్టాడా? ఆశ్చర్యం! సంత పేట రౌడీ నని ప్రగల్భాలు పలుకు తావు."

త్యాగరాజు మొహం ఎర్రబడింది.

"చట్టం అడ్డుపడినా సరే, నేను వాడిని దెబ్బతీయనిదే వదలను."

"అతడిమీద నీకు కక్ష అనవసరం!"

"మీకు తెలియదు సార్! అతడు కావాలనే పాల్ట్రీని నాకు అమ్మకుండా రామ్మూర్తికి అమ్మాడు."

"అందుకే భూషణాన్ని చంపించావా?" గోపాల్ సూటిగా చూచి అడిగాడు.

త్యాగరాజు ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసి

చూశాడు.

"చంపించడమా....? భూషణాన్ని యెవరైనా చంపారా?"

"ఆశ్చర్యం నటించక! నిన్ను యింత గట్టిగా దెబ్బ తీసిన వాడిని నువ్వు అంత సులువుగా వదులుతావనుకోను. నిజం చెప్పు."

"నేను రౌడీనే. కాదనను. వాడిని దెబ్బతీస్తే నేనే దెబ్బ తీస్తాను. నా క్రిందవాడి సహాయంకోసం యెదురు చూడను. ఆ రోజు బార్‌కి వెళ్ళినప్పుడు కూడా నేను ఒక్కడినే వెళ్ళాను. వాడిమీద మనిషిని నియోగించ వలసిన అవసరం నాకు లేదు."

"త్యాగరాజూ! అనుమానితులలో మొదటివాడివి నువ్వు. నీ మీద నిఘా ఉంటుందనే విషయం నీకు విడిగా చెప్పనక్కర లేదనుకుంటాను. నువ్వుగానీ, నీ అనుచరులు గానీ తప్పులు చేసివుంటే నా గుప్పిట్లోంచి బయటికి పోరు. అర్థం చేసుకో. పట్నం వదలిపెట్టి వెళ్లక! అది క్షేమం కాదు."

గోపాల్ తీవ్రస్వరంతో హెచ్చరించాడు.

త్యాగరాజు నిర్లక్ష్యంగా తలెగరేశాడు.

# 11

"మీరేనా డిటెక్టివ్ శిరీష్! పేపర్‌లో ఫోటో చూశాను. చాలా కాలం అయివుంటుంది. మిమ్మల్ని కలుసుకోవడం చాలా సంతోషం. చెప్పండి. మీకు నేనెలా సహకరించగలను?" అన్నాడు రామ్మూర్తి.

సమాధానంగా శిరీష్ నవ్వి రామ్మూర్తితో కరచాలనం చేశాడు. "భూషణం హత్య చేయబడటం మీకు తెలిసివుండాలి. హంతకుడిని పట్టుకునే ప్రయత్నంలో

ఉన్నాను."

"కేవలం మీ ఆసక్తితోనా?"

"కాదు."

"మరి? అతడికి బంధువులెవరూ లేరు. పరిశోధన చేయమని మిమ్మల్ని యెవరు కోరారో ఆశ్చర్యంగా ఉంది."

"సుశీల కోరింది."

"సుశీలా! చాలా ఆశ్చర్యంగా ఉంది. కొంతమంది సంసార స్త్రీల కంటే సుశీల చాలా నయం అన్న మాట!"

శిరీష్ తల పంకించి, "ప్రాపర్టీని మీకు అమ్మకముందు దీన్ని త్యాగరాజు కొనాలనుకున్నాడట! ఆ విషయం మీకు తెలుసా?" అన్నాడు.

"తెలుసు. అయితే మార్కెట్లో వున్న వస్తువును కొనుక్కోవడానికి ఒకరి యిష్టాయిష్టాలు అనవసరం. మీరూ ఒప్పుకుంటారనుకుంటాను."

"ఎందుకు ఒప్పుకోను? అయితే ఈ మాత్రం ప్రాపర్టీ కారంకోసం త్యాగరాజూ మీరు పోటీలు పడటంలో అర్థం లేదు."

"నాకు తెలిసి పదేళ్ళలో పట్నం రూపురేఖలు మారిపోయాయి. అన్నిప్రక్కలా కొండలను తాకి ఇంకా పైకి ప్రాకుతోంది. కొండ అవతల వున్న లోయలూ, చిట్టడవులూ భవంతులతో కళకళ లాడుతున్నాయి. కొంత కాలానికి ప్రాపర్టీ వున్న స్థలమే రాదు నేను పెట్టిన పది వేల రూపాయలకి!"

అంతలో గుమ్మంలో చారల చొక్కా, నల్ల పాంటూ వేసుకున్న యువకుడు కనిపించాడు. రామ్మూర్తి అతడి

వైపు కోపంగా చూచి అంతలోనే ముఖకవళికలు మార్చుకున్నాడు.

"ఒక గంట పోయాక రా బాబూ! ఉద్యోగం విషయం మాట్లాడదాం!" అన్నాడు రామ్మూర్తి ఆ యువకుడితో.

యువకుడు నిర్లిప్తంగా బయటకు వెళ్ళిపోయాడు.

"మీరు జరిగిన సంగతి చెప్పండి." అన్నాడు శిరీష్.

రామ్మూర్తి తెల్లబోయాడు. "జరిగిన సంగతేమిటి?" అన్నాడు.

శిరీష్ లేచాడు. రామ్మూర్తి కొంతవరకూ ఏవో సంగతులు దాస్తున్నాడు. ఇప్పట్లో చెప్పడు. పరిస్థితులు మరింతగా దాడి చేయాలి. అంతవరకూ పెదిమ విప్పడు.

రామ్మూర్తి దగ్గర సెలవు తీసుకొని శిరీష్ వెళ్ళిపోయాడు.

## 12

"సుశీలా! సుశీలా!" పిల్చాడు కణ్నన్.

సుశీల తలుపు తెరిచి చూచింది.

"నీ కోసం ఫోన్ వచ్చింది." అన్నాడు కణ్నన్.

సుశీల నవ్వుకొంది. కణ్నన్ మళయాళ దేశంనుంచి వచ్చాడు. ఎంత బాగా నేర్చుకున్నప్పటికీ పరాయి భాష పరాయిభాషే!

"ఎవరు ఫోన్ చేశారో అడిగావా?"

"లేదు. మగవాళ్ళే, యెవరో!"

సుశీల గది తలుపులను దగ్గరగా వేసి ఫోన్ ఉన్న గదికేసి నడిచింది.

"నేను.... సుశీలను మాట్లాడుతున్నాను." అన్నది రిసీవరెత్తి.

"సుశీలా! నేను చెప్పేది జాగ్రత్తగా విను."

సుశీల కొయ్యబారిపోయింది. ఈ గొంతు యెవరిది? తనకి పరిచయంలేని గొంతు.

"ఎవరు మీరు?" అడిగింది.

"నేను యెవరినయినా నీకు ఒక్కటే - శ్రేయస్సు కోరితే చాలు కదా!"

"................"

"నీకు భూషణం యెటూ ఇక లేడు కదా! నాతో లేచి వచ్చెయ్యి. సుబ్బరామయ్యని బతిమాలి స్వేచ్ఛ పొంది నాతో వచ్చెయ్యి."

"ఎవరు నువ్వు" సుశీల అసహనంగా అరిచింది.

"భూషణంకంటె వయసులో చిన్నవాడిని. పైగా అందగాడిని!" పకపక నవ్వాడు.

"ఛీ....నీకు బుద్ధి వుందా?"

"కంగారులేదు. ఆలోచించుకో! మనం దూర తీరాలకు ఎగిరిపోదాం. తిరిగి మధ్యాహ్నం రెండు గంటలకు ఫోన్ చేస్తాను. ఫోన్ దగ్గరే కాచుకుని ఉండు." అవతలనించి ఫోన్ పెట్టేసిన శబ్దమయింది.

సుశీల చిరాకుగా రిసీవర్‌ని క్రెడిల్ చేసి, చుట్టూ చూసింది. అదృష్టం! ఎవరూ లేరు. తమ మాటలు యెవరూ వినలేదు. నీరసంగా తన గదికేసి నడిచింది.

# 13

ఇన్‌స్పెక్టర్ గోపాల్ టోపీ తీసి బల్లమీద పెట్టి, నీరసంగా కళ్ళు మూసుకొని కుర్చీలో కూలబడ్డాడు. డిటెక్టివ్ శిరీష్ పరిస్థితి ఇంచుమించు అలాగే వుంది.

"నువ్వన్నట్టు అంబాసిడర్ కార్ల వ్యవహారం ఇంత వరకూ లాగాం కానీ కేసు ఒక అంగుళం కూడా ముందుకి

వెళ్ళలేదు." అన్నాడు గోపాల్.

"హంతకుడు ఉపయోగించిన కారు ఒరిజినల్ నల్ల రంగుదే అయివుంటే ఇంతవరకూ మనం వెతికిన నల్లఅంబాసిడర్లలో ఏదో ఒకటి అయి వుండేది. ఒరిజినల్ రంగు మరేదో అయి ఉండాలి."

శిరీష్ మాట ముగిసే లోపుగా టెలిఫోన్ గణ గణ లాడింది.

గోపాల్ చెయ్యి చాపి బల్లమీద ఉన్న ఫోన్ అందుకొని, "హలో—ఇన్‌స్పెక్టర్ గోపాల్ స్పీకింగ్...." అన్నాడు.

అవతల మాట్లాడేవారి మాటలు విని అటెన్షన్‌లోకి వచ్చాడు.

"ఎస్ సార్.... నేను సార్.... నా ప్రయత్నంలో లోపం లేదు సార్! ఎస్ సార్....కొత్తగా డెవలప్ అవుతోన్న కాలనీలో ఇలాంటి సంఘటన జరగకూడదు సార్! హంతకుడిని త్వరలో పట్టుకుంటాం సార్!"

అవతల ఫోన్ క్లిక్ మన్నది. గోపాల్ కోపంగా రిసీవర్ కేసి చూచి, క్రెడిల్ చేశాడు.

"మీ కమీషనర్ బాగా అక్షింతలు వేశాడా?" అడిగాడు శిరీష్.

"వాళ్ళకి కుర్చీల్లో ఫానుక్రింద కూర్చోవడం తప్ప రంగంలో మాకి పని చేయడం ఏం తెలుస్తుంది?"

ఫోన్ మరల గణ గణ లాడింది. గోపాల్ మాట్లాడటం ఆపి రిసీవర్ ఎత్తాడు.

"ఏమ సీ. నేను సార్ సారథిని! సుశీలను ఎక్కించుకొన్న ఆటో స్టేషన్ రోడ్లో వెడుతోంది. నేను వెంటాడుతోన్నాను. ఆటో డ్రైవర్ తెల్ల బట్టలు వేసుకున్నాడు.

వాళ్ళకి తోలు చెప్పాలు."

అవతల క్లిక్‌మంది.

గోపాల్ క్లుప్తంగా శిరీష్‌కి విషయం చెప్పి, రిసీవర్ క్రెడిల్ చేశాడు. ఇద్దరూ బయటికి పరుగెత్తారు.

## 14

"హుష్...." నిస్త్రాణగా మంచంమీద వాలింది సుశీల. పై కప్పుకేసి చూచింది. ఏనాటిదో సీలింగ్ ఫాన్ తిరగనా ఆగనా అన్నట్టు తిరుగుతోంది.

గాలి తగులుతోన్నప్పటికీ ఆమె శరీరంలో వడదెబ్బ తగిలినట్టు ఉష్ణం పుడుతోంది.

ఫోన్ కాల్ విన్నప్పటినించీ దడగా వుంది. మరల రెండు గంటలకి ఫోన్ చేస్తాడట! సుబ్బరామయ్యకి చెప్పి తను వాడితో లేచిపోవాలట! తను ఎంతగా వీధినపడినా తనకో మనస్సూ, ఇష్టమూ వుంటాయని వూహించలేని మూర్ఖుడు! అసలు ఆ మూర్ఖుడెవరో!

సుశీల మనసు ఒక్క క్షణం ఆలోచనారహిత మయింది. వెంటనే కొత్త ఆలోచనతో బాటు వుత్కంఠ రేగింది. అవును. తనకి ఫోన్ చేసిందెవరు? అతడే భూషణాన్ని చంపి ఉంటాడా?

సుశీల గుండె కొట్టుకోవడం ఆగిపోయింది కొన్ని క్షణాలపాటు.

సుశీల లేచి గూటిలో వున్న రిస్టు వాచీ తీసుకొని చూచింది. రెండు గంటలు కావడానికి ఇంకా అయిదు నిమిషాలుంది. ఆలోచించుకొంటూ గది బయటికి నడిచింది.

వంటవాడు సుశీలను చూచి "మధ్యాహ్నం భోజనం చేశావా?" అన్నాడు.

సుశీల నీరసంగా నవ్వి, "కాస్త మజ్జిగ యివ్వు. ఆకలిగా లేదు." అంది.

వంటవాడు లోపలికి వెళ్ళి మజ్జిగ తెచ్చి ఆమెకి యిచ్చాడు. ఆమె త్రాగి అతడికి గ్లాసు ఇస్తోండగా ఫోన్ గణ గణలాడింది.

సుశీల గబగబ ఫోన్ ఉన్న బల్లకేసి నడిచి రిసీవ రందుకొంది.

"సుశీలా!" అవతలనించి వినిపించింది.

"నే.... నే!" క్రీగంట చూచింది. వంటవాడు లేడు.

"బాగా ఆలోచించుకున్నావా?" అడిగాడు అవతల నించి.

'ఆ గొంతు ఎవరిదో తనకు పరిచయమున్న గొంతే! అయితే కావాలని మాట మార్చి మాట్లాడటమో, నోటికి అడ్డంగా పల్చటి కాగితం పెట్టుకుని మాట్లాడ టమో చేస్తున్నాడు అతను.'

"ఏమిటి యింకా ఆలోచిస్తున్నావు?" అడిగాడు అతడు కంఠంలో దర్పం ధ్వనిస్తూ.

"నీతో ఎలా రాగలనూ? నువ్వెవరో నాకు తెలి యదు."

"సాంప్రదాయ వివాహాల్లో పెళ్ళి కూతురూ పెళ్ళి కొడుకూ ఒకరి ముఖ్కా మొహమూ ఒకరికి తెలియని వాళ్ళే!" అతడు నవ్వాడు.

"అయినా నువ్వు హంతకుడివి. హంతకుడితో నేను కాపురం చేయగలనని యెలా అనుకొంటున్నావు?"

అతడు పకపక నవ్వి, "ఇంతకీ నువు అర్థం చేసుకున్నది ఈమాత్రమేనా? భూషణాన్ని హత్య చేసింది నేను కాదు." అన్నాడు.

"అబద్ధం?" అరచింది సుశీల.

"నాది అబద్ధం అయితే నాతో రావడానికి అభ్యంతరం లేదు కదా!"

"లేదు."

"వెరిగుడ్! నాతో బయల్దేరిరా. భూషణాన్ని హత్య చేసిన వాడిని చూపిస్తాను."

సుశీల ఆలోచించింది. "వస్తాను. ఎలా?" అంది.

అతడు చెప్పసాగాడు.

# 15

పోలీస్ జీపు సడెన్ బ్రేక్‌తో ఆగింది. బ్రేకులు కీచుమని శబ్దం చేశాయి.

టెలిఫోన్ బూత్ ప్రక్క జనం గుమిగూడి వున్నారు. శిరీష్ గుండె దడ దడలాడింది. ఇక్కడినుండే సారధి అయిదు నిమిషాల క్రితం ఫోన్ చేశాడు.

శిరీష్, గోపాల్ జీపులోంచి క్రిందకు దూకారు. బూత్ కేసి పరుగెత్తారు. గుంపును తప్పించుకొని మధ్యకి వెళ్ళి చూశారు.

సారధి బోర్లాపడి వున్నాడు.

శిరీష్ కంగారుపడి వొంగి నాడి అందుకొని చూశాడు. తల పంకించాడు. సారథి జుత్తు నిమిరాడు. ఎత్తుగా బొప్పి తగిలింది చేతికి.

"ఫరవాలేదు. తలమీద కొట్టి స్పృహ తప్పించాడు." అని జేబులోంచి స్మెల్లింగ్ సాల్ట్ తీసి సారధికి వాసన చూపించాడు శిరీష్.

సారధి మెల్లగా కదిలాడు. కళ్ళు తెరిచాడు. లేచి కూర్చోవడానికి శిరీష్ సహకరించాడు,

"ఏం జరిగింది!" వొంగి కూర్చుండి అడిగాడు గోపాల్.

సారథి గుర్తు చేసుకోవడానికి ప్రయత్నించసాగాడు.

## 16

ఆటోలో వెడుతోన్నప్పటికీ సుశీల ధైర్యంగానే ఉంది.

తను బార్‌లోంచి బయటకు వచ్చి కొండ వారనే ఉన్న రోడ్డు పట్టుకుని నడుస్తోంది. ఫోన్‌లో తనని అతడు ఆదేశించినట్టు జీడి మామిడి చెట్టు చాటున ఆగింది.

రోడ్డుకి అవతలనించి ఆటో వస్తూ కనిపించింది. తెల్లటి బట్టలు కట్టుకున్న వ్యక్తి ఆటో తోలుతున్నాడు.

సుశీల గుండె దడ దడలాడింది.

'ఒకవేళ అతనే హంతకుడా?' సుశీల గుండె దడ దడలాడింది.

'అతడు డ్రైవర్. హంతకుడై ఉంటే అంత ధైర్యంగా ఆటో తోలుకుంటూ యెలా వస్తాడు.'

ఆటో తిన్నగా వచ్చి సుశీల ముందు ఆగింది.

"సాయంకాలం అవుతోంది!" అన్నాడు ఆటో డ్రైవర్.

"అవును పక్షులు ఎగిరి గూటికి చేరుకోవాలి." అంది సుశీల.

ఫోన్‌లో మాట్లాడిన వ్యక్తి చెప్పిన సంకేతం అది!

సుశీల సందేహించకుండా ఆటో యెక్కి కూర్చుంది. ఆటో కదిలింది. అప్పుడే సారథి స్కూటర్ పై వెళుతూ తనని చూశాడు. సుశీల ఆటోలోంచి వెనక్కి తిరిగి చూచింది. ఆమె గుండె ఆనందంతో . గంతు వేసింది.

'సారథి స్కూటర్ మళ్ళించాడు. ఫరవాలేదు.- ఆటోని వెంబడిస్తాడు.' సుశీల తృప్తిగా నిట్టూర్చింది.

**45**

ఆటో సీతమ్మ ధార రోడ్డు వదిలి శాంతినగర్ పట్టింది. ద్వారకానగర్ మీదుగా దొండపర్తి దాటి స్టేషన్ రోడ్లోకి ప్రవేశించింది. వాల్తేరు రైల్వేస్టేషన్‌కి ఇవతల స్కూటర్ ఆగి ఉంది. అది సారథిదే! సందేహం లేదు. అంటే.... సుశీల మనసులోనే సారథి నైపుణ్యానికి కృతజ్ఞతలర్పించుకుంది.

ఆటో స్టేషన్ దాటి బ్రిడ్జి క్రిందనుండి గోపాలపట్నం పోయే రోడ్లోకి తిరిగింది. సెయింట్ జోసెఫ్ కాన్వెంటుకి అవతల ఆగింది. డ్రైవర్ ఆటోలోంచి దిగాడు. ఆటో ప్రక్కనే నల్ల అంబాసిడర్ కారు ఆగింది.

డ్రైవింగ్ సీటులో ఉన్న వ్యక్తి ఫుల్ సూట్‌లో ఉండి మొహం కనిపించకుండా ఫెల్ట్‌హాట్ పెట్టుకున్నాడు. ఆటో డ్రైవర్ సుశీలకి సైగచేసి కారులో వెనక డోర్ తెరచి పట్టుకున్నాడు.

సుశీల ఆటో దిగి కారు ఎక్కింది. ఆమె ప్రక్కగా ఆటో డ్రైవర్ ఎక్కి కూర్చున్నాడు.

అంబాసిడర్ ముందుకి బయలుదేరింది. జ్ఞానాపురం యివతలప్రక్క రోడ్‌లోకి మళ్ళి తోటలకేసి పరుగులు తీసి జనం లేనిచోట ఆగింది.

"సుశీలా! కారులోవుండే మాట్లాడుకుందాం. నాతో రావడానికి ఒప్పుకున్నావు కాబట్టి చెబుతున్నాను. భూషణాన్ని హత్య చేసింది నీ ప్రక్కనున్న వ్యక్తి" అన్నాడు సూట్‌వాలా, తల త్రిప్పకుండానే.

సుశీల భయంగా ప్రక్కకి చూచింది. ఆమెకి ఒళ్ళు జలదరిస్తోంది. తన భూషణాన్ని మట్టుపెట్టిన వ్యక్తి ప్రక్కనేనా తను ఇంతసేపూ కలసి ప్రయాణించింది?

"నువ్వు అతడిని తెలుసుకున్నా పోలీసులకు పట్టించ

లేవు. మనం యిద్దరం ఈ చట్టాలకీ, కేసులకీ చాలా దూరంగా ఎగిరిపోతాం. గతాన్ని మరచిపోతాం!" అన్నాడు సూట్ వాలా.

సుశీల ముందుకి వొంగి, "నువ్వా!" అన్నది. ఆమెలో రేగిన వుత్కంఠకి అంతు లేకుండాపోయింది.

"అవును. నేనే!"

"హంతకుడివి నువ్వేనంటాను. నిన్ను ఇప్పుడే పోలీసులకు పట్టిస్తాను." పిచ్చిగా అరిచింది సుశీల.

"నోర్మూయ్. పోలీసులు ఎవరిని పట్టుకుంటే వాళ్ళే హంతకులు!" కోపంగా అరిచాడు సూట్ వాలా.

సుశీలలో భయమూ అసహాయతా చోటు చేసుకున్నాయి.

ఆటో డ్రైవర్ విండ్ స్క్రీన్ ఎత్తాడు. సూట్ వాలా ముందుడోర్స్‌ని ఎత్తాడు. సుశీల ఇద్దరినీ భయంగా చూచింది.

# 17

"ఆటోనా! చాలా ఆటోలు వెళ్ళాయి సార్! యెలా గుర్తుంటుంది సార్?" అన్నాడు బ్రిడ్జి సమీపంలో వున్న కానిస్టేబులు.

శరీఫ్ ఓపికగా చూస్తున్నాడు.

గోపాల్, "ఆటో డ్రైవర్ లాగా అతడు ఖాకీ యూనిఫాంలో ఉండడు. తెల్లబట్టలు వేసుకున్నాడు. వెనక సీట్లో ఆడమనిషి ఒక్కతే వుంటుంది. గుర్తు తెచ్చుకో! ఈ దారిన వెళ్ళి అయిదు నిమిషాలు కూడా కాదు" అన్నాడు.

కానిస్టేబుల్ ఆలోచించి,గోపాలపట్నం పోయే రోడ్డు కేసి చూపించి యేదో చెప్పసాగాడు. అంతవరకూ జీపు

ఆగలేదు. రోడ్డును మింగేస్తూ జీపు సెయింట్ జోసెఫ్స్ కాన్వెంటు దాటుతోంది.

"అదిగో సార్! ఆటో! అదే! రోడ్డుప్రక్కన వుంది" అరిచాడు సారథి.

"అదే అని ఎలా తెలుసు?"

"ఆటో నెంబర్ యిందాక నాకు కనిపించలేదు. వెనక 'సర్కస్ రాముడు' అని రాసి వుండటం చూసిన గుర్తు" అన్నాడు సారథి.

వాహనాల వెనుక తమ అభిమాన నటుల సినిమా పేర్లు రాసుకోవడం విశాఖపట్నం అద్దె వాహనాల సొంత దారుల సరదా! శిరీష్ చిరునవ్వు నవ్వాడు.

జీపు ఆటో ప్రక్కగా ఆగింది. ఆటోలో ఎవరూ లేరు. శిరీష్ వొంగి వెనకసీట్లో చూశాడు. వాడిపోయిన పూల రేకులు రాలి వున్నాయి. సందేహం లేదు. సుశీల ప్రయాణించిన ఆటో ఇదే!

"గోపాల్! ఆటో హేండిల్ మీద హంతకులవి గానీ, హత్యకి సహకరించిన వారివిగానీ వ్రేలిముద్ర లుంటాయి. ఆటో దగ్గర ఎవరినైనా కానిస్టేబులును వుంచు"అన్నాడు శిరీష్.

గోపాల్ ప్రక్కనే వున్న పెట్రోలు బంక్ కేసి నడిచాడు. శిరీష్ పేవ్ మెంటుమీద కూర్చున్న ముసలి బిచ్చకత్తె దగ్గరకు వెళ్ళి, "మామ్మా! యెంత సేపట్నుంచి వున్నావు?" అన్నాడు!

"పొద్దుట్నించీ యిక్కడే వున్నాను బాబూ!" అంది బిచ్చగత్తె.

"అయిదు నిమిషాల ముందు యిక్కడో ఆటో ఆగింది. చూశావా?"

"చూశాను బాబూ! ఎవరో పడుచుపిల్ల కారెక్కింది. తెల్లబట్టలేసుకున్న కుర్రాడూ కారెక్కాడు."

"కారా? ఏ కారు?"

"నల్ల కారు బాబూ!" అంది ముసలావిడ.

"ఎలా వెళ్ళింది మామ్మా?"

చెప్పిం దావిడ.

శిరీష్ మామ్మ చేతిలో అయిదురూపాయల నోటు పెట్టి "చాలా సంతోషం మామ్మా!" అన్నాడు.

మామ్మ తెల్లబోయింది.

ఇన్ స్పెక్టర్ గోపాల్ శిరీష్ దగ్గరకు వచ్చాడు.

"మా మనుషులు వస్తున్నారు. అంతవరకూ సారధిని యిక్కడ ఉంచి మనం వెళ్ళవచ్చును...." అన్నాడు గోపాల్.

శిరీష్ తలూపి సారధికేసి సాభిప్రాయంగా చూశాడు. సారధి ఆటో దగ్గర నిలబడ్డాడు. గోపాల్ జీపులో ఎక్కి కూర్చున్నాక శిరీష్ జీపు డ్రయివ్ చేయసాగాడు.

అడుగడుగునా జీపు ఆపి శిరీష్ దార్లో పోయేవాళ్ళని నల్ల అంబాసిడర్ కారును గురించి దర్యాప్తు చేస్తూ వచ్చాడు. అడిగీ అడిగీ అతనికి విసుగు పుట్టుకొస్తోంది.

"నల్ల కారా సార్! ఇప్పుడే తోటలోంచి యిలా రోడ్డెక్కి గోపాలపట్నం వైపు పోయింది సార్!" అన్నాడు రోడ్డు ప్రక్కనే వున్న కిళ్ళీ దుకాణంలోని వ్యక్తి.

"ఈ తోటలోంచా? అంబాసిడర్ కారేనా?"

"అవును సార్!" అన్నాడు అతను.

"తోటలోంచి రావడం యేమిటి శిరీష్?" అడిగాడు

గోపాల్.

శిరీష్ కిళ్ళీకొట్టతనికి కృతజ్ఞతలు చెప్పి, "ముందు తోటలోకి వెళ్దాం పద!" అంటూ మట్టిదారిలోకి జీపు మళ్ళించాడు.

శిరీష్ సడన్‌గా జీపు ఆపి, "కారు టైర్ల గుర్తులు చెరగకుండా త్వరగా నడచి వెళ్దాం. దిగు గోపాల్!" అన్నాడు.

ఇద్దరూ జీపు దిగి టైర్ గుర్తుల వెంబడి నడవసాగారు. "కిళ్లీకొట్టతను చెప్పింది నిజమే! అయిదు పది నిమిషాల క్రితమే అంబాసిడర్ ఈ దారిన వెళ్ళి మరల వెనక్కి తిరిగి వచ్చింది" అంటూ శిరీష్ వంగి టైర్ గుర్తులను పరిశీలించి, "సందేహంలేదు. అదే అంబాసిడర్ కారు! వెనక టైర్లలో ఒకదానికి పెద్దసైజు నారింజతొన ప్రమాణంలో పెచ్చు లేనట్లు ముద్ర అదిగో!" అన్నాడు.

గోపాల్ నిట్టూర్చాడు. ఇద్దరూ చురుకుగా అడుగులు వేశారు. తోటలో చెట్లు వరుసలు వరుసలుగా వున్నాయి. ఒక చెట్టు ప్రక్కగా యెవరో పడుకున్నట్టు కాళ్ళు కనిపిస్తున్నాయి....యిద్దరూ పరుగు పరుగున అటు వెళ్ళారు.

సుశీల నేలమీద పడివుంది. ఒక చెయ్యి కింద వున్న ఎండుటాకులమీదా మరో చెయ్యి పొట్టమీదా వున్నాయి. తల ఒక ప్రక్కకు వాల్చి వుంది. మెడ ప్రాంతంలో ఎర్రగా కమిలిపోయి వుంది. నరాలు గాలి పోసుకున్నట్టు వుబ్బిపోయాయి. కళ్ళు పగిలిన పత్తికాయల్లాగా తెరుచుకుని ఉన్నాయి.

శిరీష్ వొంగి ముక్కుదగ్గర చెయ్యిపెట్టిచూసి పెదిమ విరిచాడు.

గోపాల్ ఒళ్ళు పట్టుకు చూచి, "కొన్ని నిమిషాల క్రితమే ప్రాణాలు పోయి వుంటాయి. పాపం! మనమే ఆలస్యం చేశాం!" అన్నాడు.

శిరీష్ నిట్టూర్చాడు.

# 18

డిటెక్టివ్ శిరీష్ కుర్చీలో వెనక్కి వాలాడు. ఆలోచనలతో అతడి తల వేడెక్కి పోతోంది. సుశీల తనని భూషణం హత్యకేసు పరిశోధించమని కోరింది. సుశీల డబ్బుకి ఆశించి ఈ కేసును టేకప్ చేయలేదు తాను. అయినా అడుగడుగునా తను సారధి ప్రాణాన్ని పణంగా పెట్టవలసి వస్తోంది. సారధి చురుకైన యువకుడు. తనవద్ద వుండి అపరాధ పరిశోధనలో శిక్షణ పొందుతున్నవాడు. రామ్మూర్తిని మారు వేషంలో వెంటాడమని పంపించాడు తను.

తనకి కేసు ఒప్పగించిన సుశీల హత్య చేయబడింది. గొంతు నులిమి మరీ హత్య చేశాడు హంతకుడు. సారధి వెళ్ళి గంట అయినా ఫోన్ చేయలేదు.

సుశీల గుర్తుకి రాగానే ఆలోచనల్లో ఎక్కడో కొలికి తగిలినట్టయింది. చటుక్కున ముందుకి వొంగి ఫోన్ దగ్గరకు లాక్కున్నాడు. రిసీవర్ చేత్తో తీసుకుని నెంబర్ డయల్ చేశాడు.

అవతలనుండి, "హలో...." అన్నాడు ఇన్‌స్పెక్టర్ గోపాల్.

"నేను శిరీష్‌ని మాట్లాడుతున్నాను. ఎనాలిసిస్ వచ్చిందా?"

"వచ్చింది. నువ్వోసారి రా....!" అన్నాడు గోపాల్.

శిరీష్ వస్తున్నాని ఫోన్‌లో చెప్పి రాజ్‌దూత్ మీద బయలుదేరాడు.

"సుశీల గోళ్ళలో కనిపించిన మాంసం పోగులు మగవాడివి. గొంతు నులిమి హత్య చేసేటప్పుడు సుశీల ఆత్మ రక్షణకోసం హంతకుడిని బలంగా గిచ్చివుంటుంది. హంతకుడికి ముప్ఫయి-ముప్ఫయ్ అయిదు మధ్య వయసుంటుంది. ఆ యువకుడి చర్మంమీద నూనెమరకలూ, ఇతర మసాలా దినుసులూ, గ్లూకోజ్ అంటివున్న చిహ్నాలు ఎనాలిసిస్‌లో కనిపించాయిట!" అన్నాడు గోపాల్.

శిరీష్ ఆలోచనలో పడ్డాడు.

"ఆటోమీద వ్రేలిముద్రలు?"

"అవి పాత నేరస్తుడివి కావు. అన్ని పోలీస్ స్టేషన్స్‌కి పంపించాను. అన్నట్టు ఆటో దొంగిలించబడినట్టు టూ టౌన్ స్టేషన్‌లో రిపోర్టు అందిందట."

"శవం మీద అంటే గొంతు మీద వ్రేలిముద్రలు లేవా?"

"ఉన్నాయి. అవి కూడా పాత నేరస్తులవి కావు."

శిరీష్ వొంగి అతనికి సూచనలివ్వసాగాడు.

# 19

దూరంగా పోల్ట్రీ ఫారం కనిపిస్తోంది.

టాక్సీని ఆపి మీటర్ ప్రకారం అద్దె చెల్లించి శిరీష్ రోడ్డుమీద నిలబడ్డాడు. టాక్సీ వెళ్ళిపోయింది.

డబ్బు తడుముకున్నట్టుగా చేత్తో షర్టు జేబును తడిమాడు. పైన వేసుకున్న కోటు అడుగున పిస్తోలు తగిలింది.

రోడ్డు వదలిపెట్టి డొంకదారిలో దిగి పోల్ట్రీఫారం వెనక్కి చేరుకున్నాడు. చుట్టూ చూశాడు—తనని ఎవరూ

గమనించలేదు.

ఫారం చుట్టూ నాలుగడుగుల ఎత్తులో పిట్టగోడ వుంది. పిట్టగోడమీద చేతులు ఆనించి అవతల ప్రక్కకి చూశాడు.

ఫారం షెడ్డు దాటాక ఒక ప్రక్కగా చిన్న తాటాకు షెడ్డు వుంది. కొత్త తాటాకులు.

శిరీష్ అటు నడిచాడు. షెడ్లోకి చూచి తల పంకించాడు. షెడ్లో చాటుగా వున్నట్టుగా అంబాసిడర్ కారు వుంది. నల్లరంగు కారు. శిరీష్ కారు వద్దకునడిచి వ్రేలితో నలుపు రంగుమీద రాశాడు. నలుపు రంగు చేతికి అంటుకుంది.

నీలంరంగు అంబాసిడర్ మీద మసిలాంటి పెయింటు పులిమారు. అంతే! అది నల్ల రంగు అంబాసిడర్ కారు కాదు.

శిరీష్ వెనక్కి తిరిగాడు.

## 20

సూది ఎర్రగా కాలింది. సూట్ వాలా పట్టకారుతో సూదిని పట్టుకుని సారధి దగ్గరకు వచ్చాడు. సారధి కుర్చీకి కట్టివేయబడి వున్నాడు.

"చెప్పు. ఎవరు నువ్వు. ఎందుకు మమ్మల్ని వెంటాడుతున్నావు?" అంటూ సూదిని అతడి శరీరంమీద వుంచడానికి వొంగాడు.

"ఆగు చెబుతాను" అన్నాడు సారధి.

సూట్ వాలా నవ్వి, "అలా దారికి రా" అంటూ నిటారుగా నిలబడ్డాడు.

'మొహం వంచు' అన్నట్టు సారధి సైగ చేశాడు. అతను సారధి మొహంమీద తల వొంచాడు, సారధి

నరాలు కూడదీసుకున్నాడు. ఒంట్లోవున్న కండరాలశక్తిని తలలో కేంద్రీకరించాడు. బలం కొద్దీ తల విదిలించాడు సారధి.

సూట్ వాలా తలమీద సమ్మెట పడినట్టు గిలగిలలాడి వెనక్కి పడిపోయాడు. అతడి చేతిలో వున్న వెచ్చటి సూది అతడి తొడలో గుచ్చుకుపోయింది.

సూట్ వాలా 'కెవ్వు'న అరిచాడు. బాధతో గిలగిల కొట్టుకున్నాడు.సూదిని తొడలోంచి బయటకు లాగాడు. మెల్లగా లేచి నిలబడ్డాడు. రెట్టించిన కోపంతో సారధి కేసి వచ్చాడు. పట్టకారుతో అతడి తలమీద బలంగా కొట్టాడు. సారధి తల ప్రక్కకి తిప్పాడు.

పట్టకారు సారధి భుజంమీద పడేలోపులో సూట్ వాలా వెనక్కి కట్టెలాగా విరుచుకుపడిపోయాడు. సారధి ఆశ్చర్యంగా చూశాడు.

తలుపు చప్పుడు కాకుండా శిరీష్ ఎప్పుడు వచ్చాడో సారధిగానీ సూట్ వాలాగానీ చూడలేదు. పట్టకారుతో కొట్టబోతోన్న సోట్ వాలాని బలంగా మోకాళ్ళ వెనక భాగంలో తన్ని ప్రక్కకి తప్పుకున్నాడు శిరీష్. క్రింద పడిన సూట్ వాలాని రెండు భుజాలమీద ఫెడీమని తన్నాడు శిరీష్.

సూట్ వాలా మూలగసాగాడు. అతడి చేతిలో పట్టకారు లాక్కున్నాడు శిరీష్. చకచక సారధి కట్లు విప్పాడు.

"కణ్ణన్! నీ పార్టనర్ రామ్మూర్తి ఇప్పుడే గోపాల్ కి దొరికిపోయాడు. ఇక నువ్వెన్ని వేషాలు వేసినా లాభం లేదు" అన్నాడు శిరీష్.

సూట్ వాలా వేషంలో నేలమీద రొప్పుతోన్న కణ్ణన్ కళ్ళు మూసుకున్నాడు.

## 21

డిటెక్టివ్ శిరీష్ గౌరవార్థం పోలీస్ కమీషనర్ తన బంగళాలో విందు ఏర్పాటు చేశాడు. క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ గోపాల్, ఇతర పోలీసు ఉన్నతాధికారులూ విందుకు హాజరయ్యారు.

"మిస్టర్ శిరీష్! కణ్ణన్ మీద మీకు మొదటనుండీ అనుమానం వుందా? కేసు తికమకగా సాగింది. చివరకు కణ్ణన్ ప్రేమికు లిద్దరినీ చంపాడని యిప్పటికీ నమ్మలేక పోతున్నాము" అన్నాడు పోలీస్ కమీషనర్.

"ఈ కేసులో త్యాగరాజువలన, నల్లరంగుగా మార్చిన నీలంరంగు అంబాసిడర్ వలన కేసు చాలావరకూ తికమకగా తయారయింది. త్యాగరాజు తన బంధువులకు ఎవరికో మాట యిచ్చి ఆ మాట నిలబెట్టుకోవడంకోసం భూషణాన్ని అతడి పౌల్ట్రీఫారం అమ్మమని కోరాడు. అప్పటికే భూషణం నాలుగైదు చోట్ల పౌల్ట్రీఫారం అమ్ముతున్నట్టు ప్రచారం చేశాడు.

త్యాగరాజుకు పౌల్ట్రీఫారం అమ్మనని భూషణం ఎందు కనుకున్నాడో మనకి తెలియదు. అయితే నా వూహలో ఒక విషయం తోచింది. భూషణం తన ఫారంని ప్రాణప్రదంగా చూసుకుని వుండాలి. అందుకే త్యాగరాజువంటి రౌడీమనిషికి అతడు ఫారం అప్పగించలేదు.

రామ్మూర్తి ఫారం కొన్నాక అతడిచ్చిన సొమ్ముతో నిషా బార్‌కి వచ్చాడు భూషణం.

సుశీలమీద భూషణానికి ప్రత్యేకమైన మమకారం వుంది. ఆమె శీలంమీద గాకుండా ఆమె బుద్ధిమీద అభి

మానం పెంచుకున్నాడు భూషణం.

భూషణం వ్యవహారం కణ్ణన్‌కి బాగా అర్థమయింది. రామ్మూర్తిని కలిశాడు. రామ్మూర్తి కృతఘ్నుడు. తనకి ఫారం అమ్మి భూషణంకు నెలకి రెండువందలు ప్రత్యేక లాభం యిస్తానన్నట్టు రామ్మూర్తి ఒప్పుకున్నాడు. ఈ రకంగా పదేళ్ళపాటు యివ్వాలి. అంటే ఇరవై నాలుగు వేల రూపాయల డబ్బు ఇంకా భూషణానికి రామ్మూర్తి ఇవ్వాల్సి వున్నాడు. అతను గనుక చనిపోతే డబ్బు తనకు మిగులుతుంది. రామ్మూర్తీ, కణ్ణన్ కలసి అతన్ని చంపేసి ఆ సొమ్ము దొంగిలించటానికి పథకం వేశారు. దొంగిలించిన డబ్బు, సుశీల కణ్ణన్‌కు దక్కుతుంది.

భూషణం సుశీలతో తమ వూరు వెళ్ళిపోయి సుఖపడతాడు. ఈ ఆలోచన కణ్ణన్‌ని బాగా ప్రేరేపించింది. భూషణం స్థానంలో తాను వుంటే! ఆ డబ్బుతో సుశీలతో సుఖజీవనం గడపవచ్చును. వీధిపిల్ల జీవితం కంటే సంసార జీవితం మెరుగు అని సుశీలకి తెలుసు. అదీగాక ఆ సంసార జీవితంలో భూషణం అయితేనేం? కణ్ణన్ అయితేనేం? యెవరైనా ఆమెకి ఒక్కటే—ఎవరో ఒక్కరే ఆవాలి. అంతే!—ఇదీ కణ్ణన్ ఆలోచన.

అయితే సుశీల కణ్ణన్‌ని పెళ్ళి చేసుకునేందుకు ఒప్పుకుని ఉండదు. పెళ్ళి చేసుకోమని అడిగేటప్పుడు కణ్ణన్ తన నిజస్వరూపం చూపించి వుంటాడు. సుశీల హంతకుడితో కలసి జీవితం పంచుకోలేనని చెప్పి ఉంటుంది. సుశీలను చంపక తప్పలేదు కణ్ణన్‌కి.

అయితే ఈ పనులన్నీ చేసేదీ చేయగలిగేదీ ఆమెతో బాగా పరిచయం వున్నవాళ్ళే. అలాంటి పరిచయం వున్న వాళ్ళమీదకు నా అనుమానం పోయింది. భూషణం హత్య

చేయబడిన సమయంలో కణ్ణన్ సరుకులు తెచ్చే మిషమీద మార్కెట్ వెళ్ళాడు. అది అతడి ఎలిబీ. అయితే అంబాసిడర్ లో రామ్మూర్తితో కలసి తిరిగివచ్చి డబ్బు విత్ డ్రా చేసిన భూషణాన్ని చంపి వెళ్ళినట్టు ఎవరికి తెలుస్తుందిలే అనుకున్నాడు.

అనుమానం త్యాగరాజుమీదకు వెళ్ళవచ్చును. ఎందుకంటే అంతకు ముందురోజే భూషణం త్యాగరాజును హెచ్చరిక చేశాడు.

అసలు కణ్ణన్ సుశీలను కోరి తప్పు మరింత యెక్కువ చేశాడు. భూషణాన్ని వలచిన సుశీల కణ్ణన్ ని ఎలా సహిస్తూ చేసుకుంటుంది? ఆడదాని మనసు మైనం ముద్దలాంటిదు-యే ముద్ర పడితే ఆ ముద్రను అచ్చు వేసుకోవడానికి! ఆ విషయం కణ్ణన్ కి ఆమెను చంపవలసి వచ్చాక గానీ తెలియలేదు.

సుశీల కణ్ణన్ ని గాయపరిచింది. ఆమె గోళ్ళలో కంటిన రక్తం, చర్మంపోగులూ కణ్ణన్ వని రుజువైంది. అలాగే కారులో, అంబాసిడర్ కారులో దొరికిన వేలిముద్రలు అవురికీ సరిపోయాయి.

సారధిని రామ్మూర్తిపై నిఘా వుంచాను. అయితే సారధినుండి యెటువంటి సమాచారం రాకపోవడంతో రామ్మూర్తి పోస్ట్ మార్టంను ముట్టడించాము. నేరస్తులు దొరబడ్డారు" ముగించాడు డిటెక్టివ్ శరీఫ్.

—:ఐపోయింది:—

# మృత్యు మందిరం

## వసుంధర

"రిక్షా ఇక్కడ ఆపు—" అన్నదా అమ్మాయి.

రిక్షా ఆగింది. ఆ అమ్మాయి హడావుడిగా రిక్షా లోంచి దిగి వాడి చేతిలో ఓ రూపాయనోటు పెట్టి— "చిల్లరక్కర్లేదులే—వెళ్లు!" అని ఎదురింటి ముందుకు నడిచి తలుపు తట్టింది.

తలుపు తీసిన పాతికేళ్ళ యువకుడు లుంగీపంచ ధరించి ఉన్నాడు. వంటిమీద బనియన్ కూడా లేదు. అతనా అందమైన యువతిని చూసి కంగారుపడి ముడుచుకుపోతూ—"ఎవరికోసమండీ?" అన్నాడు.

"మీకోసమే—నన్ను కాస్త లోపలికి రానిస్తారా?" అందా అమ్మాయి చొరవగా. అతను సమాధానమిచ్చే లోగానే ఆమె గదిలోకి ప్రవేశించింది. చేసేదిలేక అతను వెనక్కు తప్పుకున్నాడు. ఆమె గది తలుపులు వేసేసింది.

"ప్లీజ్.... నేను బ్రహ్మచారిని...." అన్నాడతను

కంగారుగా.

"మీరేమీ కంగారు పడకండి. నేనుకూడా కన్నె పిల్లను...." అందా అమ్మాయి.

ఆ యువకుడికేమీ అర్థంకాక ఆమె వంక వెర్రి చూపులు చూశాడు.

"మీరలా చూస్తూంటే నాకు భయమేస్తోంది. ధైర్యంగా హీరోలా చూడలేరూ?" అందామె నిట్టూరుస్తూ.

ఆ యువకుడు చిలక్కొయ్య వద్దకు వెళ్ళి చొక్కా వేసుకుని వచ్చాడు. ఆ అమ్మాయిని సమీపించి — "మీ సంగతేమిటో చెప్పండి!" అన్నాడు.

సరిగ్గా అప్పుడే యెవరో తలుపు దబదబా బాదారు.

"ప్లీజ్ — ఈ ఇంట్లో యెవ్వరూ లేరని చెప్పండి. నేనలా మంచంకింద దాగుంటాను...." అందా యువతి దీనంగా అతనివంక చూస్తూ.

"ఎందుకు?" అన్నాడతను.

"మీరు నాకీ ఉపకారం చేయకపోతే ఈ రోజే నా ప్రాణాలు పోతాయి—"

ఆ యువకుడింకా ఆమెను ప్రశ్నించబోయాడు కానీ మళ్ళీ ఎవరో తలుపు దబదబా బాదారు. ఆ యువతి ఒక్క వుదుటున మంచం కిందకు చేరింది.

తప్పేది లేదనుకుంటూ ఆ యువకుడు వెళ్ళి తలుపు తీశాడు.

నిలువెత్తు ఉన్న ఓ యువకుడు అతన్ని చూసి — "తలుపు తియ్యడానికింత ఆలస్యమా?" అన్నాడు చిరాగ్గా.

గదిలోని యువకుడికి విషయం అర్థం కాలేదు —

"మీ రెవరో చెబుతారా?" అన్నాడు.

"నా పేరు రమేష్! ఇప్పుడే మీ గదిలోకి ఓ అమ్మాయి వచ్చింది. ఆమె కోసం వచ్చాను...."అన్నాడు రమేష్. అతని కళ్ళు గదంతా వెతుకుతున్నాయి.

"ఈ గదిలోకి ఎవ్వరూ రాలేదు...." అన్నాడు మొదటి యువకుడు.

"మీరు అబద్ధమాడుతున్నారని ఇప్పుడే ఋజువు చేస్తాను...." అంటూ రమేష్ గదిలోకి అడుగు పెట్టి తలుపు వేశాడు. తర్వాత యువకుడివంక చూసి—"నా పేరు చెప్పాను. మీ పేరుకూడా చెబుతారా?" అనడిగాడు.

"నా పేరు శరభయ్య—" అన్నాడు గదిలోని యువకుడు.

"పేరునుబట్టి మీరు బుద్ధిమంతులే అనిపిస్తోంది.బుద్ధిగా ఉంటారు కదూ!" అన్నాడు రమేష్ అవాకలా.

శరభయ్య అతనివంక కోపంగా చూసి—"నా బుద్ధి సంగతి సరే—మీకు బుద్ధి వున్నట్లు నాకు తోచడంలేదు. ముందు గదిలోంచి బయటకు వెళ్ళండి...." అన్నాడు.

రమేష్ అతన్ని లెక్కచేయకుండా—"సుజాతా—వచ్చిందెవరనుకుని దాక్కున్నావో—నేను రమేష్‌ను. నీ కోసం వచ్చాను. నీకింకేం భయం లేదు...." అన్నాడు.

"ఈ గదిలో యెవరూలేరని చెప్పాను గదా—" అన్నాడు శరభయ్య తీవ్రంగానే.

"అలాగంటారేంటండీ — అదుగో ఆ మంచంకింద నుంచి సుజాత వస్తుంటేనూ?" అన్నాడు రమేష్.

శరభయ్య ఆశ్చర్యంగా అటే చూశాడు. నిజంగానే సుజాత మంచంకిందనుంచి వస్తోంది.ఆమె ఒక్క అంగలో

తన్ని సమీపించి—"నువ్వా రమేష్! ఎవరో అనుకుని నవసరంగా భయపడిపోయాను...." అంది.

రమేష్, శరభయ్యను చూపిస్తూ—"నిన్ను తన గదిలో ంచంకింద దాచినందుకు ఇతగాడికేం శిక్ష విధించను?" నడిగాడు.

"తప్పు పూర్తిగా నాదే....అయ్యన్నేమీ చేయకు..." ంది సుజాత నవ్వుతూ.

"సరేనండీ—అయితే మీ జోలికి రాను. బ్రతికి యారు...." అంటూ గుమ్మం దగ్గరకు వెళ్ళి తలుపు శాడు రమేష్. సుజాత కూడా అతన్ననుసరిస్తూ-"మీకు నవసరంగా శ్రమ ఇచ్చాను. మన్నించండి...." అంది.

"దానికేముంది. ఫరవాలేదు...." అన్నాడు శర య్య అదోలా చూస్తూ.

ఆమె అతనివంక చూసి నవ్వి వెళ్ళిపోయింది. ఆమె ాపులు—"అలా చూడకండీ—హీరోలా చూడండీ-" న్నట్లు శరభయ్యకు అనిపించాయి.

"సుజాత చాలా బాగుం!ది" అనుకొన్నాడు శర య్య.

## 2

టైమ్ చూసుకున్నాడు శరభయ్య. టైము సాయంత్రం యింది.

"అంటే సుజాత వెళ్ళిపోయి మూడు గంటలయిం న్నమాట!" అనుకున్నాడతను.

మూడు గంటల క్రితం ఎక్కడికో వెళ్ళిపోయిందను న సుజాత తన కళ్ళబడ్డ క్షణంనుంచీ తన ఆలోచనల్లో డిపోవడం అతనికి ఆశ్చర్యంగానే ఉంది. స్వల్ప పరి యంలో మనసుమీద అంత గాఢ ముద్ర వేయగలవారు

చాలా తక్కువమంది వుంటారు.

అయితే తను వయసులో ఉన్న పెళ్ళికాని యువకుడు. పలకరించిన ప్రతి ఆడపిల్లా కాస్త అందమైనదైతే చాలు మనసులో ఉండిపోవడంలో ఆశ్చర్యం లేదు. కానీ ఈ అమ్మాయిలా కాదు—ఉన్న కాసేపటిలోనూ తను మరిచి పోలేని డైలాగులు కొన్ని చెప్పి మరీ వెళ్ళింది.

నేను బ్రహ్మచారినైతే తను కన్నెపిల్లనంది. నువ్వు హీరోలా చూడాలంది. ఆ రమేష్ రాకపోతే ఏం మాట్లాడేదో ఇంకా....

అసలా పిల్ల ఎవరు? రమేష్‌కూ ఆమెకూ ఏమి సంబంధం? ఆమె తన గదిలోకి హడావుడిగా పరుగెత్తు కొచ్చిన కారణం ఏమిటి?

ఈ ప్రశ్నలు మూడు గంటలుగా బుర్రలో మెదులూనే వున్నాయి శరభయ్యకు. అతనికి జవాబు దొరకడం లేదు. జవాబు దొరకడానికేదైనా ఆధారమంటూ ఉండాలి గదా!

శరభయ్య మళ్ళీ టైము చూసుకున్నాడు. టైము ఆరుంపావయింది.

అది అతను ఎక్సర్‌సైజ్ చేసే సమయం.

శరభయ్య ప్రతిరోజూ వుదయం, సాయంకాలం ఆరు గంటల పదిహేను నిముషాలకు వ్యాయామం చేస్తాడు. ఆ కారణంగానే అతను మొదటి ఆట సినిమాకు సాధారణంగా వెళ్ళడు. ఆరుగంటల పదిహేను నిముషాలకు వ్యాయామం చేయడం కుదరకపోతే ఆ పూటకు మానేస్తాడు. తప్పితే మరో సమయంలో చేయడు. ఉదయం పూట వ్యాయామం సంగతెలా ఉన్నా సాయంత్రాలు మాత్రం అప్పుడప్పుడు వ్యాయామం మానేయాల్సొస్తొం

టుందతనికి. ఈరోజు అలాంటి అవసరం రాలేదు.

శరభయ్య వ్యాయామం చేసే ప్రదేశంలోనే మంచం వేసుకుంటాడు. వ్యాయామం చేసేటప్పుడు మంచం ఎత్తి గోడవార పెడతాడు. వ్యాయామం కాగానే మళ్ళీ మంచాన్ని యథాస్థానంలో ఉంచేస్తాడు.

వ్యాయామంకోసం మంచాన్నెత్తిన శరభయ్య మంచం కింద కనబడ్డ కాగితాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు. ఆ కాగితంమీద పెద్ద పెద్ద అక్షరాలతో ఇలా రాసి వుంది.

"నేను ప్రమాదంలో ఉన్నాను. రక్షించండి. రాత్రి తొమ్మిది గంటలకు త్రివేణీ హోటల్లో నలభై యారో గదికి వస్తే నన్ను రక్షించగలరు—సుజాత!"

శరభయ్య ఉలిక్కిపడ్డాను.

సుజాత ప్రమాదంలో ఉందా? ఎవరి కారణంగా ఆమెకు ప్రమాదం కలిగింది?

బాగా ఆలోచించాక శరభయ్య బుర్ర పని చేసింది. సుజాతను రమేష్ తరుముతున్నాడు. ఆమె పారిపోయి తన గది చేరింది. అయితే రమేష్ బారినుండి తను ఎంతో సేపు తప్పించుకు తిరగలేనని ఆమె గ్రహించి ఉంటుంది. అందుకే తన గదిలో మంచంక్రింద చేరి ఈ వుత్తరం రాసింది. తనకున్న స్వల్పవ్యవధిలో ఆమె చాలా తెలివైన పని చేసింది. తర్వాత అసహాయురాలై రమేష్‌తో వెళ్ళిపోయింది. తనసెలాగూ రమేష్ కనుగొంటాడని ఆమెకు తెలుసు. అతను కనుగొనేలోగా తనే బయట పడింది.

ఆమె రమేష్‌తో మనస్ఫూర్తిగానే వెడుతున్నదని అప్పట్లో తననుకున్నాడు. ఆమె కనులు తనవంక చూసిన జాలి చూపుల నా క్షణంలో అర్థం చేసుకోలేకపోయాడు.

శరభయ్య క్షణంసేపు ఆలోచనలు కట్టిపెట్టి బస్కీలు తీయడం ఆరంభించాడు. ఓ యాభై బస్కీలు తీసేక బుల్ వర్కర్‌ను తీశాడు. అయిదు నిముషాలు దాంతో వ్యాయామం చేశాడు. ఉబ్బిన తన ఛాతీవంక, మెలితిరుగు తున్న కండరాలవంక చూసుకుని నిట్టూర్చి—"ఇంకా ఎంత పొడుగుంటేనా?" అనుకున్నాడు.

శరభయ్య పొట్టివాడు కాదు. నిలువెత్తు రమేష్‌ను సుజాత పక్క చూశాక అతనికి తను పొట్టివాడినని అని పించింది. రమేష్‌నీ తననూ చూసి సుజాత తన గురించి ఏమనుకుందో ననిపించింది.

రమేష్ తనకంటె పొడగరి కావచ్చు. కానీ సుజాత వంటి అందమైన అమ్మాయిని అతగాడు భయపెడు తున్నాడు. ఆ అమ్మాయి తనను రక్షించమని అడుగు తోంది.

శరభయ్య తన కండరాలవంక మరోసారి చూసుకుని- "సుజాతను రక్షించలేకపోతే నా వ్యాయామానికి అర్థమే లేదు—" అనుకున్నాడు.

## 3

త్రివేణీ హోటల్లో అడుగుపెట్టాక శరభయ్యకు భయం వేసింది.

అతనా హోటల్లోకి అడుగు పెట్టడం అదే ప్రథమం, అందులో అడుగు పెట్టాలని ఆడనెప్పుడూ కోరుకోలేదు. అక్కడ కాఫీ తాగివస్తే పది రూపాయలవుతుందనీ— మసాలాదోసె ఎనిమిది రూపాయలనీ యెవరో చెప్పగా విన్నాడతను. శరభయ్య ఇతరుల మాటలు స్వానుభవం లేనిదే నమ్మే రకం కాదు. అయితే మసాలాదోసె ఖరీదు ఎనిమిది రూపాయలన్న విషయం తెలుసుకోవడానికి ఎని

మిది రూపాయలు ఖర్చుపెట్టడం శరభయ్యకు ఇష్టంలేదు.

శరభయ్య ఊహించినకంటే అద్భుతంగా ఉండడం వల్ల ఆ హోటల్ అతనికి కాస్త భయాన్నే కలిగించింది. కానీ శరభయ్య భయం అర్థంలేనిది. అర్థంలేని విలువలకు అర్థంలేని ఖర్చులు చేయడం ఇష్టంలేని మధ్య తరగతి మనిషి అతను తప్పితే హోటల్ ప్రాంగణంలో అడుగు పెడితే అక్కడివారు ఇతన్ని అనుమానించేలా ఉండ డతను.

కొంతసేపు ఆ ప్రాంగణంలో తిరిగాక శరభయ్యకు ధైర్యం వచ్చింది. అసలక్కడ ఎవ్వరూ అతని గురించి పట్టించుకోలేదు. ఏమీ అడగలేదు. అక్కడికి వచ్చిన చాలామంది శరభయ్యకు లాగానే వున్నారు. క్రమంగా శరభయ్య ధైరం పెరిగింది. అతనోసారి టైము చూసు కుని—"నాకు మంచి ధైర్యం రావడానికిక్కడికి వచ్చేక నలభై అయిదు నిముషాలు పట్టింది. నోట్ చేసుకోవలసిన పాయింటే—" అనుకున్నాడు.

ఈ నలభై అయిదు నిముషాల్లోనూ శరభయ్య ఉత్తినే కూర్చోలేదు. హోటల్ గురించి చాలా తెలుసుకున్నాడు. హోటల్లో ఎక్కణ్ణించి యెక్కడికి వెళ్ళాలో చూసు కున్నాడు.

తొమ్మిది కావడానికింక సరిగ్గా పావుగంట మాత్రమే ఉంది.

తనిప్పుడేం చేయాలి?

నలభైయారో నంబరు గదికి సరిగ్గా తొమ్మిది గంట లకే వెళ్ళాలా లేక కాస్త ముందుగా వెళ్ళొచ్చా? ఆమె టైము గురించి అంత ఖచ్చితంగా రాసింది? తొమ్మిది

గంటలకు అని రాయడంలో ఆమె ఉద్దేశ్యం ఏమిటి?

ఏమైనప్పటికీ శరభయ్య తొమ్మిది వరకూ ఆగి అప్పుడే ఆ గదికి వెళ్ళాడు.

గదిలోకి వెళ్ళడానికి అతన్నెవ్వరూ అడ్డగించలేదు. గడియ తీయగానే గది తలుపు తెరుచుకుంది కూడా. శరభయ్య గదిలో ప్రవేశించి ఆత్రుతగా అటూ ఇటూ చూశాడు.

అది నిజంగా యెంతో అందమైన గది. శరభయ్య తీరుబడిగా ఆ గది సౌందర్యాన్ని తిలకించేవాడే సోఫాలోని సుజాతను చూడకపోతే.

సుజాత అతన్ని చూస్తూనే చటుక్కున లేచి నిలబడింది—"తలుపు బోల్టు చేయండి—" అంది.

శరభయ్య తలుపు బోల్టుచేసి ఆమెను సమీపించాడు.

"చాలా థాంక్స్ మిస్టర్ శరభయ్యా! నా గురించి మీరు చాలా ధైర్యం చేశారు...." అందామె హడావుడిగా—"కానీ మీతో మాట్లాడ్డానికి నాకెంతో వ్యవధి లేదు. వెంటనే మనమిద్దరం బట్టలు మార్చుకోవాలి...."

"అంటే?" అన్నాడు శరభయ్య అర్థంకాక.

"అంటే ఏముంది—మీ బట్టలు నాకు. నా బట్టలు మీకు...."

శరభయ్య ఒకసారి ఆమె బట్టల్నీ తన బట్టల్నీ మార్చి మార్చి చూసి ఇబ్బందిగా ముఖంపెట్టి — "నాకు చీర కట్టుకోవడం రాదు. అయినా నేనెందుకు చీర కట్టుకోవాలి?" అన్నాడు.

"చెప్పే వ్యవధి కానీ, ఎక్కువగా మాట్లాడే అవకాశం కానీ నాకు లేదు. ఒక ఆడపిల్లను రక్షించడానికి మీరీమాత్రం సాయం చేయలేరా? మిస్టర్ శరభయ్యా—

ప్లీజ్!" అందామె.

ఆమె కళ్ళలోని విషాదాన్నీ, దైన్యాన్నీ చూసి కరిగి పోయాడు శరభయ్య. పెద్దగా ఆలోచించకుండానే— "సరే!" అన్నాడు. అతని నోటి మాట ఇంకా వెలువడ కుండానే సుజాత తను కట్టుకున్న చీర విప్పి పారేసింది.

శరభయ్య అదోలాగైపోయి—"ఇక్కడేనా బట్టలు మార్చుకోవడం?" అన్నాడు.

"అవును-ఇక్కడే — అంతకుమించిన దారేముంది?" అందామె.

"బాత్రూంలోకి వెళ్ళి...."

"మిస్టర్ శరభయ్యా - నా హడావుడి నీ కర్థంకాదు. మీ వంటి వుత్తముడి కళ్ళబడితేనే మలినమైపోతే నా శరీరం ఎందుకూ పనికిరానిది కింద లెక్క. ప్లీజ్ — అర్జంటుగా నేను బట్టలు మార్చుకుని ఈ గదిలోంచి బయట పడాలి. మీరు కళ్ళు మూసుకోవాలని ఆంక్ష కూడా పెట్టను నేను...." అంటూ ఆమె ఒక్కొక్క టిగా తన బట్టలు విప్పేస్తోంది.

శరభయ్య ఆమెవంక చూసి చటుక్కున చొక్కా విప్పి ఆమె మీదకు విసిరాడు. ఆడపిల్ల అంత చొరవ చేయడం చూసి అతను కంగారుపడి తన బట్టలు తొంద రగా ఆమెకు అందజేశాడు.

క్షణాలమీద సుజాత అబ్బాయిలా తయారైంది— "మీ పాంటు నాకు సరిగ్గా సరిపోయింది. చొక్కా కాస్త పొడుగైంది కానీ ఫరవాలేదు. మీరు నా కంటే ఎంతో పొడుగు లేకపోవడం నాకు లాభించింది. మీరు త్వరగా చీర కట్టుకోండి. లేకపోతే ప్రమాదంలో పడి పోతారు...."

ఏమిటో అర్థం కాకపోయినా మంత్రముగ్ధుడిలా ఆమె చెప్పినట్లు చేశాడు శరభయ్య. అతడు చీర కట్టుకునేం దుకు ఆమె సాయం చేసింది. ఆతను చీర ,కట్టుకున్నాక— "అచ్చు ఆడపిల్లలాగున్నారు—" అందామె.

ఆమె తనకు అంత దగ్గరగా రావడమూ తనను తాక డమూ ఏదోలా అనిపించింది శరభయ్యకు. అతనేదో వింత లోకాల్లో వున్నాడు.

"మిస్టర్ శరభయ్యా! మీరు మీ ముఖం కనబడనీయ కండి. ముఖంమీదకీ మేలి ముసుగు లాక్కోండి. ఇక మీదట పూర్తిగా మీ బుర్రకు పదును పెట్టి ఇక్కణ్నించి తప్పించుకోండి. మీరిప్పుడున్నది త్రివేణీ హోటల్లోని నలభైయారో నంబరు గది కాదు. మృత్యు మందిరం. నేను వెళ్ళిపోతున్నాను. మీ సాయంతో నా ప్రాణాలు రక్షించుకొంటున్నాను. వేరే దారిలేక ఇలా చేయవలసి వచ్చింది. నన్ను మన్నించండి. మనం మళ్ళీ కలుసుకో గలమనీ ఆశిస్తున్నాను...." అంటూ సుజాత తలుపు తీసుకుని గబ గబా గదిలోంచి బైటకు వెళ్ళిపోయింది.

శరభయ్యకు అంతా విచిత్రంగా వుంది. ఇప్పుడతను ఈ లోకంలోకి వచ్చాడు. తన వేషం చూసుకుంటే అత నికి చాలా సిగ్గుగా వుంది. ఈ వేషం తను సుజాత ముందు వేశాడు. ఏమనుకుందో సుజాత తన గురించి .... ఆమె ఏమనుకున్నప్పటికీ తన గురించి ఆమె మనసులో చాలా సదభిప్రాయముండి వుండాలి. లేకుంటే ఎంత ప్రాణా పాయ సితిలో ఉన్నప్పటికీ ఆడది పరాయి మగాడి ముందు బట్టలు మార్చుకోదు.

ఆ దృశ్యం గుర్తుకు రాగానే శరభయ్య శరీరం ఒక్క క్షణం మాత్రం వేడెక్కి వెంటనే చల్లారిపోయింది—

"పాపం, ఆడపిల్ల యెంత కష్టంలో వుండకపోతే అలా ప్రవర్తిస్తుంది!" అనుకున్నాడతను.

ఇప్పుడు తనేం చేయాలి?

శరభయ్యకు విషయం అర్థమైంది. సుజాత తన శత్రువులకు దూరంగా పారిపోవాలనుకుంటోంది. అందుకామెకు కొంత సమయం కావాలి. ఇప్పుడామె శత్రువులు గదిలో ప్రవేశించి తనెవరో తెలుసుకోగలిగితే వెంటనే ఆమె గురించి అన్వేషణ ప్రారంభిస్తారు. బహుశా ఆమె దొరికిపోయినా దొరికిపోవచ్చు. ఏ మాత్రం వీలున్నా ఆమె శత్రువులకు తనే సుజాత అన్న భ్రమలో ఎక్కువసేపు ఉంచాలి.

అది తనవల్ల అవుతుందా?

ఒకవేళ రమేష్ వస్తే వెంటనే తనను గుర్తు పట్టడూ?

ఏమో—ఏం జరుగుతుందో వేచి చూడాలి!

ఒక ఆడపిల్లను రక్షిస్తున్నానన్న తృప్తిలో శరభయ్యకు ముందేం జరుగుతుందో అన్న భయం ఆట్టే వేయలేదు. అతనిలో కుతూహలమే ఎక్కువగా ఉంది. సహజంగా శరభయ్య భయస్థుడు కాడు.

## 4

సుజాత వెళ్ళిన పదిహేను నిముషాలకు గది గుమ్మం దగ్గర ఏదో అలికిడయింది.

శరభయ్య వెంటనే మంచంమీద పడుకుని గదిలోని దీపం ఆర్పేశాడు.

మరుక్షణంలోనే "సుజాతా!" అన్న పిలుపు వినిపించిందతనికి. ఆ కంఠం గుర్తు పట్టాడతను. గుండెలు గుభిల్లుమన్నాయి. రమేష్ తనను కనుక్కోవడాని కెంతసేపు పట్టింది.

"సుజాతా—గదిలోనే ఉన్నావా?" మళ్ళీ రమేష్ కంఠం వినిపించింది.

శరభయ్య ముడుచుకుని మంచంమీద పడుకుని వున్నాడు. ఏ క్షణంలో గదిలో దీపం వెలుగుతుందోనని అతనికి భయంగా ఉంది. ముఖంమీదకు ముసుగు లాక్కున్నాడు. పాదాలను చీర లోపలకు లాక్కున్నాడు.

రమేష్ మంచం దగ్గరగా వచ్చి — "సుజాతా!" అన్నాడు.

"ఊఁ" అన్నాడు శరభయ్య.

"నీ గొంతు నొప్పి ఇంకా తగ్గలేదా!" అన్నాడు రమేష్.

"ఉ ఉ" అన్నాడు తగ్గలేదన్నట్టుగా శరభయ్య. సుజాత తనను తన స్థానంలో ప్రవేశపెట్టాలని ముందే అనుకుని గొంతు నొప్పిని సృష్టించి ఉంటుందని శరభయ్య ఊహించాడు.

"అయితే మాట్లాడకుండా పడుకో — ఓ గంట తర్వాత సావిత్రి వస్తుంది. ఆమె చెప్పినట్లు విను. అనవసరంగా అల్లరిమాత్రం చేయకు...." అన్నాడు రమేష్.

"ఊఁ" అన్నాడు శరభయ్య.

రమేష్ కళ్ళు ఇప్పుడు చీకట్లోకీ చూడగలుగుతున్నాయి. అతను గోడ దగ్గరకు వెళ్ళి స్విచ్ వేశాడు. గదిలో దీపం వెలిగింది.

స్విచ్ చప్పుడు వింటూనే వీపును గుమ్మంవైపు పెట్టి పడుకున్నాడు శరభయ్య.

రమేష్ మంచంమీద పడుకున్న శరభయ్యను పరీక్షగా చూసి—"తలుపు బైట వేస్తున్నాను. పారిపోవడానికి ప్రయత్నించకు. దీపం తీసేసి వెళ్ళనా—" అన్నాడు.

"ఊం" అన్నాడు శరభయ్య!

రమేష్ వెళ్ళిపోయాడు—దీపం ఆర్పేసి.

జరిగినదంతా విచిత్రంగా వుంది శరభయ్యకు.

అసలీ గొడవంతా ఏమిటి? రమేష్ సుజాత వెనక ఎందుకు పడ్డాడు? ఆతనామెగురించి ఆశించేదేమిటి? రాబోతున్న ఈ సావిత్రి ఎవరు? ఆమె వస్తే సుజాత అల్లరి చేస్తుందని ఎందుకనుకోవాలి?

అన్ని ప్రశ్నలకూ కాలం తప్ప ఇంకెవరూ జవాబు చెప్పలేరు. శరభయ్య రేడియం డయల్ వాచీ వంకే చూస్తూ ఆలోచిస్తున్నాడు. టైము సరిగ్గా పదయ్యేసరికి తలుపుదగ్గర మళ్ళీ చప్పుడైంది.

కొద్ది క్షణాల్లో లైటు వెలిగింది గదిలో!

శరభయ్య జాగ్రత్తగా పడుకున్నాడు. మెత్తని పాదాల సవ్వడి మంచంవరకూ వచ్చి ఆగిపోయింది. అప్పుడే చిన్న నిట్టూర్పు కూడా శరభయ్యకు వినబడింది- "పచ్చటి ఛాయ—ఈ రంగే నా కుంటే ఎంత బాగుండేది?"—అని ఆమె మళ్ళీ నిట్టూర్చింది.

ఆమే సావిత్రి అయుండాలని అనుకున్నాడు శరభయ్య.

"సుజాతగారూ! మీ సౌందర్యం గురించి విన్నాను కానీ చూసే భాగ్యం ఇంతవరకూ కలగలేదు. ఒక్కసారి మిమ్మల్ని చూడనివ్వండి...." అందామె.

శరభయ్య ధైర్యం చిక్కబట్టుకుని లేచి కూర్చుని మేలి ముసుగు మీదకు లాక్కున్నాడు.

"నా పేరు సావిత్రి—" అందామె శరభయ్యను పరీక్షగా చూస్తూ.

"ఊం" అన్నాడు శరభయ్య.

"మీకు గొంతునొప్పి అని రమేష్‌బాబు చెప్పాడు" అంది సావిత్రి.

మేలి ముసుగులోంచి పరీక్షించి చూశాడు శరభయ్య. పాతికేళ్ళుంటాయి. మనిషి చామన ఛాయకంటె తక్కువే రంగులో! ముఖం కళగా ఉంది. శరీరం తీర్చి దిద్దినట్లుంది. తను ఆడదనుకుంటోందో ఏమో పైట సరిగ్గా సర్దుకోలేదు.

"ఒకవిధంగా మీ గొంతునొప్పి వీరేశ్వర్రావుగారికి వరం అనుకోవచ్చు—" అంటూ మళ్ళీ నిట్టూర్చింది సావిత్రి.

ఈ వీరేశ్వర్రావెవడు? సుజాతకు గొంతు నొప్పి అయితే వాడికేం లాభం? అంటే వాడి ప్రవర్తన సుజాత అరుపులకు దారి తీస్తుందన్నమాట! అంటే వాడు సుజాతను యేంచేస్తాడు?

శరభయ్యకు కొద్దిగా భయం వేసింది. విషయం తెలుసుకోవడానికి తన గొంతు ఎంతో కొంత విప్పితే తప్ప లాభం లేదనిపించింది శరభయ్యకు. ఎంతో కష్టపడి గొంతు పెగల్చాడతను—"ఈ వీరేశ్వర్రావెవడు-నన్నేం చేస్తాడు?" అన్నాడతను. అన్నాక తనకే ఆశ్చర్యం వేసింది. ఆడ కంఠాన్ని చాలా బాగా అనుకరించాడు శరభయ్య.

"రూపానికి తగ్గ అందమైన కంఠం!" అంది సావిత్రి మెచ్చుకుంటూ.

"నా ప్రశ్నకు జవాబివ్వలేదు—" అన్నాడు శరభయ్య. ఈ సారి మరి కాస్త ధైర్యంగా. తన అనుకరణ కంఠాన్ని ఒక స్త్రీ మెచ్చుకోవడం అతనికి ధైర్యాన్ని పెంచింది.

"నేను చెప్పేదేముంది — ఇంకో అరగంటలో ఆయనే వస్తారు గదా!" అంది సావిత్రి.

"చెప్పు సావిత్రీ—" అన్నాడు శరభయ్య.

"చెప్పడానికేముందండీ—తననుకున్నది మీ చేత ఒప్పిస్తాడు...." అంది సావిత్రి.

"మనిషి చాలా బలంగా వుంటాడా?" అన్నాడు శరభయ్య. జరగబోయేది అతనికి చూచాయగా స్ఫురించింది. వీరేశ్వర్రావు సుజాతమీద మోజు పడితే రమేష్ ఆమెను అతనికి ఏర్పాటు చేస్తున్నాడు.

సావిత్రి నవ్వి—"నీకు బలంగానే ఉంటాడు...." అంది.

"నువ్వెందుకొచ్చావిక్కడికి!" అన్నాడు శరభయ్య.

"వీరేశ్వర్రావు గురించి చెబుదామని...." అంది సావిత్రి.

"చెప్పు...."

"వీరేశ్వర్రావు చాలా ప్రమాదకరమైన మనిషి. ఆయన్నెదిరించడం ప్రాణాలతో చెలగాటమే అవుతుంది. అవసరమైతే ఆయన ఖూనీక్కూడా వెనుదీయడు. ఇంతవరకూ ఆయన రెండు ఖూనీలు చేశాడు...."

శరభయ్య ఉలిక్కిపడ్డాడు.

"ఖూనీలు చేశాడా, ఎందుకు?"

"తన్ను మోసం చేసినా, తన మాట కాదన్నా ఆయన సహించలేడు—" అంది సావిత్రి.

శరభయ్య ఆలోచిస్తున్నాడు. తను ఆడదనుకుని వీరేశ్వర్రావు ఇక్కడికి వస్తున్నాడు. బహుశా తన్ను బలవంతం చేస్తాడు. అసలు విషయం తెలిస్తే ఏం చేస్తాడు? అసలే ఖూనీలు చేసే మనిషి—తన్ను క్షమిస్తాడా?

మళ్ళీ అడిగాడతను సావిత్రిని — "ఆయన చాలా బలంగా ఉంటాడా?"

"నాకాయన కోపం గురించేకానీ, బలం గురించి తెలియదు. కోపంలో మనిషి రక్తం తాగగల సమర్థుడాయన సుజాతగారూ—నా మాట వినండి! వీరేశ్వరరావుగారు చెప్పినట్లు వినండి. ఆయన ఏమంటే దానికి ఒప్పేసుకోండి. ఇది మీకు చెప్పాలనే వచ్చాను...."

"ఈ విషయం చెప్పడానికి ప్రత్యేకంగా ఓ ఆడ మనిషిని పంపాలా?"

"వీరేశ్వరరావుగారికి ఓపిక తక్కువ. ఆయన వస్తూనే తన మనసులోని మాట చెప్పేస్తాడు. దానికి మీరు ఎదురు చెబితే ఆయన నడుంకున్న బెల్టు విప్పి మరోసారి చెబుతాడు. ఆ తర్వాత అవుననేదాకా మీకు దెబ్బలే — ఈ విషయం ముందుగానే మీకు తెలియబరిస్తే మీకు దెబ్బలు తప్పుతాయి గదా అని—" అంది సావిత్రి.

"నాకు దెబ్బలు తప్పించాల్సిన అవసరం నీకేముంది"

"గోవిందరావుగారికి మీ వంటిమీద దెబ్బ పడడం ఇష్టం లేదు. అందుకే నన్ను పంపారు...."

"గోవిందరావెవడు?" అన్నాడు శరభయ్య ఆశ్చర్యంగా.

"పార్వతికి మామయ్య...." అంది సావిత్రి.

"పార్వతి ఎవరు?" అన్నాడు శరభయ్య యింకా తెల్లబోతూ.

"సుజాతగారూ—దయుంచి పార్వతి యెవరు అని వీరేశ్వరరావుగారిని మాత్రం అడక్కండి. ఆయన పూర్తి సహనం కోల్పోతారు...." అంది సావిత్రి.

"ఆయనన్నడగడంలేదు. నిన్నేగా అడుగుతున్నాను"

అన్నాడు శరభయ్య?

"పార్వతి ఎవరో తెలియకుండానే ఇక్కడికొచ్చా రని నమ్ముమంటారు...." అని నవ్వి ఊరుకుంది సావిత్రి. పార్వతి ఎవరో తెలుసుకోవడం అనుమానాన్ని కలిగిస్తుం దని గ్రహించి ఊరుకొన్నాడు తను కూడా శరభయ్య. అతని మనసిప్పుడు వీరేశ్వరరావు గురించి యెదురు చూస్తోంది.

"వీరేశ్వరరావు త్వరగా వస్తే బాగుండును. నాకీ హోటల్ గదిలో బోర్ కొడుతోంది—" అన్నాడు శరభయ్య.

వెంటనే సావిత్రి పైము చూసుకొని—"ఇంక వీరేశ్వ రరావు రావడానికైదు నిముషాలకంటే వ్యవధి లేదు. ఆయనొచ్చేసరికి నేనిక్కడుంటే ఆయనకు చాలా కోపం వస్తుంది. మరి నే వెడతాను...." అని శరభయ్య జవాబు గురించి కూడా ఎదురు చూడకుండా వెళ్ళిపోయింది.

## 5

సరిగ్గా అయిదు నిముషాల్లో గదిలోకి ఒక మనిషి వచ్చాడు.

అతన్ని చూసి శరభయ్య ఆశ్చర్యపడ్డాడు. ఆ మనిషి తననుకున్నట్లు లేదు.

ఎత్తు అయిదడుగుల రెండంగుళాలుంటుందేమో! మనిషి బక్కపలచగా ఉన్నాడు. గళ్ళ లుంగీ లోపల పువ్వుల షర్టు టక్ చేసి పైన పటకా బెల్టు కట్టాడు. ముఖం చిన్న దైనా మీసాలు మాత్రం గుబురుగా వున్నాయి. మనిషిని చూస్తే నవ్వొస్తుందేమో తప్ప భయం ఏమాత్రం కలు గదు. అతన్ని చూడగానే శరభయ్యకు చాలా ధైర్యం వచ్చింది.

అతను శరభయ్యను సమీపించి—"నన్ను వీరేశ్వర్రా వంటారు. నువ్వేనా సుజాతవు—" అన్నాడు.

"ఊఁ" అన్నాడు శరభయ్య. వీరేశ్వర్రావు మనిషలాగున్నాడు కానీ కంఠం కర్ణకఠోరంగా భయం పుట్టించేదిగా వుంది.

"నేను నీతో మాట్లాడబోయే ముందుగా నా గురించి చెప్పకోవాలి—"అని ఒక్క క్షణం ఆగి—"ఎంతటి పెంకిఘటాన్నైనా నేననుకున్న పనికి క్షణాలమీద ఒప్పించగల సామర్థ్యం వుంది నాకు. ధర్మరాజు దుర్యోధనుడి దగ్గరకు రాయబారానికి కృష్ణుడికి బదులు నన్ను పంపించి ఉంటే యుద్ధం లేకుండా అర్ధ రాజ్యం సంపాదించిపెట్టి ఉండేవాణ్ని. అదీ నా కథ—" అన్నాడు వీరేశ్వర్రావు.

"ఊఁ" అన్నాడు శరభయ్య.

"నేనిప్పుడు వేసుకున్న డ్రస్సు స్పెషల్ గా నీ కోసం వేశాను. నడుముకున్న బెల్టు విప్పానంటే, అది నా చేతిలోంచి గాలిలోకి లేచిందంటే మళ్ళీ ఎప్పుడు ఆపుతానో తెలియదు. అది నేనాపుతాను తప్పితే ఇంకెవ్వరూ ఆపలేరు. అలా రెండు ఖూనీలు కూడా చేశాను.." అన్నాడు వీరేశ్వర్రావు.

"ఊఁ" అన్నాడు శరభయ్య.

"కాబట్టి ఇప్పుడు చెప్పు. పార్వతికి నాట్యం నేర్పుతావా?" అన్నాడు వీరేశ్వర్రావు.

శరభయ్యకు ఏమనాలో తెలియలేదు. పార్వతికి నాట్యం నేర్పడమేమిటో అర్ధం కాలేదు.

"ఊఁ?" అన్నాడు శరభయ్య ప్రశ్నార్ధకంగా.

"పార్వతికి నాట్యం నేర్పుతావా?"

"నాట్యం నేర్పడానికి నాకు రావాలి గదా!" అన్నాడు శరభయ్య.

"నువ్వు నాట్యంలో ఆరితేరిన దానివనే గదా నిన్ను తీసుకొస్తే!" అన్నాడు వీరేశ్వర్రావు.

"సరే-అయితే నేర్పుతాను...."అన్నాడు శరభయ్య. చాలా తొందరగా రెచ్చిపోయే స్వభావం గల వీరేశ్వ ర్రావుతో ఎక్కువసేపు మాట్లాడడం మంచిది కాదను కున్నాడు శరభయ్య. తర్వాత ఆ పార్వతిని కలుసు కుంటే ఆడపిల్ల గదా—వ్యవహరించడం తేలిక .... అను కున్నాడతను.

వీరేశ్వర్రావు అట్టహాసం చేశాడు. ఆ నవ్వు భయం కరంగా ఉంది. ఆ మనిషి గురించి తన్ను సావిత్రి ముందర గానే హెచ్చరించడం మంచిదే అయింది. లేకపోతే తను భంగపడి ఉండేవాడు.

అయితే ఈ పార్వతి యెవరు? ఆమెకు నాట్యం నేర్పడానికి సుజాతే ఎందుకొక్కవలసొచ్చింది? దాని కైనా ఇంత హడావుడి ఎందుకు చేయాల్సొచ్చింది?

"టైము పడుతుందేమోననుకున్నాను. చాలా త్వరగా లొంగిపోయావు. ఇక్కడే ఉండు. క్షణాలుమీద కారు సిద్ధం చేయించి వస్తాను...." అంటూ బైటకు వెళ్లాడు వీరేశ్వర్రావు. గది బైట గడియవేసిన శబ్దం కూడా విన పడింది శరభయ్యకు.

శరభయ్య మంచంమీంచి లేచి గొంతు సవరించు కొన్నాడు. అద్దంముందుకు నడిచాడు. అద్దంలోని ప్రతి బింబం చూసుకొంటే అతనికి నవ్వు వచ్చింది. తను అచ్చం ఆడపిల్లలా ఉండడమే కాదు, చాలా బాగున్నాడు కూడా!

"హలో శరభయ్యా!" అంటూ అద్దంలోని ప్రతి బింబాన్ని పలకరించాడు. అలవాటైపోయిందో యేమో అతని గొంతు స్త్రీ కంఠంలాగునే పలికింది. శరభయ్య అధైర్యపడలేదు. ఆనందించాడు. తర్వాత గదిలో కాసేపు అటూ ఇటూ నడిచి తన నడకను సవరించుకున్నాడు. ఇప్పు డతని నడక కూడా ఆడవారి నడకకు దగ్గర్లో ఉంది.

హఠాత్తుగా శరభయ్యకు తల్లి మాటలు గుర్తు కొచ్చాయి. శరభయ్యకు పుట్టు వెంట్రుకలు తీయించడం ఆలశ్యమైందట. జుట్టు ఒత్తుగానూ, పొడవుగానూ, వుండే దిట. తల్లి అతనికి జడవేసి, బొట్టూ కాటుక పెట్టి గౌను తొడిగితే అంతా ఆడపిల్లనే అనుకునేవారుట. శరభయ్య తొలి కాన్పు బిడ్డ కావడమూ, అతడి తల్లికి ఆడపిల్లలంటే మనసు కావడమూవల్ల ఆవిడ ఇతణ్ని ఆడపిల్లలా తయారు చేసి ఆ మనసు తీర్చుకునేదిట. చూసేవాళ్ళు కూడా మీ వాడు పొరపాటున మగపిల్లాడుగా పుట్టాడమ్మా అనే వారుట. శరభయ్య తర్వాత కూడా అతడి తల్లి మనసు తీరలేదు. ఆరేళ్ళ తర్వాత ఇంకో మగపిల్లాడు పుట్టాడు. అంతే!

"ఇప్పుడు అమ్మ నన్నీ వేషంలో చూస్తే ఏమనుకుం టుందో?" అనుకున్నాడు శరభయ్య.

అమ్మ సంగతేలాగున్నా గదిలోకి వీరేశ్వర్రావు వచ్చాడు. శరభయ్య అతడు చెప్పిన ప్రకారం అతన్ని అనుసరించి వెళ్ళి కారెక్కాడు. కారు వింత వింత దారుల్లో వెళ్ళి ఓ పెద్ద భవనం ముందు ఆగింది.

## 6

వీరేశ్వర్రావు కారు దిగాడు. శరభయ్యను కూడా దిగమన్నాడు. ఇద్దరూ కలిసి భవనంలో అడుగు పెట్ట

గానే అక్కడ కనబడ్డ నౌకరుతో — "వీరేశ్వర్రావు వచ్చాడనీ డ్యాన్సు మాస్టరు సుజాతను తీసుకొచ్చాడనీ చెప్పు గోవిందరావుగారితో—" అన్నాడు.

"గోవిందరావుగారు లేరండి...." అన్నాడు నౌకరు.

"పోనీ—పార్వతిగారున్నారా?"

"ఉన్నారండి...."

"పిల్చుకునిరా...." అన్నాడు వీరేశ్వర్రావు. నౌకరు వెళ్ళాడు.

అయిదు నిముషాల అనంతరం మెరుపుతీగలాంటి పిల్ల పదహారేళ్ళ వయసుది వచ్చింది. ఆమే పార్వతి అయ్యుండాలని అనుకున్న శరభయ్య—"నాకు నిజంగా డాన్సు వచ్చివుంటే ఎంత బాగుండును?" అనుకున్నాడు.

"నీకు డ్యాన్సు నేర్పడానికి కొత్త మేస్టర్ని తీసుకొచ్చాను. పేరు సుజాత...." అన్నాడు వీరేశ్వర్రావు, పార్వతికి శరభయ్యను పరిచయం చేస్తూ.

అందమైన పార్వతి కళ్ళు తనవైపు జాలిగా చూడడం గమనించిన శరభయ్య ఆశ్చర్యపడినా—ఆమె చూపులే అంతేనేమోలే అనుకున్నాడు. మేలి ముసుగు మరి కాస్త ముఖంమీదకు లాక్కున్నాడు.

వీరేశ్వర్రావు వెళ్ళిపోయాడు. పార్వతి అతన్ని సమీపించి చేయి పట్టుకుని—"పదండి—నా గదిలోకి వెడదాము—" అంది. ఆ స్పర్శ శరభయ్యకు ఎంతో హాయిగా ఉంది. కానీ పార్వతి తను ఆడది అనుకుంటోందని అతనికి తెలుసు. అందువల్ల మృదువుగా ఆమె చేయి విడిపించుకుని ఆమెను అనుసరించాడు.

అంతవరకూ శరభయ్య గమనించలేదు కానీ అది మహారాజుల భవనంలా ఉంది. పార్వతి కూడా ఏదోరాజ్యానికి

యువరాణిలా అనిపిస్తోంది—అందాన్నిబట్టే కాదు—ధరించిని బట్టల్ని బట్టి కూడా! అలక్ష్యంగా ఆమె శరీరం మీద వ్రేలాడే నగలు కూడా ఆమె విలువను చెప్పకనే చెబుతున్నాయి.

ఇద్దరూ అంతఃపురంలాంటి గదిలో హంసతూలికా తల్పంలాంటి మంచంమీద పక్క పక్కన సుఖాశీను లయ్యాక—"మేస్టారూ—మామయ్య ఊళ్ళో లేదు. ఈ లోగా మీ కేం కోరికలున్నా చెప్పండి. నేను తీరుస్తాను. మామయ్య వచ్చేదాకా నేనీ ఇంటికి రాణిని...." అంది పార్వతి.

"నా కేం కోరికలుంటాయ్ — నన్ను బలవంతంగా ఇక్కడికి తీసుకొచ్చారు. చేతనైతే నన్నిక్కణ్నుంచి పంపేసేయ్—" అన్నాడు శరభయ్య.

"అమ్మ బాబోయ్—" అంది పార్వతి-"నాపెత్తనం నాలుగు గోడల లోపలేగానీ బైట చెల్లదు. మీకు కావలసిన బట్టలు, నగలు ఇవ్వగలను. మంచి భోజనం ఏర్పాటు చేయగలను. కోరిన సేవలు చేయగలను. కానీ ఈ ఇంటి గడప దాటించలేను—"

శరభయ్య ఆశ్చర్యంగా—"అంతా విచిత్రంగా వుంది నాకు. ఇదంతా ఏమిటో నాకు చెప్పగలవా?" అనడిగాడు.

పార్వతి నిట్టూర్చి—"చెబుతాను. కానీ నాకు మీ మీద జాలిగా ఉంది!" అంది.

"ఎందుకు?" అనడిగాడు శరభయ్య.

"నేను నిత్యం ప్రమాదంలో ఉంటున్నాను. కానీ ప్రాణాలకు భయం లేదు. మీకైతే ప్రాణాలకే ప్రమాదం—" అంది పార్వతి.

శరభయ్య భయపడ్డాడు—"ఏం?" అన్నాడు మళ్ళీ.

"ఏమంటే ఏం చెప్పను? మామయ్యకు స్త్రీ వ్యసనం ఉంది. అందమైన ఆడపిల్ల కనపడితే తన మనుషుల్ని పెట్టి ఇంటికి రప్పించుకుని ఇష్టమైనంతకాలం అనుభవించి తర్వాత చంపించేస్తాడు...."

"చంపడమెందుకు?" అన్నాడు శరభయ్య కంగారుగా.

"తన విషయాలు బయటకు పొక్కడం మామయ్యకిష్టముండదు. నాకు డ్యాన్సు నేర్పడం మిషమీద పెద్ద పెద్ద జీతాలు ఆశ పెట్టి ఇక్కడకు రప్పిస్తాడు. ఆ తర్వాత వాళ్ళ బ్రతుకు బండలౌతుంది. కొత్తవాళ్ళెవరూ ఈ ఇంటకి వచ్చి ప్రాణాలతో బయటకు వెళ్ళలేదు—"అంది పార్వతి.

శరభయ్య గుండెలు గుబగుబలాడాయి. తను చాలా పెద్ద ప్రమాదంలో ఇరుక్కున్నాడా?

"ఈ ఇంట్లోని నౌకర్లు దీన్ని మృత్యుమందిరం అని పిలుస్తారు. దీనికి ఇష్టపడకుండా ఇక్కడుంటున్న మనిషిని నేనొక్కదాన్నే!" అంది పార్వతి మళ్ళీ.

"ఇక్కడి నౌకర్లకు ఈ మందిరమంటే ఇష్టమేనా?" అన్నాడు శరభయ్య.

"చాలా ఇష్టం! ఎందుకంటే మామయ్య తన మోజు తీరిపోయాక ఆ ఆడవాళ్ళను నౌకర్లకు వదిలేస్తాడు. వాళ్ళు ఇష్టం వచ్చినంతకాలం అనుభవించవచ్చు. ప్రాణాలతో ఉండాలంటే ఆ నౌకర్లు చెప్పినట్లు వింటూ వాళ్ళతో మంచిగా వుండాలి. కాదంటే ప్రాణాలు కోల్పోతారు. ప్రాణభయంతో ఇప్పటికి ఈ ఇంటి దాసీలుగా యాభై

మంది ఆడవాళ్ళున్నారు. వాళ్ళ జీవితం అతి నికృష్టమైనది. సంపాదన లేని వేశ్యలు. గౌరవమెరుగని పని మనుషులు. గతిలేక ఇక్కడ వుంటున్నారు. వాళ్ళలో కొందరు, పాపం ఉన్నత కుటుంబాలకు చెందినవారు కూడా వున్నారు. ఏం చేస్తారు? ఈ ఇంటి నౌకర్లు సామాన్యులు కారు. బలంలో భీముళ్ళు. వృత్తిరీత్యా హంతకులు. ప్రవృత్తిరీత్యా రాక్షసులు...."

పార్వతి మాటలు వింటూంటే శరభయ్యకు భయం పెరిగిపోయింది—"అది సరేలేగానీ నీ కథేమిటో చెప్పు." అన్నాడు కనీసం కొంత మార్పుంటుందని.

పార్వతిని నిట్టూర్చింది—"విలువ కట్టలేని ఆస్తికి వారసురాల్ని చేసి నాన్న చచ్చిపోయాడు. మగ దిక్కు లేని అమ్మ తన తమ్ముణ్ని చేర దీసింది. నడమంత్రపు సిరి మామయ్యను దుర్మార్గుణ్ని చేసింది. మామయ్య కిరాత కాలు నచ్చక అమ్మ అతడికి ఉద్వాసన చెప్పాలని చూసింది. మామయ్య అమ్మను చంపేశాడు. ఈ ఆస్తికిప్పుడు వారసురాలిని నేను. నన్ను చంపితే పోలీసుల దృష్టిలో పడతానని భయపడుతున్నాడు. అదేకాక అమ్మ రాసిన విల్లులో నాకు మామయ్య సంరక్షకుడిగా ఉంటాడనీ—నేను చనిపోయిన పక్షంలో ఆ స్తి ప్రభుత్వానికి చెందాలనీ వుంది. అందువల్ల మామయ్య దుర్మార్గం నా మీదకు మళ్ళలేదు. మామయ్య నాకంటే చాలా పెద్దవాడు. అయినా సరే నామీదకూడా ఆశపడ్డాడు. తను నా మీద చెయ్యి వేస్తే ఆత్మహత్య చేసుకొంటానని బెదిరించాను. అందుకే నా జోలికి రావడం లేదు...."

శరభయ్య పార్వతి చెప్పిన కథంతా విని—టూకీగా ఆమె చెప్పిన ఈ కథలో అంతులేని విషాదమూ, ఒక

దుర్మార్గుడి అమానుషమూ దాగి ఉన్నాయని గ్రహిం చాడు.

"ఇలాంటి కొంపలో ఉన్న నీ ధైర్యాన్నభినందిం చాలి!" అన్నాడు.

"నేను బ్రతుకుతున్నది ధైర్యంతో కాదు. ఆశతో! ఏదో ఒక రోజున ఈ భయంకర మృత్యుమందిరం నుంచి బయట పడతానన్న ఆశే నన్నింకా బ్రతికిస్తోంది...." అంది పార్వతి.

శరభయ్య నిట్టూర్చి—"నాకా ఆశ కూడా వున్నట్లు లేదు...." అన్నాడు. తననీ మృత్యుమందిరానికి పంపిం చిన సుజాత గురించి ఆలోచిస్తున్నాడు. ఈ సుజాత ఆపదనుండి బాగానే తప్పించుకోగలిగింది. కానీ ఆమెకు ఈ మృత్యుమందిరం గురించి యెవరు చెప్పారు? పార్వతి చెప్పిన ప్రకారం ఇక్కడి విషయాలు బయటి వాళ్ళెవరికీ తెలియవు. అలాంటప్పుడు ఆమె ఈ విషయాల నెలా తెలుసుకోగలిగింది?

# 7

"నేను బట్టలు మార్చుకుంటాను. మీరు కూడా మార్చు కుంటారా?" అనడిగింది పార్వతి.

శరభయ్య తడబడుతూ—"ఎందుకు?" అన్నాడు.

"ఎందుకేమిటి? మనిద్దరికీ ఈ గదిలోనే మకాం—" అంది పార్వతి—"ఇప్పుడు టైం చాలా అయింది. మనం పడుకుంటే మంచిది; మామయ్య ఇంట్లో లేని • రోజున నాకు హాయిగా నిద్ర పడుతుంది. ఈ రాత్రి వృథా చేసు కోవడం నాకిష్టం లేదు...." అంది పార్వతి.

శరభయ్య మంచాన్ని, గదినీ పరీక్షగా చూసి—"ఇంకో మంచం లేదా?" అన్నాడు.

"మిమ్మల్ని వేరే మంచంమీద పడుకోబెట్టడానికి— మీరేం మగాడుకాదు గదా! మీరే మగాడైతే ఈ గదిలో పడుకోనిస్తానా" అంది పార్వతి. అంటూనే ఆమె ఓ బీరువాదగ్గరకు నడిచి తలుపు తీసింది. అందులోంచి పలచటి నైట్ గౌను తీసింది.

శరభయ్య అటు చూడడం మానుకున్నాడు. తను మగవాడని తెలియక ఆమె ఏ ఇబ్బందీ ఫీలవడంలేదు. తనకు మాత్రం ఆమె పరాయి ఆడది. ఆమె వంక చూడడం తప్పు.

"ఏమిటి మేస్టారూ ఆలోచిస్తున్నారు?" అంది పార్వతి. చటుక్కున శరభయ్య ఆమె వైపుకు తిరిగాడు. అతడి కళ్ళు చెదిరిపోయాయి. జీవితంలో అటువంటి సౌందర్యం కళ్ళబడినా అదృష్టమే! పలచటి నైట్ గౌన్‌లోంచి ఆమె శరీరపు వంపు సొంపులు స్పష్టంగా తెలుస్తున్నాయి.

"మీరు కూడా బట్టలు మార్చుకుంటారా?" అనడిగింది పార్వతి.

తల అడ్డంగా వూపాడు శరభయ్య. వేడెక్కిన అతని శరీరం మెదడును పనిచేయనివ్వడంలేదు. పార్వతి మంచం ఎక్కి పడుకుని—"మీరూ పడుకోండి — నాకు నిద్ర వస్తోంది—" అంది.

"నా కింకా నిద్ర రావడంలేదు. నువ్వు పడుకో—" అన్నాడు శరభయ్య.

"మీరు పడుకుంటేగానీ నేనూ పడుకోను—"అంటూ అతన్ని చేయి పట్టుకుని లాగింది పార్వతి. అనుకోకుండా మంచంమీద వెల్లకితలా పడ్డాడు శరభయ్య.

పార్వతి అతనికి దగ్గరగా చేరి మీద చేయివేసి కళ్ళు

మూసుకుని పడుకుంది.

శరభయ్యా కన్నులు మూత పడలేదు. అప్రయత్నం గానే అతనామెను మరోసారి చూశాడు. ఆ నైట్ గౌను వేసుకున్నా వేసుకోకపోయినా ఒకటే! ఒక కన్నె పిల్ల తన పక్కన నగ్నంగా పడుకున్నట్లే ఉంది. తను ఆడదని భ్రమపడకపోతే ఏ ఆడపిల్లా అలా పక్కన పడుకోదు.

శరభయ్యా త్వరగానే తమాయించుకుని తనమీదనున్న ఆమె చేయి క్రిందపెట్టి—"మనిషికి మనిషి దగ్గరగా పడుకుంటే నాకు నిద్ర పట్టదు—" అని దూరంగా జరిగాడు.

కాస్సేపటికి పార్వతి నిద్రపోయింది. కానీ శరభయ్యాకు నిద్ర పట్టలేదు. అప్పుడప్పుడతనామెవంక చూసి మనసు చెదరగొట్టుకుంటున్నాడు. మతి పోగొట్టుకుంటున్నాడు. వళ్ళు వేడెక్కించుకుంటున్నాడు. అంతరాత్మ మాత్రం అతన్ని అదేపనిగా హెచ్చరిస్తోంది—"శరభయ్యా! నువ్వు చిన్నప్పట్నించీ యెలా పెరిగావు? నీ గొప్పతనానికిది ఒక పరీక్ష. నువ్వామెను చూసి చలిస్తే అది మృగ లక్షణమే అనిపించుకుంటుంది—"

ఆడదానికీ మగవాడికీ ఉన్న అనుబంధం మృగ లక్షణమా?

"కానీ ఆ ఆడది నీ చెల్లెలైతే?"

"చెల్లెలైతే అన్న పక్కన ఇలా పడుకుంటుందా—ఈ వయసొచ్చాక?"

"కానీ నువ్వు అన్నవి కాదు. అక్కవి...."

ఉలిక్కిపడ్డాడు శరభయ్యా. తను అన్నయ్య కాదు. అక్కయ్య. తన పక్కన పడుకున్న పార్వతి తన చెల్లెలు. ఒక్కసారిగా శరభయ్యాలోని సంస్కారం ఆవులించి

నిద్రలేచింది.

అప్పటికప్పుడు నిద్రపోతున్న పార్వతినతడు తట్టి లేపాడు.

పార్వతి ఆవులిస్తూ—"ఏమిటీ?" అంది. మత్తు విడి ఆమె కన్నుల్లో ఏదో అనుమానం తొంగి చూస్తోంది. శరభయ్యకు అర్థంకాని మార్పు ఆ కన్నుల్లో చోటుచేసుకుంటోంది.

"చెల్లాయ్" అన్నాడు శరభయ్య స్త్రీ కంఠంతోనే.

పార్వతి ఉలిక్కిపడి—"ఏమన్నావ్!" అంది.

"అవునమ్మా—నిన్నలాగే పిలుస్తాను...." అన్నాడు శరభయ్య.

"సరే—ఈ సంగతి చెప్పడానికింత రాత్రిలేపాలా?" అంది విసుగ్గా ఆవలిస్తూ పార్వతి.

"అది కాదమ్మా—వయసొచ్చిన ఆడపిల్లవు. మరీ ఇల్లా పడుకోవడం బాగుండదు. ఈ నైట్ గౌన్ నాకు నచ్చలేదు. చీరా, జాకెట్టూ వేసుకుని పడుకో—" అన్నాడు శరభయ్య.

"మనింట్లో మనం యెలా పడుకుంటేనేం?" అంది పార్వతి పెంకెగా.

"నీకు స్వతంత్రంలేని ఈ ఇల్లు నీదెలా అవుతుంది? ఈ ఇంట్లో ఎవరిమీదా నీకు అదుపులేదు. ఏ మూలనుంచి ఎవరు చూస్తున్నారో తెలియదు కదా—నా మాట విను. కనీసం నీ పక్కన పడుకున్నంత కాలమైనా నేను చెప్పినట్లు విను...." అన్నాడు శరభయ్య.

"వినకపోతే—"

"నేను క్రింద పడుకుంటాను...." అన్నాడు శరభయ్య.

"పడుకుంటే పడుకో— నేను ఇలాగే పడుకుంటాను" అంది పార్వతి.

ఆమె అలా అన్నదే తడవుగా శరభయ్య మంచం దిగి క్రింద పడుకున్నాడు. తలగడకూడా తీసుకోలేదతను. కానీ ఓ రాత్రివేళ లేచి చూస్తే అతని తలక్రింద దిండు ఉన్నది. వంటిమీద దుప్పటి కప్పి వున్నది. మంచంమీద దుప్పటీ కప్పుకుని వున్న పార్వతి కనిపించింది. నైట్ గౌన్ మంచం పక్కన పడివుంది. తొలగిన దుప్పటీ క్రింద చీరలో కప్పబడివున్న ఆమె కాళ్ళు కనబడుతున్నాయి.

శరభయ్య తృప్తిగా నిట్టూర్చాడు. అతడి మనసిప్పుడెంతో తేలిగ్గా వున్నది.

## 8

శరభయ్య అలా ఎంతసేపు నిద్రపోయాడో తెలియదు గానీ—పార్వతి తట్టి లేపేవరకూ అతనికి మెలకువ రాలేదు. ముసుగులోంచే "ఊఁ" అన్న శరభయ్యకు వాస్తవం అర్థం కావడానికి కొన్ని క్షణాలు మాత్రమే పట్టింది.

అతడొక పర్యాయం బుగ్గలు తడుముకున్నాడు. మరీ అంత గరుకుగా లేవు. అదృష్టవశాత్తూ తనకు గెడ్డం మాయడానికి మూడు రోజులైనా పడుతుంది. ఎటొచ్చి ఆడవేషంలో వున్నాడు కాబట్టి రోజుకొకసారైనా గీయక తప్పదు.

"టైము తొమ్మిదయింది—" అంది పార్వతి.

ముసుగులోంచే అన్నీ సవరించుకుని లేచాడు శరభయ్య.

"త్వరగా కాలకృత్యాలు ముగించండి మేస్టారూ! టిఫిన్ సిద్ధంగా వుంది—" అంది పార్వతి.

"మీ మామయ్య గోవిందరావు గదెక్కడమ్మా—" అన్నాడు శరభయ్య.

"అది మగాళ్ళ గది. అదెందుకు మీకు?" అంది పార్వతి.

"నేనక్కడే స్నానం చేస్తాను...." అన్నాడు శరభయ్య. పార్వతి అతడివంక విచిత్రంగా చూసి—"సరే పదండి—" అంటూ ఓ గదిలోకి తీసుకు వెళ్ళింది.... "ఇదే మా మామయ్య గది—బాత్రూం దీన్నానుకునే వుంది."

శరభయ్య ఆ గదిని చూశాడు. సినిమాలో విలన్ల గదిలా వుందది. మంచం పక్కన ఓబల్ల. బల్లమీద భయంకరంగా నోరు తెరచిన పులి బొమ్మ. మంచాన్నానుకుని వున్న గోడకు బుసకొడుతున్న నాగుల బొమ్మలు తగిలించి వున్నాయి. గది గోడలకు శృంగార చిత్రాలున్నాయి.

"ఇన్నాళ్ళని చెప్పలేను కానీ మామయ్యా మీరూ ఈ గదిలో కనీసం ఒక్క రోజైనా వుంటారు—"అంది పార్వతి. ఆ మాటలు వింటూనే శరభయ్య శరీరం జలదరించింది. అతను వెంటనే బాత్ రూంలోకి దూరి తలుపులు వేసుకొన్నాడు.

ఈ గదిలో శరభయ్యకు చాలా ఫ్రీగా వుంది. ముఖప్రక్షాళన చేసుకొన్నాడు. అక్కడ వున్న షేవింగ్ పెట్టె ఉపయోగించి గెడ్డం గీసుకున్నాడు. హాయిగా స్నానం చేసుకొన్నాడు. స్నానం అయ్యేక బాధగా, దీనంగా తను వేసుకోవలసిన బట్టలు వంక చూశాడు— "ఇంకా ఎన్నాళ్ళీ వేషం?" అనుకుని నిట్టూర్చి బట్టలు వేసుకుంటూండగా అతనికి రెండు విషయాలు గుర్తుకొచ్చాయి. తనీరోజు వ్యాయామం చేయలేదు. తనకు ఆఫీసుకు

పైమెంది.

అవును....తను ఆఫీసు సంగతి ఇంతవరకూ ఎలా మర్చి పోయాడు?

తనకు క్యాజువల్ సెలవులు చాలా వున్నాయి. కానీ ఈ భవనంలో ఎన్నాళ్ళు చిక్కబడి వుంటాడు? ఇక్కణ్నించి పోయే ప్రయత్నమేదైనా చేయవద్దా?

అదెలా సాధ్యం—ఇది మృత్యుమందిరం!

శరభయ్య స్నానాలగదిలోంచి బైటకువచ్చి పార్వతి గదిలోకి వెళ్ళాడు. అతన్ని చూస్తూనే-"మళ్ళీ అదే బట్టలు వేసుకొచ్చారా మేస్టారూ!" అంది పార్వతి.

"అవును...." అన్నాడు శరభయ్య.

"నేనిస్తాను మంచి బట్టలు. మార్చుకోండి...."

"నేను మార్చుకోను. నేనిప్పుడిక్కణ్నించి వెళ్ళి పోబోతున్నాను...." అన్నాడు శరభయ్య.

"వెళ్ళిపోతారా—ఎలా" అంది పార్వతి ఆశ్చ ర్యంగా.

"ఎలా వచ్చానో—అలాగే!" అన్నాడు శరభయ్య.

"మీ ప్రాణాలకే ప్రమాదం!" అంది పార్వతి.

"అయినా ఫరవాలేదు. గోవిందరావు వచ్చేలోగా వెళ్ళిపోవాలనే నా ప్రయత్నం...."

"మీరు ప్రమాదం లేకుండా వెళ్ళగలిగితే....నాకు ప్రమాదం...." అంది పార్వతి.

"పార్వతీ—నువ్వు ప్రమాదంలోనే పుట్టి పెరిగావు. చేతనైనంతలో నాకు సాయపడు. నేను బైటపడితే నిన్ను రక్షించడానికి ప్రయత్నిస్తాను...." అన్నాడు.

పార్వతి క్షణం ఆలోచించి—"ఈ ఇంట్లోంచి స్త్రీ లెవ్వరూ బైటకు పోలేరు. మా మామయ్య బట్టలు వేసు

కని పురుష వేషంలో బయట పడడానికి ప్రయత్నించండి. ఆ పైన మీ అదృష్టం ఎలా వుంటే అలా జరుగుతుంది-" అంది పార్వతి.

శరభయ్య తిరిగి గోవిందరావు గదిలోకి వెళ్లాడు. ఒక బీరువా తెరచి బట్టలు బైటికితీశాడు. ఒక పంట్లాం అతనికి చాలా పొడుగైంది. మరొకటి చాలా పొట్టిదయింది. ఒకటి బాగా బిగుతయింది. ఒకటి మరీ లూజుగా వుంది. ఇలా అన్నీ తలో రకంగా ఉండడం అతనికి చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. మొత్తంమీద ఒక జతను అతను ధరించి మళ్ళీ పార్వతి దగ్గరకు వెళ్ళాడతను.

"అచ్చం మగవాడిలాగున్నారు...." అంది పార్వతి అతన్ని అబ్బురంగా చూస్తూ.

"రాత్రి నీకు అక్కను. ఇప్పుడు నీకు అన్నను...." అన్నాడు శరభయ్య స్త్రీ కంఠాన్ని వదలకుండా.

"అయితే ఇంక వెళ్ళండి మేస్టారూ!" అంది పార్వతి.

శరభయ్య పార్వతి గదిలోంచి హాల్లోకి వచ్చాడు. అదృష్టవశాత్తూ అతనినెవరూ అడ్డగించలేదు.

టాక్సీ కనబడితే ఎక్కాడు. ఆఫీసుదగ్గరే దిగాడు. జేబులో డబ్బుల్లేవు. ఆఫీసులో ఎవర్నో అడిగి ఇచ్చేశాడు.

అయితే తనకేమీ కానందుకూ, తను మృత్యుమందిరంలోంచి బైటపడి ఇంకా జీవించే ఉన్నందుకూ అతని కెంతో ఆశ్చర్యంగా వుంది. ఆ ఆశ్చర్యనుంచిసాయంత్రం వరకూ బైట పడలేకపోయాడతను. అప్పటికతను ఈ లోకంలోకి వచ్చి—"పార్వతిని రక్షించాల్సిన బాధ్యత ఒకటి నా పైన ఉంది—" అనుకున్నాడు.

అయితే ఈ విషయం ఎక్కడ చెప్పాలి? పోలీసు

లకు చెబితే....? అతని ఆలోచన ఇంకా తేలకుండానే డిటెక్టివ్ వెంకన్న పేరతనికి గుర్తొచ్చింది. ఈ విష యంలో ఆయన సలహా తీసుకొంటే మంచిదనిపించింది.

ఆఫీసునుంచి అతను తిన్నగా డిటెక్టివ్ వెంకన్న ఇంటికి వెళ్ళాడు. వెళ్ళగానే కనబడిన వెంకన్న అసి స్టెంట్సును చూసి అతను తెల్లబోయాడు. వారిద్దరూ ఇంచు మించు ఒకలా ఉండడం సంగతటుంచితే—?!....ఇతర విషయాలన్నీ మరిచిపోయి—"మీలో సుజాత ఎవరు?" అన్నాడతను.

"నా పేరు సీతమ్మ—ఈమె పేరు రాజమ్మ...." అంది సీతమ్మ.

రాజమ్మ అతడివంకే పరీక్షగా చూస్తూ-"మైగాడ్.." అంది.

"ఏం—పిలిచావు—" అంటూ పలికాడు వెంకన్న. పిలిస్తే పలికే దేవుణ్నని బయట కూడా అంటూంటా డతను.

"ఇతను ధరించిన బట్టలు సూర్యనారాయణవి...." అంది రాజమ్మ.

ఆ బట్టలు తనవి కావని తెలిసిన శరభయ్య గతుక్కు మన్నాడు.

"నన్ను క్షమిస్తే నా వివరాలు చెబుతాను.." అన్నాడతను.

"సరే మీరలా కూర్చుని మీ వివరాలన్నీ చెప్పండి-" అన్నాడు వెంకన్న. శరభయ్య సుజాత తన గదికి రావడం దగ్గర్నుంచి జరిగిన కథంతా చెప్పాడు. సుజాత అక్కడున్న అమ్మాయిల్లో వున్నదని కూడా అన్నాడు.

వెంకన్న ఆశ్చర్యంగా రాజమ్మను చూస్తూ —

"అయితే నిన్న సెలవు తీసుకుని నువ్వు చేసిన పని ఇదన్న మాట—" అన్నాడు.

"ఇంతకాలం మీకు చెప్పనందుకు మన్నించండి. నా కథకూడా వినండి—" అంటూ రాజమ్మ మొదలు పెట్టింది.

సూర్యనారాయణ అనే అతను ప్రేమ పేరుతో రాజమ్మ వెంటబడ్డాడు. తనతన్ని ప్రేమించకపోయినా రాజమ్మ అతన్ని చాలా పర్యాయాలు ఏకాంతంగా కలుసుకొంది. ఒకరోజు సూర్యనారాయణ రాజమ్మతో ఒక పార్కులో ఏదో మాట్లాడుతూండగా అతనికోసం రమేష్ అనే మనిషి వచ్చాడు. సూర్యనారాయణ రాజమ్మ దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. తర్వాత మళ్ళీ అతను కనబడలేదు. అతనేమయ్యాడో కూడా తెలియదు. అతని గురించి ఎవరూ పట్టించుకోలేదు. తనకెవ్వరూ లేరని అంటూండే సూర్యనారాయణ ఉద్యోగమేమిటో, అతని ఇల్లెక్కడో కూడా ఆమెకు తెలియదు. కొంతకాలం గడిచాక ఆమె ఆ విషయాన్ని మరిచిపోయింది.

అనుకోకుండా మొన్న ఆమెకు రమేష్ కనిపించాడు. చూస్తూనే అతడినామె గుర్తుపట్టింది. పలకరించి సూర్యనారాయణ గురించి అడిగింది. అతను కాసేపు ఆలోచిస్తే గానీ ఏమీ చెప్పలేకపోయాడు. తర్వాత-మర్నాడొచ్చి చిన్న నాటకమాడితే సూర్యనారాయణ వివరాలు తెలుస్తాయని చెప్పాడు. రాజమ్మ సరేనని నిన్న నాటకంలో రమేష్‌కు సహాకరించింది. రమేష్ ఎంతవరకూ నిజం చెప్పాడో తెలియదుకానీ ఇప్పుడు శరభయ్య ధరించిన బట్టలు నిశ్చయంగా సూర్యనారాయణవి.

"ఏమీ విశేషాలు లేవనుకున్నానీ రోజు. చూస్తూండగా

ఓ పెద్ద మిస్టరీ దేవలప్పయింది—" అన్నాడు వెంకన్న-
"మిస్టర్ శరభయ్యా! మీకు నాతో రాగల ధైర్య
ముందా?"

"ఎక్కడికో చెప్పండి!" అన్నాడు శరభయ్య.

"మృత్యుమందిరానికి...."

శరభయ్య ఓ పర్యాయం రాజమ్మవంక చూశాడు. నన్ను రక్షించరూ అంటూ తనవంక దీనంగా చూసిన ఆ యువతి, ప్రమాదం ముంచుకొస్తూందంటూ తన ఎదుటే బట్టలు మార్చుకొని తన్ను రెచ్చగొట్టిన జాణ - ఇప్పుడు కొత్త రకంగా చూస్తోంది. ఆ చూపులతనికి సవాలుగా నిలిచాయి. వెంటనే తలాడించాడు.

శరభయ్య, వెంకన్న అక్కణ్నించి బయల్దేరి మృత్యుమందిరం చేరుకోవడానికి అర్ధగంట పట్టింది. కారు వెంకన్నే డ్రైవ్ చేశాడు.

## 9

మృత్యుమందిరంలోకి అడుగు పెడుతూంటే శరభయ్యకు గుండె ఝల్లుమంది. నిన్న రాత్రి తన అనుభవాలు, పార్వతి చెప్పిన కథ, గోవిందరావు గది-ఒకటొక్కటిగా గుర్తుకు వచ్చాయతనికి.

హాల్లో ఎవరూ లేరు. ఇల్లంతా నిర్మానుష్యంగా వున్నట్లుంది. ఆశ్చర్యంగా ఇద్దరూ ముందడుగు వేశారు. శరభయ్య వెంకన్నను పార్వతి గదిలోకి నడిపించాడు.

అక్కడ మంచంమీద పడివున్నదొక శవం! కత్తి తిన్నగా ఆమె పొట్టలోకి దిగి వుంది. రక్తంతో మంచం మీద దుప్పటీ తడిసిపోయింది.

"పార్వతి!" అన్నాడు శరభయ్య. అప్రయత్నంగా అతడి కళ్ళముందు నైట్ గౌన్లో తన పక్కన పడుకొన్న

పార్వతి మెదుల్తోంది. తనకు విషాదంగా వీడ్కోలిస్తోన్న పార్వతి మెదుల్తోంది-"చెల్లాయ్!" అనుకున్నాడతను- రాత్రి ఆమెతో తన ప్రవర్తన గుర్తుకు వచ్చి.

వెంకన్న హడావుడిగా చుట్టూ గమనించాడు. తన పద్ధతిలో ఏవేవో పరీక్షించాడు. కాసేపటికి-"సందేహం లేదు. ఇది ఆత్మహత్యే అయ్యుండాలి-" అన్నాడు.

"ఎలా నిర్ణయించారు?" అన్నాడు శరభయ్య.

"గదిలో పెనుగులాడిన లక్షణాలు లేవు. ఈమె పడి వున్న తీరూ కత్తి పొట్టలోకి పొడుచుకుని వున్న తీరూ- ఇది ఆత్మహత్యేనని చెప్పక చెబుతాయి-" అన్నాడు వెంకన్న.

అయితే అక్కడ ఇంకే ఆధారాలూ లభించలేదు.

"మనకీ కేసులో ఆధారం రమేష్ ఒక్కడేనను కుంటాను...." అన్నాడు శరభయ్య.

"అవును. ఇంకా సావిత్రి, వీరేశ్వర్రావు ఉన్నారు. కానీ నాటమాడించింది రమేష్ కాబట్టి అతనికే ఎక్కువ తెలిసుండాలి...." అన్నాడు వెంకన్న.

"ఈ హత్య గోవిందరావు చేయించి వుంటాడంటారా" అన్నాడు శరభయ్య.

"ఇది హత్య కాదన్నాను గదా!" అన్నాడు వెంకన్న.

"కానీ ఉదయం పార్వతి భయపడింది. నేనీ ఇంట్లోంచి బైటకు వెళ్ళడంవల్ల తన ప్రాణాలే పోవచ్చునేమోనని అంది...." అన్నాడు శరభయ్య.

వెంకన్న శరభయ్య మాటలు విని "ఊహూఁ" అన్నాడు. తర్వాత వాళ్ళు ఇల్లంతా వెదికారు. అంత పెద్ద ఇంట్లో ఇంకెవ్వరూ మనుషులు లేకపోవడమూ సరైన సాక్ష్యాధారాలు దొరక్కపోవడమూ వెంకన్నకు

ఆశ్చర్యమేననిపించింది.

"మనమిప్పుడేం చేయాలి?" అన్నాడు శరభయ్య.

"పోలీసులకు సమాచారం యివ్వడం మంచిది...."

"ఎందుకని?"-అన్నాడు శరభయ్య కంగారుగా.

"పార్వతి వంటిమీద ఖరీదైన నగలున్నాయి. ఏ దొంగైనా కాజేయవచ్చు-" అన్నాడు వెంకన్న. అయితే వెంకన్న తనయొక్క, శరభయ్యయొక్క ఉనికి తెలీకుండా పోలీసులకు సమాచారం అందించాడు.

## 10

"సార్-" అంది రాజమ్మ కంగారుగా.

"ఏం జరిగింది?" అన్నాడు వెంకన్న తలెత్తి చూసి.

"నేను రాత్రి రమేష్ గదికి వెళ్ళాను...." అంది రాజమ్మ.

వెంకన్న రకరకాల భావాలు మిశ్రమం చేసిన చూపు చూశాడామె వంక.

"గదికి వెళ్ళానంటే రమేష్ వుండగా కాదు. అతను లేనప్పుడు....మారు తాళాలతో తెరిచి వెళ్లాను...." అంది రాజమ్మ.

"రమేష్ గది నీకెలా తెలుసు?"

"మొన్న అంత నాటకమాడాక - అతడి నివాసం తెలుసుకోకుండా ఎలా వదుల్తాను? నేను మీ అసిస్టెంటుని కదా!" అంది రాజమ్మ.

"అయితే?"

"అతని గదిలో సినిమారీళ్ళు దొరికాయి. మొత్తం ఆరున్నాయి. ఎందుకైనా మంచిదని తీసుకొచ్చాను...." అంది రాజమ్మ.

అంతవరకూ రాజమ్మ చేతిలోంచి బ్యాగును చూడనే

లేదు. "వెరీగుడ్!" అన్నాడు వెంకన్న.

ఆ రీళ్ళని తీసుకొని వెంకన్న-అసిస్టెంట్సు-ఓ గదిలోకి వెళ్ళారు. గదిలో ప్రొజెక్టర్ వుంది. వెంకన్న రాజమ్మ తెచ్చిన రీలును ప్రొజెక్టరుకు ఫిక్స్ చేశాడు.

కొద్ది క్షణాల్లోనే సినిమా ఆరంభమైంది.

ఉలిక్కిపడ్డాడు వెంకన్న. మాటలులేని ఆ మూకీ సినిమాలో పార్వతి ఉంది. శరీరపు వంపు సొంపులన్నీ స్పష్టంగా ప్రదర్శించే నైట్ గౌన్లో వున్నదామె.మంచం మీద ఒక పురుషుడు కూర్చుని వున్నాడు. అతనామె వంక కసిగానే చూస్తున్నాడు. ఆమె, అతను ఏమేం మాట్లాడుకుంటున్నారో తెలియడంలేదు. కానీ చూపుల్ని బట్టి ఆమె అతన్ని రెచ్చగొడుతోందనే అనుకోవచ్చు. అతను రెచ్చిపోతున్నాడని తెలుసుకోవచ్చు.

కాసేపు తర్వాత అతని పక్కనుంచే మంచాన్నెక్కిందామె. అతనామె పక్కకు తిరిగాడు. ఆమె మీద చేయివేసి ఆమె శరీరపు వంపుల్ని తడుముతున్నాడు. ఆమె కదలికలు పరవశాన్నే సూచిస్తున్నాయి. కానీ ఉన్నట్లుండి ఆమె లేచి కూర్చుంది. అతని వంక అదోలా చూసి మంచంమీంచి వురికింది. అతను కూడా మంచంమీంచి దిగాడు. ఇప్పుడామె అతన్నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తోంది. అతడామె మీద పడడానికి ప్రయత్నిస్తున్నాడు.

అలా అయిదు నిముషాలు జరిగింది. హఠాత్తుగా ఆమె మంచం దగ్గరకు చేరి తలగడ క్రిందనుంచి ఏదో తీసి చేతులో వెనక్కి పెట్టుకుంది. అతడివంక ఆహ్వాన సూచకంగా చూసింది. అతను సంతోషంగా ఆమెను సమీపించి, ఆమెను కౌగలించుకున్నాడు. ఆమె చేతులు

అతడి వీపు వెనక్కి వచ్చాయి. ఆ చేతుల్లో పదునైన కత్తి వున్నది. అది బలంగా అతడి వీపులోకి దిగబడింది. తర్వాత అతణ్నామె ఒక్క తోపు తోసింది.

ఇప్పుడామె చూపులు భయంకరంగా వున్నాయి. ఆమె సౌందర్యదేవతలా కాక మహంకాళిలా వుంది....

సరిగ్గా అక్కడే సినిమా ఆగిపోయింది.

రెండో రీలు కూడా అలాగే వుంది. మంచంమీద యువకుడు మాత్రం మారాడు.

మూడో రీల్లో రాజమ్మ-"అతడే సూర్యనారాయణ!" అని అరిచింది.

సూర్యనారాయణ వేసుకున్న బట్టలు నిన్న శరభయ్య ధరించినవే అనడంలో సందేహం లేదు. అతడు వాటిని విప్పి ఓ పక్కనపెట్టి పార్వతి విప్పిన చీరను లుంగీగా కట్టుకున్నాడు. పార్వతి చేతిలో తర్వాత ఘోరంగా హత్య చేయబడ్డాడు.

ఒకటి కాదు.... రెండు కాదు .... మొత్తం ఆరు హత్యలు చేసింది పార్వతి....

ఎందుకు?

ఆరు రీళ్ళు చూసిన వెంకన్నకు ఓ అనుమానం వచ్చింది. అసలీ రీళ్ళు ఎందుకు, ఎలా తయారయ్యాయి. పార్వతి కోరికపై ఇవి తయారయ్యాయా-లేక రమేష్ వీటి సాయంతో ఆమెను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడా?....అసలీ కథలో రమేష్ స్థానం ఏమిటి?

వెంకన్న ఆలోచిస్తూనే అక్కణ్నించి లేచివచ్చి తన సీట్లో కూర్చున్నాడు. అతనాలోచిస్తూండగానే అక్కడికి శరభయ్య వచ్చాడు కంగారుగా-"సార్! మీరూ

హించింది కరెక్టే....పార్వతి ఆత్మహత్య చేసుకుంది. అందుకు నేనే కారకుణ్ని-" అన్నాడు.

"ఏం జరిగింది?" అనడిగాడు వెంకన్న.

శరభయ్య అతనికి మౌనంగా ఒక ఉత్తరం అందించాడు.

అదొక పెద్ద లేఖ. పార్వతి శరభయ్యకు రాసింది.

సంపన్న కుటుంబానికి చెందిన పార్వతి తల్లి దండ్రుల మధ్యకు విషకీటకంలా ప్రవేశించాడు సూరిబాబు. పార్వతి తల్లి జగదాంబమీద అతను కన్ను వేశాడు. జగదాంబ చూచాయగా అతడి దురూహను తెలుసుకున్నప్పటికీ స్త్రీ సహజమైన క్షమాగుణంతో మందలించి ఊరుకుంది. దీన్ని అలుసుగా తీసుకొని ఇంకో పర్యాయం వాడామె ఇష్టానికి వ్యతిరేకంగా అత్యాచారం చేయబోయాడు.

అనుకోకుండా అప్పుడు పార్వతి తండ్రి రావడం జరిగింది. వాళ్ళిద్దరికీ పెద్ద గొడవ జరిగింది. ఆ గొడవలో సూరిబాబు పార్వతి తండ్రిని చంపేసి పారిపోయాడు. తనది హత్యగా ఎవరికీ చెప్పవద్దనీ, సూరిబాబు అత్యాచారం గురించి ప్రచారం కానివ్వద్దనీ ఒట్టు వేయించుకుని కన్ను మూశాడు పార్వతి తండ్రి. ఆ హత్య ఆ విధంగా రహస్యంగానే ఉండిపోయింది.

ఆ తర్వాత సూరిబాబు మళ్ళీ ఆ ఇంటు జేరాడు. తనకోసమే జగదాంబ తన భర్తను హత్య చేసిందన్న ప్రచారాన్ని లేవదీస్తానని భయపెట్టి-ఆమె దగ్గర డబ్బు గుంజడం మొదలు పెట్టాడు. ఆ కుటుంబానికి వచ్చే అపనిందకు భయపడి జగదాంబ అతనడిగిన డబ్బు ఇచ్చేది. పార్వతికి పన్నెండేళ్ళు వచ్చేవరకూ ఈ వ్యవహారం కొన

సాగింది.

క్రమంగా సూరిబాబు ఆశ పెరిగిపోయింది. అతడు జగదాంబకో పీడ అయ్యాడు. జగదాంబ తనకు లొంగిపోతే సూరిబాబు డబ్బు అడగనని చెప్పాడు.

ఈ పరిస్థితుల్లో జగదాంబ పార్వతిని కూర్చోబెట్టి తన కథంతా చెప్పింది. ఆ కథ వింటూంటే పార్వతి రక్తం మరిగింది. ఆ సూరిబాబుని చంపేయాలని ఆవేశంగా అంది. జగదాంబకూ సూరిబాబును చంపేయాలని వుంది. అయితే ఇందులో మూడో వ్యక్తి ప్రమేయముండడం ఆమె కిష్టంలేదు. ఇంటి పరువుకు సంబంధించిన విషయం తమ మధ్యనే వుండాలని ఆమె వుద్దేశ్యం.

తల్లీ కూతుళ్ళిద్దరూ బాగా ఆలోచించి ఓ పథకం వేశారు. ఆ ప్రకారం ఓ రోజున జగదాంబ సూరిబాబును తన చేతుల్లోకి ఆహ్వానించింది. ఆమె కౌగిలిలో వున్న సూరిబాబును పార్వతి వీపులో పొడిచి చంపింది. తర్వాత తల్లీ కూతుళ్ళిద్దరూ కలిసి సూరిబాబును ఇంటి దొడ్లోనే పాతిపెట్టారు.

అయితే ఆ హత్య పార్వతిని మానసికంగా దెబ్బ తీసింది. హత్య తర్వాత రెండు రోజులామెకు జ్వరం కూడా వచ్చింది. ఆ తర్వాతనుంచి ఆమెలో విచిత్రమైన కోర్కె! మగవాళ్ళను కౌగిలిలోకి ఆహ్వానించి చంపాలన్నది ఆమె విచిత్రమన కోరిక! ఈ కోరికను చంపుకో లేక, తల్లికి చెప్పుకోలేక ఆమె చాలా మథనపడింది. చూస్తూండగా ఏళ్ళు గడిచి ఆమె యుక్తవయస్కురాలైంది. ఒక కారు ప్రమాదంలో జగదాంబ చనిపోగా మేనమామ నన్న పేరుతో గోవిందరావా యింట చేరాడు.

అతడు పక్కా వ్యభిచారి. తాగుబోతు. అతడికి వేరే నా అన్నవాళ్ళు ఎవ్వరూ వున్నట్లు లేరు. పార్వతి అతన్ని వుండమనలేక పొమ్మనలేక నానా అవస్థా పడింది. అండ లేని ఆడదానికో తోడు అవసరమని గ్రహించి గోవింద రావునామె భరించింది. గోవిందరావు పార్వతిని తనకు భార్యను చేసుకోవాలనుకున్నాడుగానీ అసలుకే మోస మని గ్రహించి నిగ్రహించుకున్నాడు.

పార్వతికి డ్యాన్సు నేర్పాలన్న మిషతో అతను కొంత మంది ఆడవారిని ఇంటికి రప్పించుకుంటూండేవాడు. ఆ ఏర్పాట్లన్నీ అతడికి రమేష్ అనే అతను చేస్తూండేవాడు. అప్పుడే రమేష్కూ పార్వతికీ పరిచయమైంది. రమేష్ చూడ్డానికి చాలా అందంగా ఉంటాడు కానీ అతగాడికి పురుషత్వం లేదు. ఆడవాళ్ళ ననుభవించే ఆవేశం, శక్తి, అదృష్టం—అతడికి లేవు. అందుకే అతడికి వయసులో ఉన్న పురుషులంటే అసూయ. ఈ సందర్భంలో పార్వతికీ, రమేష్కీ అభిప్రాయాలు కలిశాయి. అప్పుడే పార్వతి మనసులోని కోరిక పురివిప్పింది. రమేష్ అందుకు తన సహకారాన్ని వాగ్దానం చేశాడు.

అరునెలల క్రితం హత్యాకాండ ప్రారంభమైంది. యేదో రూపంలో మోసం చేసి మగవాళ్ళను మూడో వాడికి తెలీకుండా పార్వతి దగ్గరకు రప్పించేవాడు రమేష్. పార్వతి తెలివిగా ప్రవర్తించి తన కసితీరా హత్య చేసేది. దాన్ని పక్కగదిలోంచి సినిమాలుగా తీశాడు రమేష్. అది తన ఆనందానికే అని అతను చెప్పినా —ముందు ముందు తన్ను తన గుప్పెట్లో ఉంచుకోవ డానికేనని పార్వతి గుర్తించింది. అయినా ఆమె బాధ పడలేదు. పురుషులంటే ఒక విధమైన ద్వేషం యేర్పడి

పోయిన ఆమెకు స్త్రీత్వానికి సంబంధించిన కోర్కెలు లేవు. రమేష్‌ను వివాహం చేసుకునేటందుకు కూడా ఆమెకు అభ్యంతరం లేదు.

ఇలా ఉండగా కొద్దిరోజుల క్రితం గోవిందరావు పార్వతివద్ద హద్దుమీరాడు. అతడు తనకిక లొంగడనీ, తన మాట వినడనీ గ్రహించిన పార్వతి మంచిగా నటించి కౌగిలిలోకి ఆహ్వానించి అతన్ని చంపేసింది.

అయితే గోవిందరావు అంటే యింట్లోని నౌకర్లకు కొందరికి చాలా అభిమానం. వారికి అతడి చావు గురించి తెలీకుండా ఉండడంకోసం, అతడింకా బ్రతికున్నట్లు వారిని నమ్మించడంకోసం శరభయ్యను ఆడవేషంలో ఇంటికి రప్పించడం జరిగింది. అందువల్ల రెండు ప్రయోజనాలు. గోవిందరావుకోసం ఆడపిల్ల వచ్చినట్లూ అవుతుంది. పార్వతి చేతిలో చావడానికి ఓ మగాడూ దొరుకుతాడు.

శరభయ్య మగాడని తెలిసీ తెలియనట్లు నటించింది పార్వతి. అందువల్ల అతన్ని రెచ్చగొట్టడం మరింత సులభమయిందామెకు. అయితే శరభయ్య తన్ను తాను నిగ్రహించుకున్నాడు. అతని సచ్ఛీలత, మనోనిగ్రహం పార్వతిని ముగ్ధురాల్ని చేశాయ్. ఆహ్వానించే చూపులతో పక్కన పడుకున్న ఆడదాన్ని చెల్లీ అని పిలవగలిగిన సహృదయతకు ఆమె చలించిపోయింది. మొదట్లో అతని చూపుల్లోని వాడినీ, ఒంటి వేడినీ ఆమె స్పష్టంగా తెలుసుకో గలిగింది. అతడు తన్ను తాను నిగ్రహించుకుందుకు చేసే ప్రయత్నాలన్నీ గమనించి ఆమె ఆశ్చర్యపోయింది. పక్కన ఉంటే నిగ్రహించుకోలేనని క్రింద పడుకున్నప్పుడామె మనసు పాడైపోయింది.

పురుషుల్లో మహాత్ము లున్నారనీ, యెవడో సూరి బాబును దృష్టిలో ఉంచుకుని తను చేస్తున్న హత్యలు ఘోరాతిఘోరమైనవనీ గ్రహించిందామె. జీవితం మీద విరక్తి కలిగింది. శరభయ్యను వెళ్ళనిచ్చి—అతని పేరున ఓ ఉత్తరం రాసింది. రమేష్‌ద్వారా అతని చిరునామా సంపాదించి రమేష్‌కు తెలీకుండా ఉత్తరాన్ని పోస్టు చేసింది. తర్వాత ఆత్మహత్య చేసుకుని జీవితాన్నంతం చేసుకుంది—

ఇదీ ఆ ఉత్తరంలోని సారాంశం. ఆ ఉత్తరం చదవడ మయ్యేక వెంకన్న లేచి శరభయ్యకు షేక్‌హ్యాండిచ్చి—"గౌతముడు మనిషిని రాయి చేస్తే రాముడు రాతిని మనిషిగా మార్చాడు. నువ్వు చెప్పిన కథను మొదట్లో నేను పూర్తిగా నమ్మలేదు. నావంటి వెయ్యి డిటెక్టివ్‌లు కలిసినా చేయలేని ఒక గొప్ప పని నీ సచ్ఛీలత చేయగలి గింది. ప్రపంచానికి ఒక దారుణ హంతకురాలి పీడ విరగడ చేశావు. ఓ మృత్యు మందిరాన్ని నాశనం చేశావు. నిన్ను నేను అభినందించక తప్పదు—" అన్నాడు.

రాజమ్మ వెంకన్న వంక అదోలా చూస్తూ—"కానీ బాస్! నాదో చిన్న అనుమానం. ఒకవేళ ఈయన కూడా రమేష్‌లాగే...." అని కిసుక్కున నవ్వింది.

"మిస్ సుజాతా! మీ అనుమానాన్ని మీలో అలాగే ఉంచుకోండి కానీ మళ్ళీ నాకు పరీక్షలు మాత్రం పెట్ట కండి. ఘోషయాత్రలో కౌరవు లోడించలేని గంధ ర్వుల్నీ, ఉత్తర గోగ్రహణంలో భీష్మ ద్రోణాదుల్నీ అవ లీలగా ఓడించిన అర్జునుడు కురుక్షేత్రం వచ్చేసరికి నానా యాతనలు పడ్డాడు...." అన్నాడు శరభయ్య.

"అయితే...." అని రాజమ్మ ఏదో అనబోగా—

"మిస్ రాజమ్మా—శరభయ్యగారిమీద జోక్స్ వేస్తే నేను సహించలేను. ఐ అడ్మైర్ హిమ్—" అన్నాడు వెంకన్న సీరియస్‌గా.

"జోక్ కాదు బాస్....చిన్న రిక్వెస్ట్...." అంది రాజమ్మ.

"ఏమిటది?" అనడిగాడు వెంకన్న.

"మా వీథిలో ఓ నాటకం వేస్తున్నారు. హీరోయిన్ వేషానికి యెవ్వరూ దొరక్క నానా అవస్థా పడు తున్నారు. శరభయ్యగారొప్పుకుంటే...." అని ఇంకా యేదో అనబోయి ఆగిపోయింది రాజమ్మ.

ఒప్పుకోవడానికి శరభయ్య అక్కడ లేడు.

—ఐపోయింది—

# సినీతార (ఆత్మ) హత్య!

## వాణిశ్రీ

ఆ రోజు శుక్రవారం.

తూర్పు దిక్కున అరుణోదయానికి ప్రకృతి రంగాన్ని సిద్ధం చేస్తోంది.

ప్రఖ్యాత సినీతార సిరిదేవి భవనం ముందు టూరిస్ట్ బస్ ఆగింది. అంతా తిరుపతి నుంచి వచ్చారేమో బోడి గుండులు తళతళ మెరుస్తున్నాయి.

అంతా మెయిన్ గేటు ముందు గుమిగూడారు.

'వీళ్ళకేం పనిపాటా లేనట్లుంది. తెల్లవారక ముందే వచ్చి పడ్డారు' అని గొణుక్కుంటూ వచ్చాడు వాచ్ మాన్.

"అమ్మగారు ఇంకా నిద్ర లేవలేదు" అన్నాడు.

"లేచేదాకా వేచి వుంటాం" అన్నారు జనం.

వాచ్ మాన్ అయిష్టంగా గేటు తాళం తీశాడు. టూరిస్టులు సిరిదేవి భవనం ఆవరణలో లాన్స్ మీద జట్లు జట్లుగా కూర్చున్నారు.

సిరిదేవి దర్శనంకోసం ఎగురు తెస్తున్నారు చూస్తున్నారు అభిమానులు.

సిరిదేవికి జెడ్ కాఫీ త్రాగే అలవాటులేదు. అలాగే సూర్యోదయానికి ముందే నిద్ర లేచే అలవాటు కూడా లేదు. ఆమె యెప్పుడు నిద్ర లేస్తే అప్పుడామె గది తలుపులు తెరుచుకుంటాయి. అప్పుడామె దినచర్య ప్రారంభమవుతుంది. ఆమె నిద్ర లేచిన వేళనుబట్టి ప్రోగ్రాం నిర్ణయిస్తాడు ఆమె సెక్రెట్రీ పవన్ కుమార్.

ఏడింటికి స్కూటర్ మీద వచ్చాడు పవన్ కుమార్.

ఆఫీస్ రూమ్‌లో ఏ. సి. ఆన్ చేసి కూర్చున్నాడు ఫైల్స్ ముందేసుకుని. నిన్న వచ్చిన టపాలో ముఖ్యమైన లెటర్స్‌కి జవాబులు టైప్ చేసి సిరిదేవి సంతకానికి సిద్ధంగా వుంచాడు. పత్రికలలో ఆమె నటించిన చిత్రాల లోని స్టిల్స్, ఇతర వార్తలను రెడ్ పెన్సిల్‌తో మార్కు చేసి రెడీ చేశాడు.

ఎనిమిది దాటింది.

ఇంకా సిరిదేవి నిద్ర లేవలేదు.

బైట అభిమానుల్లో కలకలం చెలరేగింది.

ఆమె నిద్రలేచి వుంటుందనీ, ఇంకా దర్శనం ఇవ్వడం లేదనీ వాళ్ళు అనుమానించారు.

కొందరు కుర్రాళ్ళు "సిరిదేవి బైటకు రావాలి" అని కేకలు పెట్టసాగారు.

వాచ్‌మాన్ వాళ్ళతో ఘర్షణ పడుతున్నాడు.

సెక్రెట్రీ పవన్ కుమార్ వెళ్ళి ఆమె ఇంకా నిద్ర లేవ లేదనీ, రాత్రి షూటింగ్‌లో చాలా ప్రొద్దుపోయిందనీ, అందుకే ఆమె ఈ పూట నిద్ర లేవడం ఆలస్యమైతుందనీ నచ్చజెప్పాడు. అంతా భోజనంవేళకు వస్తే తప్పకుండా

చూడ వచ్చనీ, ఫొటోలు గూడా తీసుకో వచ్చనీ అన్నాడు.

"ఆ వేళప్పుడు ఇంట్లో యెందుకుంటుంది? ఏ స్టూడియో లోనో వుంటుంది" అన్నారు యెవరో.

"లేదయ్యా! సిటీలో వుంటే ఆమె భోజనానికి ఇంటికే వస్తుంది" అన్నాడు సెక్రెట్రీ.

"ఇంత దూరం వచ్చాం. ఆమె లేచేదాకా ఇక్కడే వుంటాం" అన్నారు.

"సరే మీ యిష్టం" అని విసురుగా వెళ్ళిపోయాడు పవన్ కుమార్.

తొమ్మిది కావచ్చింది.

ఫోన్ కాల్స్ రావడం మొదలయ్యాయి. ఆమె ఇంకా నిద్ర లేవలేదని సమాధానం చెప్పలేక విసుగు పుట్టింది అతనికి.

అతని మనసులో అనుమానం మొలకెత్తింది. 'ఆమె ఇంకా నిద్ర లేవకపోవడం యేమిటి?'

ఆమె రాత్రి పదిన్నరకి ఇల్లు చేరుకుంది. తను వెంటనే వెళ్ళిపోయాడు. ఆ తర్వాత భోజనం చేసి ఒక అరగంటలో పడుకొని వుంటుంది. అది ఆమెకు మామూలే. సామాన్యంగా ఆమె ఏడింటికల్లా నిద్ర లేస్తుంది. ఎప్పుడో సెకండ్ షో సినిమాకి వెళ్ళినప్పుడు కొంత ఆలస్యంగా లేస్తుంది.

'తొమ్మిదింటి వరకూ లేవక పోవడానికి కారణం యేమిటి?'

'గది తలుపు తట్టి ఆమెను నిద్ర లేపితే?' అనుకొన్నాడు.

'కాని ఆమెకు కోపం వస్తుందేమో?' అని అనుమానం

వచ్చింది.

వంటమనిషి కమలమ్మని పిలిపించాడు.

"రాత్రి అమ్మగారు ఎన్ని గంటలకు పడుకొన్నారు?" అని ప్రశ్నించాడు పవన్ కుమార్.

"భోజనం చేసి పడుకొన్నారు. టైమ్ చూళ్ళేదు" అంది కమలమ్మ.

"నేను వెళ్ళిన వెంటనే భోజనం చేశారా?"

"ఆс...."

"వెంటనే నిద్ర పోయారా?"

"నేను గమనించలేదు. భోజనం చేసి బెడ్ రూమ్‌కి వెళ్ళి పోయారు."

"అమ్మగారు ఇంకా నిద్ర లేవలేదు. రాత్రి పొద్దు పోయేవరకూ మేలుకొని వున్నారేమో నని అడిగాను."

"అదే నేనూ అనుకొంటున్నాను. టిఫిన్ పెసరట్లు చెయ్యమన్నారు. అమ్మగారు నిద్ర లేస్తారేమో నని చూస్తున్నాను. ఈ పూట వంట యేం చెయ్యమంటారో? వంట ఆలస్యమవుతుందేమో నని నా బాధ" అంది కమలమ్మ.

"సరే నేను తలుపు తట్టి చూస్తాను" అన్నాడు పవన్ కుమార్.

"చూడండి" అంది కమలమ్మ.

అతను మెట్లెక్కి మేడపైకి వెళ్ళాడు.

మెల్లిగా తలుపులు తట్టాడు.

రెస్పాన్స్ రాలేదు.

గట్టిగా తట్టాడు.

ఉహూс....లాభం లేకపోయింది.

అతని గుండె వేగంగా కొట్టుకొంది.

ఎంత కొట్టినా లోపల నుంచి సమాధానం రావడం లేదు.

'కొంతతీసి....' అనుమానం వచ్చింది.

అతనికి ముచ్చెమటలు పోశాయి.

పరిగెత్తుకొంటూ ఆఫీసు గదిలోకి వచ్చి పడ్డాడు. అతని కంగారు చూసి నౌకర్లు వచ్చారు హడావుడిగా.

టెలిఫోన్ డైరక్టలో పోలీస్ కంట్రోల్ రూమ్ నెంబర్ వెతికి ఫోన్ చేశాడు.

"పోలీస్ కంట్రోల్ రూమ్ ప్లీజ్" అని సమాధానం వచ్చింది.

"సార్.... నేను సినీ ఆర్టిస్టు సిరివేవి సెక్రెటరీని మాట్లాడుతున్నాను."

"వాట్ డూ యూ వాంట్ ప్లీజ్?"

పవన్ కుమార్ జరిగిందంతా చెప్పాడు. తనకి అనమానంగా వుందని వెంటనే పోలీసుల్ని రమ్మని రిక్వెస్టు చేశాడు.

ఎలాగో ఈ వార్త లాన్స్‌లో కూర్చున్న అభిమానులకు చేరింది. అంతా గుంపులుగా పోర్టికోలోకి వచ్చి నిల్చున్నారు. నౌకర్లని ప్రశ్నలతో వేధిస్తున్నారు.

కాసేపటికి పోలీస్ వ్యాన్ వచ్చింది.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ విశ్వనాథం, సబ్ ఇన్‌స్పెక్టర్ డానియేల్ వ్యాన్ దిగారు. వాళ్ళ వెనుక కానిస్టేబుల్సు దిగి జనాన్ని అదుపులో పెట్టసాగారు.

పవన్ కుమార్ ఎదురు వచ్చి వాళ్ళని మేడ పైకి తీసుకెళ్ళాడు.

ఆ గది తలుపులు టేక్ వుడ్‌తో చేసినవి. ద్వార బంధం కూడా చాలా స్ట్రాంగ్‌గా వుంది. రకరకాల డిజైన్స్ చెక్కి కళాత్మకంగా మలిచారు దాన్ని.

విశ్వనాథం గట్టిగా నెట్టి చూశాడు.

"నో డౌట్ ఇటీజ్ ఏ సూసైడ్ కేస్" అన్నాడు పెదవి విరిచి.

తల వూపాడు ఎస్.ఐ. గది లోపల లాక్ చేసి వుంది. డూప్లికేట్ కీ లేదన్నాడు సెక్రెట్రీ.

ఎయిర్ కండిషన్ చేయబడినది కాబట్టి కిటికీ లన్నీ మూసే వున్నాయి. ఏ. సి. ఆన్ చేసే వున్నట్లు శబ్దం వస్తోంది.

"బ్రేక్ చెయ్యాల్సిందే!" అన్నాడు సర్కిల్ ఇన్‌స్పెక్టర్.

ఎస్. ఐ. ఆ ఏర్పాట్లు చేశాడు.

లోపల బోల్టు లాక్ వూడిపడి భళ్ళున తెరుచుకొంది తలుపు.

విశ్వనాథం గదిలోకి రెండడుగులు వేసి నిలబడి పోయాడు. గదంతా పరికించి చూశాడు.

గది యెంతో విశాలంగా వుంది. కిటికీ లన్నింటికీ మిల మిల మెరుస్తున్న కర్టెన్స్ వున్నాయి. గది మధ్యలో డబుల్‌కాట్ మీద నైట్ గౌనులో నిద్రపోతున్నట్లుగా వుంది సిరిదేవి.

ఆమె కళ్ళు మూసుకొని వున్నాయి. ఇంకా నిద్ర పోతూనే వుందా అనే భ్రాంతి కలిగిస్తోంది.

విశ్వనాథం అనుమానంతో దగ్గరగా వెళ్ళి చూశాడు. సందేహంలేదు ఆమె శ్వాస ఆగిపోయి వుంది.

"షీ డైడ్!" అన్నాడు గట్టిగా.

# 2

సినీతార సిరిదేవి ఆత్మహత్య చేసుకుందనే వార్త దావానలంలా నగరంలో నలు మూలలా వ్యాపించి పోయింది.

జనం తండోపతండాలుగా ఆమె నివాస గృహానికి రాసాగారు. వాళ్ళని అదుపులో పెట్టడం పోలీసులకు పెద్ద సమస్యగా తయారైంది.

సినిమా పరిశ్రమకు చెందిన ప్రముఖ నిర్మాతలు, దర్శకులు, నటీనటులు, స్టూడియో అధిపతులు, పత్రికా ప్రతినిధులు ఆమె ఇంటికి ప్రవాహంలా రాసాగారు.

ఆమెతో చిత్రాలు తీస్తున్న ప్రొడ్యూసర్లు ఏడుపు ముఖం పెట్టి మిత్రులతో తమ గతి యేమిటా? అని వాపోతున్నారు.

ఐ. జీ., నగర పోలీస్ కమీషనర్, ఇంకా పెద్ద పోలీస్ ఆఫీసర్లు కూడా హుటాహుటిన సిరిదేవి ఇంటికి చేరుకొన్నారు.

శవ పంచాయితీ జరిపి శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపే సరికి మిట్టమధ్యాహ్నం దాటిపోయింది.

ఎఫ్.ఐ.ఆర్. తయారుచేస్తూ సిరిదేవి ఇంటిదగ్గరే వుండిపోయాడు ఇన్‌స్పెక్టర్ విశ్వనాథం.

పవన్‌కుమార్ అతని యెదురుగా కూర్చున్నాడు దిగులుగా.

"అయితే సిరిదేవికి దగ్గర బంధువులు సిటీలో ఎవరూ లేరన్నమాట" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

లేరన్నట్లు తల వూపాడు పవన్‌కుమార్.

"పోనీ యే వూళ్ళో వున్నారో చెప్పగలరా?"

"ఆమె స్వగ్రామం తూర్పుగోదావరి జిల్లాలో యేదో

పల్లెటూరు. నాకు సరిగా తెలియదు. అప్పుడప్పుడూ ఒక ముసలమ్మ, పిల్లలు వస్తూ వుండేవాళ్ళు. సిరిదేవికి మేనత్తను కుంటాను. కాని ఆమె వాళ్ళని సరిగా చూసేది కాదు. వాళ్ళ పట్ల చాలా నిర్లక్ష్యంగా ప్రవర్తించేది. సూటి పోటి మాటలతో గాయపరిచేది. వాళ్ళు బాధపడి వెళ్ళి పోయేవారు."

"ఆమె అలా ప్రవర్తించడానికి ఏదో కారణం వుండే వుంటుంది."

"అలాగే అనుకొనేవాడిని నేను కూడా. ఆమె దిక్కు లేని పరిస్థితిలో వున్నప్పుడు బంధువు లెవరూ ఆదుకో లేదని ఆమె అంటూ వుండేది. ఆమె స్వశక్తితో ఒక ఉన్నత స్థానంలోకి వచ్చింది. ఇప్పుడు బంధువులు దగ్గరగా రావాలని ప్రయత్నించినా ఆమె రానివ్వ లేదు."

"ఆమె వయస్సు ఎంత వుండొచ్చు షుమారుగా!"

"ముప్పై వరకూ వుంటాయి."

"మీరు యెంత కాలం నుంచి సెక్రటరీగా పని చేస్తు న్నారు?"

"మూడేళ్ళ నుంచి."

"అంతకు ముందు యెవరు పని చేశారు?"

"సుగుణాకరరావు."

"ఎందుకు మానేశాడు?"

"నాకు సరిగా తెలియదు. బ్లాక్ మనీ విషయంలో ఆమెను మోసం చేశాడని చూచాయగా తెలిసింది. నేను పట్టించుకోలేదు ఆ విషయం."

"అతను యిప్పుడు యెక్కడ వున్నాడో మీకు తెలుసా?"

"తెలియదు. వాళ్ళ వూరు వెళ్ళి యేదో ఇండస్ట్రి స్టార్ట్ చేశాడని ఎవరో చెప్పగా విన్నాను" అన్నాడు పవన్‌కుమార.

"సిరిదేవి టాలెంట్ వున్న ఆర్టిస్టు. దేశంలో సాటి లేని మేటి నటి అనిపించుకొంది. తరగని సంపద సంపాదించింది. ఆత్మహత్య చేసుకోవాల్సిన పరిస్థితులు యేమి వున్నాయో మీ రేమైనా చెప్పగలరా?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

పవన్‌కుమార్ తల వంచుకొని కళ్ళు మూసుకున్నాడు బాధగా.

"అదే ఇన్‌స్పెక్టర్ నాకు అర్థం కాని విషయం. ఆ ప్రశ్నకు సమాధానం నేను చెప్పలేను" అన్నాడు.

"ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకోవాలంటే ఎంతో విరక్తి కలిగితే కాని సాధ్యం కాదు."

తల వూపాడు పవన్‌కుమార్.

"ఆమె మానసికమైన బాధతో ప్రవర్తించినట్లు మీకు గుర్తుందా?"

"లేదు సార్! ఆమె ప్రతిరోజూ యెంతో సంతోషంగా కన్పించేది."

"నిన్న గూడా అలాగే వుందా!"

"అవును సార్. నిన్న వుదయం ఏడింటికి వచ్చాను నేను. అప్పటికే ఆమె నిద్రలేచింది. నేను గుడ్‌మార్నింగ్ చెప్పాను. ఆమె నవ్వుతూ గుడ్‌మార్నింగ్ చెప్పింది. ఆ రోజు కార్యక్రమం ఆమె ముందు వుంచాను. అది చూసి వెరీగుడ్ అంది. తర్వాత బ్రేక్‌ఫాస్టు చేసి స్టూడియోకి వెళ్ళిపోయారు."

"తర్వాత మళ్ళీ మీరు ఆమెను చూడలేదా?"

"లంచ్‌కి యింటికి వచ్చి వెళ్ళినప్పుడు చూశాను. కాని నేనప్పుడు ఆఫీస్‌రూమ్‌లో వున్నాను. యేదైనా పని వుంటే పిలిపిస్తారు. లేదా తనే ఆఫీస్‌రూమ్‌లోకి వస్తారు."

"ఐ. సీ....మరి రాత్రి...."

"నేను పదిన్నర వరకూ వుండి వెళ్ళిపోయాను. తర్వాత డిన్నర్ చేసి పడుకొన్నారని కమలమ్మ చెప్పింది."

"కమలమ్మ ఎవరు?"

"వంటమనిషి."

"ఆమె ఇక్కడే వుందా?"

"ఉంది సార్!"

"పిలిపించండి."

పవన్‌కుమార్ బజ్జర్ నొక్కాడు.

కాసేపటికి కాకీ బట్టలు తొడుక్కొన్న కుర్రాడు వచ్చాడు.

"కమలమ్మను పిలువు."

కమలమ్మ ఏడుస్తూ వచ్చింది. ఇన్‌స్పెక్టర్ ఆమెను రకరకాల ప్రశ్నలు అడిగాడు. ఇంట్లో నౌకర్లందర్నీ ప్రశ్నించాడు.

ఎవరు చెప్పినా సిరిదేవి చాల మంచిదనీ, దేవతలాంటి మనిషనీ కష్టకాలంలో ఆదుకొంటుందనీ చెప్తున్నారు. కాని ఆమె పర్సనల్ విషయాలు చెప్పడంలేదు. బహుశా యెవరికీ తెలియనంత కట్టుదిట్టంగా ప్రవర్తిస్తుందన్న మాట.

"మిస్టర్ పవన్‌కుమార్ ఆమెకు ముప్పై సంవత్సరాలు వచ్చాయిగదా ఇంకా పెళ్ళి చేసుకోకుండా వుండడానికి

కారణం యేమిటి?"

"లోగడ చేసుకొన్న వివాహం భగ్నమవడమే అందుకు కారణం అనుకొంటాను."

"ఏమిటీ? ఆమెకు లోగడ పెళ్ళయిందా?...." ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ విశ్వనాధం.

"అవును సార్! మీకు తెలియదా! ఈ సంగతి అందరికీ తెలిసిందే."

"అఫ్‌కోర్స్. నేను యిలాంటివి పట్టించుకోను. సినిమా మాగ్జయిన్స్ ఆసలే చూడను. మరి నా కెలా తెలుస్తుంది. అయితే ఆమె మొదటిభర్త సారీ మాజీభర్త ఎవరు?"

"నందకుమార్."

"నందకుమార్! ఆ పేరు ఎక్కడో విన్నట్లుందే."

"వినే వుండడం కాదు, చూసే వుంటారు. అతనూ నటుడే."

"యస్! యిప్పుడు అంతగా రావడం లేదనుకొంటాను...."

"ఆయనకి డిమాండ్ లేదు."

"ఎందుకని?"

"క్యారెక్టర్ మంచిది కాదు. త్రాగుడు ఎక్కువై పోయింది. సాటి నటులతోనే అసభ్యంగా ప్రవర్తిస్తుంటాడు. తను గొప్ప నటుణ్ణి అని అహంభావం యెక్కువ. కాల్షీట్సు యిచ్చి అనుకోకుండా యెటో వెళ్ళిపోతుంటాడు. అదీగాక వయస్సు వచ్చి పడింది లెండి. ఏభై యేళ్ళు దాటాయి. ఫీల్డులోకి కుర్రాళ్ళు వచ్చారు."

"అయితే సిరిదేవికి అతనికి ఇరవై యేళ్ళు తేడా వుందన్నమాట."

"ఉంది."

"అంత తేడా వున్నప్పుడు యెలా పెళ్ళాడింది?"

పవన్‌కుమార్ నవ్వాడు.

"మనమేం చెప్పగలం సార్!" అన్నాడు.

"నిజమే. మనకి పెద్ద సమస్యగా కనిపించిన విషయం కొందరికి అసలు సమస్యగానే తోచక పోవచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఏ పరిస్థితిలో పెళ్ళి జరిగిందో గాని మొత్తానికి యెక్కువ రోజులు కాపురం చెయ్యలేదు. ఒక్క సంవత్సరం చేశారేమో! తర్వాత డైవోర్స్ యిచ్చుకొన్నారు."

"ఎవరు? అతనా?"

"ఈమే ఇచ్చింది."

"పెళ్ళి జరిగి యెంతకాలం అయ్యింది?"

"ఐదు సంవత్సరాలు దాటింది."

"డైవర్స్ యిచ్చి నాలుగేళ్ళయిందన్నమాట."

"అంతే. నేను జేరినప్పటికే ఆమె వొంటరిగానే వుంటోంది."

"మరిప్పుడు ఈమె ఆస్తికి వారసు లెవరు?"

పవన్‌కుమార్ పెదవి విరిచాడు.

"తెలియదు సార్!" అన్నాడు.

"పోస్టుమార్టమ్ రిపోర్టు తీసుకొని, కమీషనర్ గారిని కలుసుకోవాలి. వస్తాను. థాంక్స్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ విశ్వనాథం సీట్లోంచి లేచి.

## 3

పోలీస్ కమీషనర్ చాంబర్‌లో క్రైమ్ బ్రాంచ్ పోలీస్ ఆఫీసర్లతోపాటు ఇన్‌స్పెక్టర్ విశ్వనాథం

కూర్చుని వున్నాడు.

పోస్టుమార్టమ్ రిపోర్టు, కెమికల్ ఎగ్జామినర్ రిపోర్టు చూస్తూ కూర్చున్నాడు.

"ఇటీజ్ వెరీ సర్‌ప్రైజింగ్ థింగ్!" అన్నాడు కమీషనర్.

"ఎస్సార్" అన్నాడు ఇన్‌స్పెక్టర్ విశ్వనాథం.

పోలీస్ కమీషనర్ ఆలోచనలో పడిపోయాడు.

"సిరిదేవి ఆత్మహత్య చేసుకోవడానికి కారణం యేమిటో అంతుబట్టడంలేదు సార్. ఆమె రిలెటివ్స్‌తో దగ్గర సంబంధాలు లేవు. నందకుమార్ భర్త. కాని డైవర్స్ ఇచ్చింది."

"నందకుమార్ పరిస్థితి బాగాలేదనీ, ఇప్పుడు ఇన్కమ్ యేమీ లేదని తెలిసింది. అతన్ని మనం సస్పెక్ట్ చెయ్యవచ్చునా?" ప్రశ్నించాడు కమీషనర్.

"అంటే నందకుమార్ ఆమెను మర్డర్ చేయించాడని మీరు అనుమానిస్తున్నారా? అందువల్ల అతనికి లాభం యేమిటి? డైవర్స్ ఇచ్చిన తర్వాత ఆస్థి అతనికి వస్తుందా? లీగల్ పాయింట్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"సిరిదేవి ఆస్థికి వారసులు ఎవరు?" ఎవరో ఆఫీసర్ ప్రశ్నించాడు.

"అదే తేలడం లేదు."

"ఆమె రక్తసంబంధీకులు ఎవరూ లేరా?"

"లేరు. ఆమెకు వయసు వచ్చేసరికి తల్లిదండ్రులు పోయారు. తర్వాత నాటకాల్లో వేషాలు వేస్తూ బ్రతికేది. కొంత కాలానికి సినిమారంగంలో ప్రవేశించి గొప్ప నటిగా పేరు ప్రతిష్టలు సంపాదించింది."

"ఇందులో ఏదో మిష్టరీ వుందని నాకు అనుమానంగా

వుంది. సిరిదేవికి ఆత్మహత్య చేసుకోవలసిన దారుణమైన పరిస్థితులు ఏమీ లేవు. ఆమె చనిపోతే ఆస్తి వచ్చే వారసులూ లేరు. అంటే ఆమెను హత్య చేస్తే లాభం పొందేవాళ్ళు లేరు. కాబట్టి ఆమె ఆత్మహత్య చేసుకొని వుండాలి. లేదా ఆమె ఆస్తికోసం కాకుండా కేవలం ఆమెమీద పగతో విష ప్రయోగం చేయించి వుండాలి" అన్నాడు క్రైమ్‌బ్రాంచి ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి.

అంతా ఆలోచనలో పడిపోయారు.

"మిస్టర్ కృష్ణమూర్తీ ఈ కేసు మీరు టేకప్ చేసి ఇన్వెస్టిగేట్ చెయ్యగలరా?"

కృష్ణమూర్తి సందేహంగా చూశాడు విశ్వనాథం వైపు.

అతను నవ్వి—"నేను సెలవులో వెళ్తున్నాను" అన్నాడు.

"ఐతే నేను రెడీ...." నవ్వుతూ అన్నాడు కృష్ణమూర్తి.

"మిస్టర్ విశ్వనాథం కేస్ డైరీ మూర్తికి ఇవ్వండి" అన్నాడు కమీషనర్.

కృష్ణమూర్తి సీట్లోంచి లేచి వెళ్ళి కమీషనర్ ముందున్న కెమికల్ ఎగ్జామినర్ రిపోర్టు తీసుకొన్నాడు.

## 4

"మిస్టర్ పవన్‌కుమార్ సిరిదేవి షుమారు పదేళ్ళనుంచీ హీరోయిన్‌గా నటిస్తున్నదనుకొంటాను!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి.

"అవును సార్!"

"ఆమె దాదాపు వంద చిత్రాల్లో నటించింది కదూ!...."

"అవును."

"ఆమె పిక్చర్ కి యెంత రెమ్యూనరేషన్ తీసుకునేదో మీకు తెలుసనుకొంటాను."

"అది ఆమె యిష్టప్రకారం జరిగేది. నిర్మాతనిబట్టి, కథనిబట్టి అంటే ఆ చిత్రం బడ్జెట్ నిబట్టి, చిత్రం తీసే భాషనిబట్టి ఆమె తన రెమ్యూనరేషన్ తీసుకొనేది."

"మీరు వచ్చిన దగ్గర్నుంచి నటించిన చిత్రాలకు దేనికి ఎంత తీసుకుందో మీరు చెప్పగలరా?"

"షుమారుగా చెప్పగలను."

"ఆ వివరాలు తియ్యండి."

పవన్ కుమార్ ఐరన్ బీరువాలోనుంచి ఫైలు తీశాడు. వైట్ పేపర్ మీద చిత్రం పేరు అందుకు తీసుకొన్న రెమ్యూనరేషన్ వేసి టోటల్ ఫిగర్ వేశాడు.

అది చూసి కృష్ణమూర్తి నవ్వాడు.

"ఇవి ఇన్కమ్‌టాక్స్ వాళ్ళకి ఇచ్చే వివరాలు. నాకు కావలసింది అవి కాదు."

"మరి."

"మిష్టర్ పవన్ కుమార్ సిరిదేవి పిక్చర్ కి మూడు లక్షలు తీసుకుంటుందని నాకు తెలుసు. కాని ఆమె ఇచ్చిన రసీదులు పాతిక వేలు, ముఫ్పై వేలకి వున్నాయి."

"అవన్నీ నాకేం తెలుసు?"

"మీకు అన్నీ తెలుసు. బ్లాక్ మని వ్యవహారాలన్నీ మీ చేతిమీదుగా జరిగేవని కొందరు ప్రొడ్యూసర్స్ మాకు చెప్పారు. నా అంచనా ప్రకారం కనీసం పాతిక లక్షలు బ్లాక్ మనీ వుండాలి సిరిదేవి వద్ద. కాని ఆమె బ్యాంక్ ఖాతాలలో ఫిక్సెడ్ డిపాజిట్స్, కరెంట్ ఎక్కౌంట్స్ అన్నీ కలిసి రెండు లక్షలు గూడా లేదు."

కృష్ణమూర్తి మాటలు విని తడబడ్డాడు పవన్ కుమార్.

"డబ్బంతా నేను ఆమెకే ఇచ్చేవాడిని."

"ఇచ్చివుంటారు. కాదని నేను అనడంలేదు. కాని ఆ డబ్బంతా ఆమె యేంచేసిందో తెలిసివుండాలి మీకు?"

"నాకు తెలియదు."

"మీకు ఆమె జీతం యెంత ఇచ్చేవారు?"

"నెలకు వెయ్యి రూపాయలు."

"నెలకు వెయ్యి. మీరు మూడేళ్ళు పని చేశారు. మొత్తం ముప్ఫైఆరువేలు జీతం క్రింద ముట్టింది మీకు. కాని మీ పిల్లల పేరున మీ పేరున ఏభై వేలకు ఫిక్సిడ్ డిపాజిట్స్ వున్నాయి బ్యాంక్‌లో. లక్ష రూపాయలు విలువచేసే పొలం కొన్నారు మీ నేటివ్ ప్లేస్‌లో. నగరంలో యిల్లు కట్టిస్తున్నారు. యివన్నీ జీతంలోనే...." నవ్వాడు కృష్ణమూర్తి.

"జీతంకాక అప్పుడప్పుడూ ఆమె కొంత డబ్బు బోనస్‌గా ఇస్తూ వుండేవారు."

"అవన్నీ నిజమే కావచ్చు. కాని ఆమె బ్లాక్‌మనీ అంతా మీకు తెలిసివుండే చోట వుంది. బంగారం రూపంలోగాని, డబ్బు రూపంలోగాని వుంది. మీకు తెలుసు. నిజం చెప్పండి" కృష్ణమూర్తి గొంతు కరుకుగా వుంది.

"అంటే—మీరు నన్ను అనుమానిస్తున్నారా?"

"అవును."

"ఆమె ఆత్మహత్య చేసుకోవడానికి నేను కారణం అంటారా?"

"యూ ఆర్ రాంగ్ మిష్టర్ పవన్‌కుమార్. ఆమె

ఆత్మహత్య చేసుకోలేదు. హత్య చేయబడింది. యెవరో విషప్రయోగం చేశారు."

అదిరిపడ్డాడు పవన్‌కుమార్. అతని ముఖం వెలా వెలా పోయింది. ఏ.సి. రూమ్‌లోగూడా అతనికి చెమటపట్టింది. శరీరంలో సన్నగా వణుకు ప్రారంభమైంది.

"ఈజిట్ కరెక్ట్?"

"ఎస్. కెమికల్ ఎగ్జామినర్ రిపోర్టులో తేలింది ఆ విషయం. గురువారం రాత్రి ఆమె మద్యం త్రాగింది. తర్వాత డిన్నర్‌లో చికెన్ తీసుకొంది ఆమె. ఈ రెండు స్టేజస్‌లో యెప్పుడో విషం కలిసింది. అందువల్ల ప్రాణం పోయింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి.

"ఓ మైగాడ్!" అంటూ తలను చేత్తో పట్టుకొని కూర్చుండిపోయాడు పవన్‌కుమార్.

"ఇప్పుడు చెప్పండి. ఆమె బ్లాక్‌మనీ గురించి."

"సార్! నన్ను బాధపెట్టకండి. నాకు ఏమీ తెలియదు ఆ డబ్బు గురించి."

"నేను నమ్మను. ఆమెను మర్డర్ చెయ్యడానికి మీాకే యెక్కువ అవకాశమున్నట్లు నేను అనుమానిస్తున్నాను. ఆమె బ్లాక్‌మనీ మీా చేతిలో వుంది. బహుశా ఏ అజ్ఞాత వ్యక్తి పేరునో బ్యాంక్ లాకర్స్‌లో అదంతా వుండి వుండొచ్చు. సిరిదేవిని హత్య చేస్తే ఆమె ఆస్థి రాక పోయినా బ్యాంక్ లాకర్స్‌లో వున్న బ్లాక్‌మనీ దక్కించుకోవచ్చునని మీారే చేసివుండొచ్చు."

"నో...." అంటూ గట్టిగా అరిచాడు పవన్‌కుమార్.

# 5

నెహ్రూ రోడ్డులో బస్ స్టేజిలో దిగాడు కృష్ణమూర్తి. ఇంటి నెం. 9, నెహ్రూ రోడ్డు దామోదరం

పిళ్లై స్ట్రీట్ కోసం వెతకసాగాడు.

నెప్రూరోడ్ లో కొంతదూరం నడిచాక కుడిప్రక్క సందులో దామోదరపిళ్లై స్ట్రీట్ అని బోర్డు కనిపించింది.

నాలుగు ఇళ్ళు దాటాక 9వ నెంబర్ భవనం ముందు ఆగాడు. గేటు ప్రక్కన పూలమొక్కలకి పాదులు త్రవ్వుతున్నాడు తోటమాలి.

ప్రహరీగోడకి తెల్లటి పాలరాతి మీద అరుణాచలం, అనే అక్షరాలు చెక్కిన పలక వుంది.

కృష్ణమూర్తిని చూసి తోటమాలి తను చేస్తున్న పని ఆపి వచ్చాడు.

"అయ్యగారు వున్నారా?"

"ఉన్నారు" అంటూ గేటు తీశాడు.

అరుణాచలం ఒంటరిగానే కూర్చుని వున్నాడు గదిలో.

"గుడ్ మార్నింగ్!" అంటూ విష్ చేశాడు కృష్ణమూర్తి.

అరుణాచలం తల పైకెత్తి ప్రశ్నార్థకంగా చూశాడు కృష్ణమూర్తిని. అతని కళ్ళు ఎర్రగా నిప్పుముద్దల్లా వున్నాయి. టేబుల్ మీద రమ్ము బాటిల్ వుంది. గ్లాసులో సగానికి ఎర్రటి ద్రవం వుంది. టేబుల్ మీద ప్లేటులో జీడిపప్పు, చిప్స్ వున్నాయి.

'ప్రొద్దున్నే మొదలుపెట్టాడు మానవుడు' అని గొణుక్కున్నాడు కృష్ణమూర్తి.

"మీరెవరో గుర్తుపట్టలేదు, ఐయామ్ సారీ!"అన్నాడు అరుణాచలం.

"నన్ను మీరు చూసి వుండరు లెండి. నా పేరు

కృష్ణమూర్తి. క్రైమ్‌బ్రాంచి ఇన్‌స్పెక్టర్ని. సిరిదేవి కేసు యిన్వెస్టిగేట్ చేస్తున్నాను" అంటూ ఐడెంటిటీ చూపించాడు.

"నిల్చునే వున్నారేం? కూర్చోండి ప్లీజ్!" అన్నాడు అరుణాచలం.

కృష్ణమూర్తి గదంతా పరీక్షగా చూడసాగాడు.

అరుణాచలం రెండో గ్లాసులో రమ్మునీసా వంచి సోడా పోశాడు.

"ప్లీజ్ టేకిట్" అన్నాడు.

"నో థాంక్స్. అలవాటు లేదు" అన్నాడు కృష్ణమూర్తి నవ్వుతూ.

అరుణాచలం బలవంతం చెయ్యలేదు. కాలింగ్ బెల్ నొక్కి కుర్రాడిని పిలిచి గోల్డ్ స్పాట్ తెప్పించాడు.

"సిరిదేవి గురువారం మీ పిక్చర్ షూటింగ్‌లో ఆమె జీవితంలో ఆఖరిసారి నటించిందనుకొంటాను" అన్నాడు కృష్ణమూర్తి స్ట్రాతో డ్రింక్ తీసుకొంటూ.

"ఆ క్రెడిట్ మాత్రం దక్కింది నాకు" పేలవంగా నవ్వాడు అరుణాచలం.

"ఆమె హఠాత్తుగా పోవడం మీకు చాలా లాస్ అనుకొంటాను."

"లాస్ అని నెమ్మదిగా అంటారేమిటి సార్! కొంపలు ముంచేసిందనుకోండి. నా పిక్చర్ మధ్యలో వుంది. పూర్తిగా తగలపెట్టాల్సిందే. నాలాంటివాళ్ళు పదిమంది వున్నారు. అంతా పిచ్చిపట్టినట్లు తిరుగుతున్నారు యేం చెయ్యాలో తోచక" సిరిదేవి చనిపోయినందుకు అతను యే మాత్రం బాధను వ్యక్తం చెయ్యలేదు. తనకి నష్టం

జరిగినందుకు మాత్రం విచారిస్తున్నాడు.

కృష్ణమూర్తి తల వూపాడు.

"సూసైడ్ చేసుకోదల్చుకున్నప్పుడు మా పిక్చర్స్ పూర్తిచెయ్యాల్సింది. ఆవిడ అవన్నీ ఆలోచించలేదు. మధ్యలో మమ్మల్ని బికార్లను చేసి వదిలింది" నిష్ఠూరంగా అన్నాడు అరుణాచలం.

"ఆమె సూసైడ్ చేసుకుందని అందరూ అనుకుంటున్నారు. కాని అది కరెక్టు కాదు."

"మరి?...." ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"ఎవరో ఆమెను మర్డర్ చేశారు."

తన ముందు బాంబ్ ప్రేలినట్లు అదిరిపడ్డాడు అరుణాచలం.

"నిజమా సార్?"

"నిజమే. ఆ విషయమే ఇన్వెస్టిగేట్ చేస్తున్నాను. ఆమెను మర్డర్ చేసింది ఎవరో కూడా కనిపెట్టితీరతాను" పట్టుదలగా అన్నాడు కృష్ణమూర్తి.

"అలాగా సార్! మేమంతా సిరిదేవిని తప్పుగా అర్థం చేసుకొన్నాం సార్! నిజానికి ఆమె చాలా మంచిది. ప్రొడ్యూసర్స్‌ని ఇబ్బందిపెట్టే నైజం లేదు. మా కష్టసుఖాలు ఆలోచించి ప్రవర్తించేది. తను పెద్ద స్టార్‌నని గర్వం లేనిది" అరుణాచలం సిరిదేవిని పొగడసాగాడు.

"మీరు మాకు సహకరిస్తే హంతకుడిని పట్టుకోనడం చాలా సులభం అవుతుంది."

"డెఫినెట్లీ సార్! అడగండి. మీకు కావలసిన విషయాలు నాకు తెలిసినవన్నీ చెప్తాను" అన్నాడు అరుణాచలం.

"మీ రిప్పుడు మంచి మూడ్‌లో లేరేమో? మరొక

సారి వస్తాను" అన్నాడు కృష్ణమూర్తి.

"నో....నో....డ్రింక్ గురించా మీరు మూడ్ అంటున్నారు. ఫరవాలేదు. నాకు మామూలే! ఈ సీసా మొత్తం లాగించినా నాకేం కాదు. అలవాటు. ఇది లేకపోతేనే మూడ్ లేనట్లు" నవ్వాడు అరుణాచలం.

"గురువారం రాత్రి సిరీదేవి విస్కీ తీసుకుంది. సామాన్యంగా ఒంటరిగా విస్కీ తీసుకునే అలవాటు ఏ కొద్ది మందికో వుంటుంది. అదీగాక ఆమె ఒంటరిగా తీసుకోదలిస్తే ఇంట్లోనే తీసుకోవచ్చునుగదా! ఎక్కడో తీసుకోవలసిన అవసరం ఏముంది?"

"నిజమే! కాని గురువారం సాయంకాలం ఆరింటికే ఆమె స్టూడియో నుంచి వెళ్ళిపోయింది. ఆ తర్వాత ఎక్కడికి వెళ్ళిందీ, యెవరితో డ్రింక్ తీసుకుందీ నాకు తెలియదు."

"ఆమె ఏ కారులో వెళ్ళింది?"

"స్వంత కారులోనే. తనే డ్రైవ్ చేసుకుని వెళ్ళింది. ఆమెకు డ్రైవర్ వున్నాడు. కాని అతన్ని పగలు మాత్రమే వాడుకుంటుంది. లంచ్‌కి యింటికి వెళ్ళి వచ్చిన తర్వాత అతన్ని పంపేస్తుంది. షూటింగ్ పూర్తయ్యాక తనే కారు డ్రైవ్ చేసుకొని వెళ్తుంది."

"ఐ. సీ!...." అన్నాడు కృష్ణమూర్తి యేదో ఆలోచిస్తూ.

"ఆమె హాట్ డ్రింక్స్ తీసుకుంటుందని నాకు తెలుసు. కాని అందరి ముందూ తీసుకోదు. ఇంపార్టెంట్ ఫ్రెండ్స్‌తో తీసుకుంటుంది."

"అలాగా! ఎవరోగాని చాలా తెలివిగా ఆమెను హత్యచేసి ఆత్మహత్యగా నిరూపించాలని ప్రయత్నిం

చారు. ఆ డ్రింక్ లోనే స్లీపింగ్స్ పిల్స్ పొడిచేసి కలిపి త్రాగించారు. అందువల్ల ఆమె నిద్రలోనే మరణించింది."

"ఎవడో ఆ దుర్మార్గుడు!"

"మీ కిప్పుడు ఎవరిమీదనైనా అనుమానం కలుగుతోందా?" ప్రశ్నించాడు కృష్ణమూర్తి.

"అర్థం కావడంలేదు" అన్నాడు అరుణాచలం.

"ఆమె క్లోజ్ గా మూవ్ అయ్యే స్నేహితులు తెలుసా మీకు?"

"చాలామందితో అంటే ఆర్టిస్టులతో మూవ్ అవుతూ వుంటుంది. ఇదొక విచిత్రలోకం. ఎవరు ఎవరితో క్లోజ్ గా వుంటున్నారో తెలియదు."

"పోనీ ఆమె చనిపోతే లాభపడేవాళ్ళు ఎవరైనా వున్నారా?"

"ఎవరుంటారు? ఎవరో వారసులు వుండాలి ఆస్థి కోసం...."

"నో.... నా వుద్దేశ్యం అదికాదు. ఆమె వుండడంవల్ల తమకు ఛాన్స్‌లు రావడంలేదని, ఆమె తమకు అడ్డుగా వుందని ఫీలయ్యేవారు...."

"భలేవారు సార్! ఆమె పోయినందున ఒక్కరికీ లాభం కలుగదు. ఎందరో అప్ కమింగ్ ఆర్టిస్టులు లాభం పొందవచ్చు. అలా అడ్డుగా ఫీలై మర్డర్స్ మొదలుపెడితే ఈ పరిశ్రమకు మనుగడే లేదు. అల్లకల్లోలమై పోతుంది. అలా జరిగివుండదని నా వుద్దేశ్యం" అన్నాడు అరుణాచలం.

"పోనీ ఆమె మీద ఎవరికైనా పగ వుందేమో తెలుసా మీకు?"

"నో.... ఆమె మీద పగ వుండాల్సింది ఎవరికి? అందరికీ అనుకూలంగా ప్రవర్తిస్తుంది ఆమె."

"ఆమె భర్త గురించి చెప్పగలరా ఏమైనా?"

"అతను డైవర్సు ఇచ్చాడు గదా! ఆమె ఆస్థి గూడా రాదు అతనికి. మరి ఇంకే లాభం ఆశించి ఇంత దారుణానికి పూనుకుంటాడు?"

కృష్ణమూర్తి తల వూపాడు.

"థాంక్స్ అరుణాచలంగారూ! మీరు ఈ విషయం మనసులో పెట్టుకోండి. ఏదైనా మీకు సమాచారం తెలిస్తే మాకు వుపయోగపడుతుంది అనుకుంటే తెలియ జెయ్యండి. ఇది నా టెలిఫోన్ నెంబర్" అంటూ ఒక కార్డు ఇచ్చాడు కృష్ణమూర్తి.

"అలాగే!" అన్నాడు అరుణాచలం.

కృష్ణమూర్తి సెలవు తీసుకుని బయల్దేరాడు.

# 6

భార్య మరణం గుర్తొచ్చి కాబోలు నందకుమార్ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు.

"సారీ! మిమ్మల్ని బాధ పెట్టినట్లున్నాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి.

నందకుమార్ కళ్ళు తుడుచుకొని "ఫరవాలేదు. ఆమె నా నుంచి దూరమైనా యింకా ప్రేమిస్తూనే వున్నాను" అన్నాడు.

"మీ వివాహం ఎక్కువ కాలం నిలవకపోవడానికి కారణం ఏమిటి? అభ్యంతరం లేకపోతే చెప్పండి" అన్నాడు కృష్ణమూర్తి.

"అభ్యంతరం ఎందుకూ? అందరికీ తెలిసిన విషయమే. ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవు అంటారు. మా విష

యంలో అది నిజమైంది."

"అఫ్‌కోర్స్. నాకు మీ సమస్య అర్థమైందిలెండి...."

"నిజం చెప్పాలంటే కళాకారుల మనస్సులు చాలా సున్నితంగా వుంటాయి. మరొకరితో అడ్జెస్టు కావడం కష్టమని నాకు అనుభవం ద్వారా తెలిసింది. అందుకే ఏ గొడవలూ తలెత్తకముందే ఆమె విడిపోతానని అనగానే అంగీకరించాను."

"ఆమె ఆత్మహత్య చేసుకుందని లోకం నమ్మేటట్లు హత్య జరిగిందని నేను అనుమానిస్తున్నాను. అందుకే ఈ కేసు కావాలని ఇన్వెస్టిగేట్ చేస్తున్నాను."

"మీరు అలా అనుమానించడానికి యేదైనా ఆధారం వుందా?"

"వుంది."

నందకుమార్ ఆసక్తిగా చూశాడు కృష్ణమూర్తిని.

"కాని కాదేమిటో యిప్పుడు బైటపెట్టలేను. మీకు ఆమె ఆత్మహత్య చేసుకొనే వుద్దేశ్యంలో లేదని తెలుసుకొనేందుకు యిది చాలనుకొంటాను" అంటూ టీపాయ్ మీద వున్న ఒక సినీ వారపత్రిక తీసి నందకుమార్‌కి అందించాడు.

"ఆమె చనిపోవడానికి జెస్టు రెండురోజుల క్రితమే అర్జునరాజు అనే సినీ జర్నలిస్టు ఇంటర్వ్యూ చేశారు. ఆ ఇంటర్వ్యూలో ఆమె అభిప్రాయాలు చదవండి. రాబోయే రెండు మూడు సంవత్సరాలలో తను చిత్రనిర్మాణం, దర్శకత్వం చేపట్టాలనుకుంటున్నానని తెలియజేసింది.

సరిగ్గా రెండు రోజులలోనే ఆమె అభిప్రాయాలు

మార్చుకుని జీవితాన్ని అంతం చేసుకోవాలనే నిర్ణయానికి రావడానికి కారణం ఏమిటి? ఏదైనా ఆమె భరించలేనంత ఘోరం జరిగిందా? ఆమె జీవితంలో ఏదైనా పరాజయం అదీ రెండురోజుల్లో పొందిందా? అంటే యేమీ లేదు. ఏమీ జరగలేదు. నేను ఖచ్చితంగా చెప్పగలను ఇది ఆత్మహత్య కాదని."

నందగోపాల్ రెండు చేతులతోను ముఖాన్ని కప్పుకున్నాడు కాసేపు.

"నాకంతా అయోమయంగా వుంది!" అన్నాడు బాధగా.

"నన్నొక సందేహం పీడిస్తోంది. ఆమె మీ నుండి విడిపోయి నాలుగేళ్ళు దాటిపోయాయి కదా! అప్పటికామె మంచి వయస్సులోనే వుంది. మళ్ళీ వివాహం చేసుకోవడానికి ఎందుకు ప్రయత్నించలేదు!"

"ఆమెకొక అనుమానం వుంది మగవాళ్ళ విషయంలో. ఆమె దగ్గరగా రావడానికి ప్రయత్నించే వాళ్ళంతా ఆమెమీద ప్రేమతో కాక డబ్బుకోసం అనుకుంటూ వుంటుంది. అందరూ డబ్బు మనుషులే అని ఆమె అభిప్రాయం. తనను మనస్ఫూర్తిగా ఆరాధించే వాళ్ళు లేరు. ఎవరైనా డబ్బుకోసమే తనను ప్రేమిస్తారు అని నిర్ణయించుకొంది. అందుకే మళ్ళీ పెళ్ళి సంగతి యెత్తలేదేమో?"

"నిజమే కావచ్చు. డబ్బున్న వాళ్ళెవారూ ఆమెను వివాహం చేసుకోవడానికి ప్రయత్నించలేదా?"

"ఆ సంగతి మీరు తెలుసుకోవాలి" పేలవంగా నవ్వాడు నందకుమార్.

7

"ఈ కేసులో సిరిదేవి సెక్రెటరీని అరెస్టు చెయ్యమంటావేమిటి? నాకు అర్థం కావడంలేదు నీ ఉద్దేశ్యం. అతనే చేశాడంటావా?" ప్రశ్నించాడు పోలీస్ కమీషనర్.

"నో....నో....అతను చెయ్యలేదు. కాని చేసిందెవరో అతనికి తెలుసు. పోనీ తెలియకపోయినా చెయ్యడానికి ఎవరికి వీలుందో అతనికి తెలుసు. మనం అనుకున్నంత అమాయకుడు కాదు అతను. అరెస్టుచేసి చూడండి తెలుస్తుంది"! అన్నాడు ఇన్స్పెక్టర్ కృష్ణమూర్తి.

"సరే కానివ్వు!" అంటూ రిసీవర్ ఎత్తి పవన్ కుమార్ని వెంటనే అరెస్టు చేసి తీసుకొని రమ్మని చెప్పాడు.

అరగంట తర్వాత ఫోన్ వచ్చింది. పవన్కుమార్ సిటీలో లేడు. ఎక్కడికి వెళ్ళాడో యింట్లో వాళ్ళకి తెలియదట.

"చూశారా! వాడు ఎస్కేపయ్యాడు."

"ఎంతకాలం? ఇంటికి రాకుండా ఎక్కడికి పోతాడు? ఎప్పుడూ ఇద్దరు కానిస్టేబుల్స్ని మఫ్టీలో వుంచితే సరి దొరక్కపోడు."

"అంతదాకా ఎందుకు? వాడు ఎక్కడికిపోయాడో నాకు తెలుసు?" అన్నాడు కృష్ణమూర్తి.

ఆశ్చర్యంగా చూశాడు కమీషనర్.

"ఇదుగో ఈ ఫొటో చూడండి" అంటూ కార్డుసైజు ఫొటో ఒకటి అందించాడు కృష్ణమూర్తి.

అందులో పదేళ్ళ పాప కాన్వెంట్ డ్రెస్లో

నవ్వుతూ వుంది.

"ఎవరు ఈ పాప?"

"సిరిదేవి కూతురు."

పోలీస్ కమీషనర్ వులిక్కిపడ్డాడు.

"ఈజిట్ కరెక్టు?" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"ఎస్సార్?"

"ఎలా తెలుసుకున్నావు? సిరిదేవి బ్యాంక్ ఖాతాలు చెక్ చేశాను. ప్రతి నెలా ఫస్టు తారీఖున బెంగుళూరులోని లిటిల్ ఫ్లవర్ కాన్వెంట్‌కి వెయ్యి రూపాయలు చెక్ పంపుతూ వుండడం గమనించాను. సిరిదేవి రూమ్‌లో ఆమె డైరీలో దొరికిన ఈ ఫొటో యెవరిదో అర్థమైంది. ఆ ఫొటో వెనుక సంతకం చూడండి. రజని అని వుంది. అంటే ఆ పాప పేరు రజని."

"ఆ పాప సిరిదేవి కూతురే అని యెలా చెప్పగలవు? యెవర్నయినా బంధువుల పిల్లని పెంచుకొంటూ వుందేమో...."

"నేను బెంగుళూరు వెళ్ళి ఇన్వెస్టిగేట్ చేశాను."

"మొత్తానికి అసాధ్యుడవే!...." మెచ్చుకోలుగా అన్నాడు.

"ఆరేళ్ళ క్రితం సిరిదేవి స్వయంగా ఆ పాపను కాన్వెంట్‌లో చేర్పించింది. తనే గార్డియన్ కాలమ్‌లో సంతకం పెట్టింది. ఆ తర్వాత సంవత్సరంనుంచి తల్లి అని సంతకాలు చేస్తూ వచ్చింది."

"అయితే ఆ పిల్ల తండ్రి ఎవరంటావు?"

"నందకుమార్ మాత్రం కాదు."

"మరి ఎవరు?"

"పదేళ్ళ క్రితం ఆ పాప పుట్టింది. అంటే సిరిదేవి

నాటకాలు వేసి పొట్ట పోషించుకుంటూ వుండే రోజుల్లో పుట్టింది. ఆమె తండ్రి యెవరో అంతుబట్టలేదు. ఎవరో ఘరానా పెద్దమనిషిగాని, తోటి నటుడుగాని ఆమెను పెళ్ళి చేసుకుంటానని మోసంచేసి వుండొచ్చు."

తల వూపాడు కమీషనర్.

"నందకుమార్ నుంచి ఏమీ సమాచారం దొరకలేదు. పైగా సిరిదేవిని హత్య చేశారనడానికి ఆధారం యేమిటి అంటాడు."

నవ్వాడు కమీషనర్. "ఆత్మహత్య చేసుకుంటే లెటర్ రాసిపెట్టి వుండేది. తన ఆస్థి యెవరికి చెందాలో విల్లు రాసివుండేది గదా!"

"నేను అదంతా చెప్పలేదు. సమయం వచ్చినప్పుడు బైటపెడతానని చాటవేశాను. నందకుమార్ని అనుమానించడానికి ఆస్కారం లేదా?"

కమీషనర్ నవ్వి "అనుమానితుల జాబితాలో అతన్ని ఎంటర్ చెయ్యి. అసలైన హంతకుడు దొరికే వరకూ అందరూ అనుమానితులే గదా!" అన్నాడు.

తల వూపాడు కృష్ణమూర్తి.

తర్వాత రిసీవర్ యెత్తి ఏదో నెంబర్ డైల్ చేశాడు కృష్ణమూర్తి.

"ఎవరికి?"

"అర్జునరాజు అని జరలిస్టు వున్నాడు. అతనితో మాట్లాడాలి."

"హల్లో...." అన్నాడు అవతల ఎవరో ఫోన్ ఎత్తిన శబ్దం విని.

"ఎవరు కావాలి?"

"అర్జునరాజు."

"ప్లీజ్ బీ ఆన్ ది లైన్."

కాసేపటికి అర్జునరాజు గొంతు వినిపించింది.

"హల్లో మిష్టర్ అర్జునరాజు! నేను కృష్ణమూర్తిని మాట్లాడుతున్నాను."

"ప్రొడక్షన్ కృష్ణమూర్తా?"

"కాదు భాయ్! ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తిని."

"ఆఁ.....గుర్తొచ్చారు. ఎనీ న్యూస్."

"దాన్ని గురించి కాదు. ఒక ముఖ్యమైన సమాచారం కావాలి. సిరిదేవి పర్సనల్."

"అడగండి."

"ఆమె ఎవర్నయినా పెళ్ళి చేసుకోబోతున్నదని గాసిప్ న్యూస్ ఏదైనా వచ్చిందా ఫీల్డులో!"

"జ్యోతికుమార్ అని ఈ మధ్య కొత్త హీరో వచ్చాడు. అతనితో యెక్కువగా మూవ్ అవుతుందనీ, బహుశా అతన్ని పెళ్ళి చేసుకోవచ్చనీ 'మంట' అనే పత్రికలో గాసిప్ వార్తల్లో వుంది. కాని ఆమెను నేనీ విషయం ఇంటర్వ్యూలో అడగలేదు."

"ఏం?"

"ఇటువంటివి వాళ్ళు చెప్తేనే అథారిటీగా వుంటుంది. గాసిప్ వార్తలు విని అడిగితే బాధపడొచ్చు. అందుకని నేను ఇటువంటివి పట్టించుకోను. అవునూ! ఎందుకు ఇవన్నీ అడుగుతున్నారు?"

"ఊరికినే!" అని నవ్వి "ఉంటాను భాయ్!" ఫోన్ పెట్టేశాడు.

"సార్! నేను అనుమానించినట్లే జరిగింది. సిరిదేవి, జ్యోతికుమార్ అనే హీరోని పెళ్ళి చేసుకోవచ్చునని

'మంట' అనే పత్రిక రాసిందట" అన్నాడు కృష్ణమూర్తి.

తల వూపాడు కమీషనర్.

"పవన్‌కుమార్ కోసం మనం వెంటనే ప్రయత్నించాలి."

"ఎస్. అన్ని స్టేషన్స్‌కీ రేడియో మెసేజెస్ పంపించాలి. ఎక్కడున్నా అరెస్టుచేసి సిటీకి పంపించమని అర్డర్స్ పంపుతాను."

"అలాగే సార్!" అని సెల్యూట్ చేసి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

## 8

"సార్! మిమ్మల్ని కలుసుకోవడానికి సెంట్రల్ సిటీ ఎమ్మెల్యే మునిరత్నంగారు వచ్చారు" అన్నాడు జవాను పోలీస్ కమీషనర్‌తో.

"రమ్మను."

మునిరత్నం ఎమ్మెల్యే ఛాంబర్‌లోకి వచ్చాడు. పరస్పర గౌరవాభివందనాలు అయ్యాయి.

"ఏమిటి యిలా వచ్చారు? మీరు వచ్చారంటే యేదో విశేషమే వుంటుంది" నవ్వాడు కమీషనర్.

"మామూలే. మా వీధిలోనే వుంటున్నాడు కుర్రాడు పవన్‌కుమార్ అని, అతన్ని సినీస్టార్ మర్డర్ కేసులో అరెస్టు చేశారట కదా!"

"అవును."

"పాపం అతను అమాయకుడు. అతని భార్య, మామగారు వచ్చి నా దగ్గర ఏడుస్తున్నారు—ఎలాగైనా వదిలించమని."

"మేము కేస్ పెట్టబోతున్నాము అతని మీద. మీరు

కోర్టులో బెయిల్ తీసుకోవాల్సిందే."

"అంతమాట అనకండి. అతను నిరపరాధి."

"అలా చెప్పకండి. అతను కేసులో యిన్వాల్వ్ అయ్యాడు. మా యిన్వెస్టిగేషన్‌లో ఆధారాలు దొరికాయి."

"భలేవారే మీరు. అతనికి లాభం ఏమిటి ఆ సినీస్టార్‌ని చంపితే?"

"ఆ సంగతి మాకు తెలుసు. కొన్ని లక్షల బ్లాక్ మనీ ఆమె ఎక్కడో దాచింది. ఆ రహస్యం అతనికి తెలుసు. అందుకే తెలివిగా మర్డర్ చేశాడు. కొంతకాలానికి ఆ డబ్బంతా అతనికి దక్కుతుంది."

మునిరత్నం తల పట్టుకున్నాడు.

"ఏమో! మీరు యిలా చెప్తారు. వాళ్ళేమో వుద్యోగం పోయి మేము యేడుస్తుంటే మా మీద కేసులు పెట్టి పోలీసులు హింసపెడుతున్నారని గొడవ చేస్తున్నారు."

"ఎవరి గొడవ వాళ్ళది" నవ్వాడు కమీషనర్.

"ఇంతకీ అతన్ని విడిచే మార్గం లేదా?"

"చెప్పానుగా. కోర్టులోనే."

"ఏదైనా ఆలోచించండి. మీరు తల్చుకుంటే వాళ్ళకి సహాయం చెయ్యగలరు."

"హంతకులకు ఎవరు సహాయం చేస్తారు చెప్పండి?"

"అతను హంతకుడని మీరు ఎలా రుజువు చేస్తారు చెప్పండి."

"మీరు భలేవారే. మాకుండే ఆధారాలు మాకున్నాయి. అవన్నీ కోర్టులో చూపిస్తాను. మీరు ప్లీడర్ని పెట్టుకోమని వాళ్ళకి చెప్పండి."

"ప్లీడర్ని పెట్టుకోక తప్పదనుకోండి."

"మీరు ఏమీ అనుకోకపోతే ఒక ప్రశ్న?"

మునిరత్నం నవ్వి "అయ్యో అడగండి" అన్నాడు.

"ఈ కేసులో మీకు ఇంట్రెస్టు ఏమిటి?"

"అయ్యో! నా కేమి ఇంట్రెస్టు? వాళ్ళు మా వీధిలో వాళ్ళు. వచ్చి కాళ్ళమీద పడి ఏడుస్తుంటే మంచీ చెడ్డా కనుక్కుందామని వచ్చాను. అంతే. మీకు వీలుంటే సహాయం చెయ్యండి. లేదా? లేదు...." కొంచెం నిష్ఠూరంగానే అన్నాడు మునిరత్నం.

"నిరపరాధి అయితే తప్పకుండా సహాయం చేస్తాను...."

"థాంక్స్!" అని వెళ్ళిపోయాడు మునిరత్నం.

ఎమ్మెల్యే వెళ్ళిన కాసేపటికి వచ్చాడు యిన్స్పెక్టర్ కృష్ణమూర్తి.

"ఎమ్మెల్యే వచ్చి వెళ్ళాడు చూశావుగా! మునిరత్నం అని సెంట్రల్ సిటీ ఎమ్మెల్యే!"

"ఆఁ....కారులో ఎక్కుతుంటే చూశాను సార్! పవన్కుమార్ గురించేగా!"

"ఆఁ....కోర్టులో బెయిల్ తీసుకోమని చెప్పాను. నిష్ఠూరంగా మాట్లాడి పోయాడు."

"ఇది ఇంతటితో ఆగదు. ఏ మినిష్టరో ఫోన్ చేస్తాడు చూడండి."

"అది మామూలేగా. తన లెవల్లో కాకపోతే మినిష్టర్స్ పలుకుబడి వుపయోగిస్తారు."

## 9

పోలీస్ కమీషనర్ ఆఫీసులో ఫోన్ రింగయింది.

"హల్లో.... నేను అరుణాచలాన్ని మాట్లాడుతు

న్నాను."

"ఎవరు కావాలి మీకు?"

"ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి."

కృష్ణమూర్తి ఫోన్ అందుకున్నాడు.

"హల్లో! ప్రొడ్యూసర్ గారూ బాగున్నారా?"

"ఏం బాగో లెండి. చావు తప్పి కన్ను లొట్టపోయి నట్లుంది మా పరిస్థితి."

"ఏమిటి విశేషం?"

"విశేషమే. సిరిదేవి గురించి ఒక విషయం తెలిసింది. మీకు చెప్పాలని ఫోన్ చేశాను."

"వెరీగుడ్! చెప్పండి."

"ఆ రోజు. అదే ఆమె లాస్టు షూటింగ్ పూర్తి చేసి కారు డ్రైవ్ చేసుకొంటూ వెళ్ళిపోయిందని చెప్పాను చూశారా?"

"ఎస్."

"ఆ రోజు సాయంకాలం బీచ్‌కి వెళ్ళిందట."

"ఎవరు చెప్పారు మీకు?"

"మురళి అని మా ప్రొడక్షన్‌లో అసిస్టెంట్. ఆ రోజు చీకటిపడ్డాక అతను యెవరో ఫ్రెండ్‌తో బీచ్‌కి వెళ్ళాడట. జనం యెవరూ లేని చోట........అంటే సరివి గుబుర్లలో సిరిదేవి యెవరో మరొకరితో కూర్చుని వుందట."

"వెరీగుడ్! మురళిని ఒకసారి మా ఆఫీసుకి పంపుతారా ప్లీజ్!"

"తప్పకుండా! ఆటోలో పంపుతాను. ఎర్ర చారల షర్టు వేసుకుని వున్నాడు మురళి. పొట్టిగా, ఎర్రగా వుంటాడు. మీ ఆఫీసు ముందు దిగగానే గుర్తు

పట్టొచ్చు."

"థాంక్స్!"

రిసీవర్ పెట్టేసి కూర్చున్నాడు కృష్ణమూర్తి.

అరగంట తర్వాత వచ్చాడు మురళి.

అతను కుర్రాడే. పాతికేళ్ళ లోపు వుంటాయి.

జవాన్ తీసుకొచ్చి కృష్ణమూర్తిని చూపించాడు. అతను వస్తూనే నమస్కారం చేశాడు.

"నీ పేరేనా మురళి?"

"అవును సార్!"

"ఎక్కడ పని చేస్తున్నావు?"

"అరుణాచలం క్రియేటర్స్‌లో ప్రొడక్షన్ అసిస్టెంట్‌గా వున్నాను ప్రస్తుతం."

"ఇప్పుడు చెప్పు. సిరిదేవిని బీచ్‌లో చూసింది గురువారం సాయంకాలమేనా?"

"అవును సార్!"

"ఎలా గుర్తుంది నీకు?"

"బాగా గుర్తుసార్! షూటింగ్ అయిపోయాక ఇంటికెళ్ళాను సార్! మా ప్రక్కింటి అమ్మాయి విమల బీచ్‌కి వెళ్దామని అడిగింది. సరేనని బయల్దేరాను."

"విమల ఎవరు? నీ గర్ల్ ఫ్రెండా?"

"అవును సార్! ఆ రోజు వాళ్ళన్నకి నైట్ డ్యూటీ. ఆరింటికే భోజనం చేసి వెళ్ళిపోయాడు. సినిమాకి వెళ్తున్నానని వాళ్ళ వదినకి చెప్పి నాతో షికారుకి వచ్చింది."

"అది మామూలే నన్నమాట...." నవ్వాడు కృష్ణమూర్తి.

మురళి సిగ్గుపడ్డాడు.

"ఆఁ.... చెప్పు."

"బీచ్‌లో చాలా దూరం నడిచి వెళ్ళాం సార్! ఆ రోజు వెన్నెల. ఒక పొదచాటున సిరిదేవిని గుర్తు పట్టాను సార్!"

"ఆమెతో పాటు వున్న ఆతను ఎవరు?"

"ఎవరో సార్! నే నెప్పుడూ చూళ్ళేదు."

"ఎలా వున్నాడు?"

"కొంచెం లావుగానే వున్నాడు సార్."

"ఊఁ...."

"మీసాలు వున్నాయి."

"పెద్దవా? చిన్నవా?"

"చిన్నవే సార్!"

"ఊఁ...."

"బ్లాక్ ఫ్రేమ్ కళ్ళద్దాలు వున్నాయి సార్!"

"కూలింగ్ గ్లాసెస్."

"కాదు సార్, తెల్లగానే వున్నాయి."

"ఊఁ....తర్వాత."

"అతనికి ఎంత వుంటుంది వయస్సు?"

"ముప్పై ఏళ్ళు వుండొచ్చు సార్."

"అతన్ని గుర్తుపట్టడానికి మొండి గుర్తు యేమిటో చెప్పు?"

మురళి తల గోక్కున్నాడు.

"వెన్నెల్లో చూశాను సార్! మొండి గుర్తులు చెప్ప లేను."

"పోనీ అతన్ని మళ్ళీ చూస్తే గుర్తుపట్టగలవా?"

"తప్పకుండా గుర్తుపడతాను సార్!"

"ఊఁ....తర్వాత. వాళ్ళముందు సీసాలు గ్లాసులు

వంటివి ఏవైనా వున్నాయా?"

"వాళ్ళు ఎర్రటి దుప్పటిమీద కూర్చున్నారు సార్! ప్లాస్టిక్ బుట్ట వున్నట్టు గుర్తు సార్! నేను అవన్నీ గమనించలేదు" అన్నాడు మురళి.

మురళి స్టేట్‌మెంట్ రికార్డు చేశాడు ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి.

## 10

సిరిదేవి భవనం పూర్తిగా సోదా చెయ్యడం జరిగింది. మెటల్ డిటెక్టర్‌తో మొత్తం గోడలన్నీ చూశారు, ఏదైనా రహస్యమైన లాకర్ వుందేమోనని. ఎక్కడా యేమీ దొరకలేదు.

కాని ఆమె ఐరన్ సేఫ్‌లో ఒక ప్రముఖ బ్యాంక్ సేఫ్ లాకర్ కీ దొరికింది. బ్యాంక్ వాళ్ళు అది తమ లాకరే అని చెప్పారు. లాకర్ నెంబర్ తెలుసుకొని తెరిచారు.

అందులో డబ్బుగాని, బంగారంగాని దొరకలేదు.

ఒక ఫైల్ దొరికింది.

అందులో చక్రవర్తి సిరిదేవికి రాసిన ప్రేమలేఖలు వున్నాయి. ఇద్దరూ కలిసి దిగిన ఫోటో కూడా వుంది. అందులో సిరిదేవి చాలా సన్నగా వుంది. నాటకాలు వేసే రోజుల్లోది.

ఆ లెటర్సన్నీ చదివితే తేలిన విషయం యేమిటంటే చక్రవర్తి గోపాలపురం జమీందారు కొడుకు. టౌన్‌లో ఒంటరిగా వున్న సిరిదేవిని ప్రేమించాడు. పెళ్ళి చేసుకుంటానని నమ్మించి శారీరక సంబంధం పెట్టుకున్నాడు. ఫలితంగా ఆమె గర్భవతి అయ్యింది. చక్రవర్తి ఆమెకు కనిపించకుండా వెళ్ళిపోయాడు.

సిరిదేవి తన స్నేహితురాలు నర్స్ అయిన శాంతాదేవి యింట్లో రహస్యంగా కొన్నాళ్ళు వుంది. అక్కడే ఆడ పిల్లని కన్నది.

ఆ తర్వాత ఆమె సినిమా రంగంలో ప్రవేశించింది. గ్లామర్ పెరిగి ప్రముఖ నటి కావాలంటే తన గత చరిత్ర రహస్యంగా వుండాలని భావించి కూతుర్ని బెంగుళూరులో కాన్వెంట్ స్కూల్లో జేర్పించింది.

కొన్నాళ్ళకి నందకుమార్‌తో ఆమెకు పెళ్ళయింది.

తర్వాత చక్రవర్తి మళ్ళీ ఆమెకు తారసపడ్డాడు. సంఘంలో గొప్ప స్టేజీలో వున్నాడు అతను. సిటీలో పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు వున్నాయి అతనికి. అతని తండ్రి కాబినెట్ మంత్రివర్గంలో సభ్యుడు.

తను ఆమెను మోసం చెయ్యలేదనీ, అనుకోకుండా తండ్రి విదేశాలకు పంపడంవల్ల వెళ్ళిపోయాననీ, తిరిగి వచ్చాక ఆమె కనిపించలేదనీ చెప్పి నమ్మించాడు.

తిరిగి అతన్ని ప్రేమించసాగింది సిరిదేవి. చక్రవర్తి భార్యకు పిల్లలు లేరు. అందుకే ఆమెకు విడాకులు ఇచ్చి సిరిదేవిని పెళ్ళి చేసుకుంటానని చక్రవర్తి నాటకం ఆడుతున్నాడు.

చక్రవర్తి తనను పెళ్ళిచేసుకుంటాడని ఆమె మొదట్లో నమ్మింది. కాని తర్వాత అనుమానపడింది. అతను ఎప్పుడో రాసిన లౌ లెటర్స్ తనవద్ద వున్నాయనీ, ఒక నెలలోపల తనని పెళ్లి చేసుకోకపోతే అతని పరువు తీస్తాననీ, తద్వారా దేశంలో నాయకుడిగా వున్న అతని తండ్రి పరువు ప్రతిష్టలు మట్టిపాలౌతాయనీ బెదిరించింది.

అందుకే చక్రవర్తి ఆమెకు విస్కీ త్రాగించి స్లీపింగ్

పిల్స్ పొడిచేసి అందులో కలిపాడు. అది ఆమె గమ నించలేదు.

ప్రొడక్షన్ అసిస్టెంట్ మురళి తను ఆ రోజు బీచ్‌లో చూసింది చక్రవర్తేనని నిజం చెప్పాడు.

సిరిదేవి తనను బెదిరించడంవల్ల గత్యంతరంలేక తనే ఆమెకు విస్కీలో స్లీపింగ్ పిల్స్ పొడి చేసి యిచ్చాననీ చక్రవర్తి ఒప్పుకున్నాడు.

బెంగుళూరు కాన్వెంట్‌లో చదువుతున్న రజని తనకి సిరిదేవికి పుట్టినబిడ్డ అని స్టేట్‌మెంట్ ఇచ్చాడు.

దేశంలో పత్రికలకు తాజావార్తగా సిరిదేవి హత్య కేసు ఆ విధంగా మలుపు తిరిగి, కోర్టులో ఫైల్ చేయ బడింది.

—:ఐపోయింది:—

# రెండు శవాలు

ప్రతాప రవిశంకర్

రోలర్ బాల్—సినిమా జరుగుతోంది....థియేటర్ రంతా పూర్తిగా మనుషులతో నిండిపోయి వుంది. రెండు రోజుల క్రితమే ఆ ఇంగ్లీషు సినిమా రిలీజయియింది.

బాల్కనీలో వెనుకవరుసలో కూర్చున్నారు సుమిత్ర-రాఘవ.

ఇద్దరూ చిన్నగా మాట్లాడుకుంటున్నారు....యెవ్వరూ వాళ్ళను గమనించటంలేదు. అంతా సినిమా చూడటంలో లీనమయి వున్నారు.

"ఇంకో రెండురోజులు వుండకూడదా?" చిన్నగా అన్నాడు రాఘవ.

"రెండురోజులా! ఇప్పటికి నే నొచ్చి పది రోజులయింది. వారం రోజులలో నే తిరిగి వస్తానని ఆయనతో చెప్పాను. ఆయన వొప్పుకోలేదు. అమ్మనీ, చెల్లెళ్ళను చూడాలని వుందని చెప్పి వచ్చాను. నిజానికి నేను యీ వూరు వచ్చింది రెండు నెలల క్రితమే కదా! మళ్ళీ

యిప్పుడు ఆయన పంపించటానికి వొప్పుకొంటా డనుకో లేదు.

ఎట్లాగో వారం రోజుల్లో నే తిరిగొస్తానని వచ్చాను.... యిక ఈ రోజయినా బయల్దేరకపోతే బావుండదు. అంతే కాకుండా ఈ రోజు రాత్రి ఎక్స్‌ప్రెస్‌కు బయల్దేరి వస్తు న్నట్టుగా ఆయనకు ఉత్తరం రాశాను. నేను రాకపోతే ఆయన యిక్కడకు రావొచ్చు....ప్లీజ్! నన్నాపకు రాఘవా...." అన్నది సుమిత్ర.

"మళ్ళీ ఎప్పుడు రావటం?" దిగులుగా అడిగాడు రాఘవ.

"ఎందుకంత దిగులు? నాకు మాత్రం వెళ్ళాలని వుందా? కాని తప్పదు. పెళ్ళయినదాన్ని....మళ్ళీ ఓ నెల రోజుల్లో ఏదో ఒక ప్లాను వేసి వచ్చేస్తానుగా. ఇంతకు ముందులా నువ్వు నేను వెళ్ళగానే ఉత్తరం రాయకు.... నిజంగా అప్పుడు అదృష్టమే. ఆయన ఆ ఉత్తరాన్ని చదవలేదు. నాకే ఇచ్చేశాడు. సాధారణంగా నా పేరున వచ్చిన ఉత్తరాలను ఆయన చదవడు."

"మంచి మొగుడు" నవ్వాడు అతను.

"అవును. అందుకే మనం ఇప్పటికీ సుఖపడగలుగు తున్నాం...." అన్నది ఆమె.

"నీ మొగుడి మంచితనం పదికాలాలపాటు ఇలాగే వర్ధిల్లాలని కోరుకుందాం" అన్నాడు చిన్నగా సుమిత్ర చేతిని నొక్కి.

నవ్వింది ఆమె.

"స్టేషన్‌కు వచ్చేదా?" అడిగాడు.

"వద్దు. ఎవరయినా చూస్తే ప్రమాదం. ఇప్పటివరకూ మన వ్యవహారం ఎవ్వరికీ తెలీదు. ఎందుకు అనవసరంగా

దీన్ని బయటకు లాగటం? నువ్వు రావద్దు బాబూ. నేను వెళతానుగా."

"నీ యిష్టం...." అన్నాడు చేతిని ఆమె భుజంమీద వేసి.

తర్వాత తన మొహాన్ని ఆమె బుగ్గ దగ్గరగా తీసుకొచ్చాడు రాఘవ. అతని వూపిరి ఆమెకు వేడిగా తగిలి ఒళ్ళు జలదరించింది. తర్వాత అతను చిన్నగా ఆమె బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు.

సుమిత్ర హాయితో కళ్ళు మూసుకుంది.

రాఘవ ఆమెవైపు చూసి చిలిపిగా నవ్వాడు.

"యూ సిల్లీ...." అన్నది చిన్నగా.

మరోసారి నవ్వాడు.

"టైమెంతయ్యింది?" అడిగింది.

"ఐదుగంటలు కావస్తోంది."

"సినిమా అయిపోవస్తుందనుకుంటాను."

"అవును."

"అయితే సినిమా వదలకముందే వెళ్ళిపోదాం."

తల వూపాడు. రాఘవ.

"ముందు నేను వెళతాను. తర్వాత నువ్వు వచ్చేయ్" అన్నది.

రాఘవ సరేనన్నాడు.

లేచి నిలబడింది సుమిత్ర.

సినిమా క్లయిమాక్స్‌లోకి వచ్చింది. రోలర్ బాల్ ప్లేలో అందరూ అవుటయ్యారు. ఇక ఇద్దరే మిగిలారు. ఇద్దరికీ బాగా దెబ్బలు తగిలాయి. ఆయాసంతో రొప్పుతున్నారు.

గబగబా చీకట్లో కుర్చీలమధ్యనించి బయటకు వచ్చింది

సుమిత్ర.

చలి కాలం కావటంవల్ల అప్పటికే పొద్దు వాలి పోతోంది.

సుమిత్ర బయటకు వచ్చిన రెండు నిముషాల తర్వాత రాఘవ కూడా బయటకు వచ్చాడు.

అతనే రిక్షా మాట్లాడాడు. ఎక్కింది ఆమె.

"గుడ్ బై డియర్" చిన్నగా నవ్వుతూ అన్నాడు రాఘవ.

"గుడ్ బై" అన్నది సుమిత్ర ప్రేమగా. రిక్షా ముందుకు పరుగుదీసింది.

## 2

సూట్కేసులో బట్టలు సర్దుకుంది సుమిత్ర. అప్పటికి టైము ఎనిమిది గంటలు కావస్తోంది రాత్రి....

"అన్నీ సర్దుకున్నావో లేదో చూసుకోవే అమ్మాయ్. తర్వాత మీ వూరు వెళ్ళి ఉత్తరం రాస్తావ్ ఏ జాకెట్టో, చీరో మర్చిపోయా నంటూ...." అన్నది సుమిత్ర తల్లి.

"ఏమీ మరచిపోలేదులే. అన్నీ సర్దుకున్నాను" అన్నది సుమిత్ర.

"మళ్ళీ ఎప్పుడే అక్కయ్యా ఈ వూరొచ్చేది?" అడిగింది సుమిత్ర మొదటి చెల్లెలు వసంత.

"నీ పెళ్లికే" నవ్వుతూ అన్నదామె.

వసంత సిగ్గుపడి "అయితే ఇంకో ఏడాదివరకూ రావన్న మాట" అన్నది.

"అంతే అనుకో."

"బావగార్ని అడిగానని చెప్పు...." అన్నది రెండో చెల్లెలు అరుంధతి.

"అడిగానని చెప్పటమేనా? ఇంకేవయినా సందేశాలు అందజేయమంటావా?" నవ్వుతూ అడిగింది.

"సందేశాలు అందజేస్తే నువ్వు సహించగలవా?"

"ఆ....నిరభ్యంతరంగా సహించగలను...." జడను అల్లుకుంటూ అన్నది.

"అయితే బావగారికి నా ముద్దులని చెప్పు."

"ఓసి పక్షీ....ఏమో అనుకున్నాను. నువ్వూ పెద్దదానివయిపోయావు" అన్నది నవ్వి.

అరుంధతి కూడా నవ్వి "నీకు టైమయిపోతోంది" అన్నది.

తర్వాత ఐదు నిముషాలకు సుమిత్ర సూట్కేసు తీసుకుని ఇంట్లోనించి బయటపడింది.

"జాగ్రత్త అమ్మాయ్. వెళ్ళగానే ఉత్తరం రాసి పడేయ్. అసలే రాత్రి ప్రయాణం. జాగ్రత్త. అందునా ఒక్కదానివే వెళుతున్నావ్" అన్నది తల్లి.

"ఏం భయం లేదులే....పెళ్ళి అవకముందే ఒంటరిగా ప్రయాణాలు చేశాను. వెళతాను...." అని ముందుకు కదిలింది.

చెల్లెళ్ళు స్టేషనుకు వస్తామన్నారు. వద్దన్నది సుమిత్ర. ఆమెకు తను వద్దని చెప్పినా రాఘవ స్టేషన్కు వస్తాడేమోననే అనుమానం వుంది. అందుకే వాళ్ళను స్టేషన్కు రావద్దన్నది.

మెయిన్ రోడ్డుమీదకు వచ్చిన తర్వాత సుమిత్ర రిక్షా బేరం చేసుకుని ఎక్కింది.

పావుగంట తర్వాత రిక్షా రైలుస్టేషన్ ముందు ఆగింది.

దిగి రిక్షావాడికి డబ్బులిచ్చి సూట్కేసుతో లోపలకు

నడిచింది.

బుకింగ్ కౌంటర్ దగ్గర అంతగా మనుషులు లేరు. ఇద్దరు మగవాళ్ళు టిక్కెట్లు తీసుకుంటున్నారు.

టిక్కెట్టు తీసుకుని ప్లాట్ ఫారం మీదకు వెళ్ళింది సుమిత్ర. అప్పటికే రైలు వచ్చి వుంది. ఇంకో పావు గంటలో బయల్దేరుతుంది.

జనరల్ కంపార్టుమెంటు దగ్గరకు వెళ్ళింది ఆమె. లోపలకు ఎక్కలేదు. బయట నిలబడి ప్లాట్ ఫారమంతా కలియజూసింది. ఎక్కడా ఆమెకు రాఘవ కనిపించలేదు. అతను కనిపించనందుకు సుమిత్రకు యెంతో బాధ కలిగింది. తను వద్దని చెప్పినా అతను వస్తాడనుకుంది. అందుకే చెల్లెళ్ళను తనతో స్టేషన్ కు తీసుకురాలేదు.

కంపార్టుమెంటులోకి యెక్కింది. దాన్లో ఎక్కువగా జనం లేరు. చలికాలం కావటంవల్ల నేమో రద్దీ తక్కువగా వుంది. ఆ కంపార్టుమెంటులో ఐదుగురు మగవాళ్ళు ముగ్గురు ఆడవాళ్ళు వున్నారు.

కిటికీ పక్కనే కూర్చుంది సుమిత్ర.

పది నిముషాల తర్వాత చిన్న కుదుపుతో ముందుకు కదిలింది రైలు.

"మళ్ళీ ఎప్పుడో ఈ వూరు రావటం" అనుకుంది సుమిత్ర.

రైలు వెళుతూంటే కిటికీలోనించి ప్లాట్ ఫారం మీద నించున్న మనుషులను చూస్తోంది. అందర్నీ దాటిపోయింది రైలు.

రైలు వేగం పెరిగింది. చలిగాలి రివ్వున కొట్టింది. పమిటను ఒంటినిండా కప్పుకుంది సుమిత్ర. ఈ టైములో రాఘవ వుంటే ఎంత బావుండేది పక్కనే అనుకుంది.

రైలు పరుగుదీస్తోంది చీకటిని చీల్చుకుంటూ. సుమిత్ర కళ్ళు మూసుకుంది ఆలోచిస్తూ.

# 3

మరో అయిదు నిముషాల్లో ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్ ప్లాట్ ఫాం మీదకు వస్తుందని చెప్పాడు బుకింగ్ క్లర్కు సూర్యారావు టిక్కెట్ తీసుకుంటున్నప్పుడు.

టికెట్ తీసుకుని అక్కడినించి ప్లాట్ ఫాం మీదకు వచ్చాడు అతను. ప్లాట్ ఫాం మీద జనం పలుచగా వున్నారు.

వాచీ చూసుకున్నాడు సూర్యారావు. ఒకటీ ఇరవై అయింది.

జేబులోనించి సిగరెట్ పెట్టె బయటకు తీసి ఓ సిగరెట్ వెలిగించాడు.

చలి అతన్ని చిన్నగా వణికించేస్తోంది.

గట్టిగా పొగను పీల్చాడు. గుండెలో వెచ్చగా వున్నట్లనిపించింది.

సిగ్నల్ వొంగింది.

ఓసారి ప్లాట్ ఫాం చివరివరకూ వెళ్ళాడు సూర్యారావు. తిరిగి వస్తుండగా రైలు వస్తున్న చప్పుడు వినిపించింది.

చేతిలో చివరివరకూ కాలిన సిగరెట్టును రైలు పట్టాల మీదకు విసిరేశాడు.

రైలు సిగ్నల్‌ను దాటి ప్లాట్ ఫాం మీదకు వచ్చింది. కీచుమంటూ ఆగింది.

గబ గబా జనరల్ కంపార్టుమెంటు దగ్గరకు నడుస్తున్నాడు సూర్యారావు. ఆ తొందరలో అతను ఓ మనిషికి డాష్ ఇచ్చాడు. అతను తలెత్తి సూర్యారావును చూసి

"నువ్వా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"సారీ" అన్నాడు సూర్యారావు గబుక్కున ముందుకు వెళుతూ అతన్ని పట్టించుకోకుండా.

అతను ఓసారి సూర్యారావును చూసి గబ గబా రిజర్వేషన్ కంపార్టుమెంటు దగ్గరకు వెళ్ళాడు.

సూర్యారావుకు కిటికీ వారగా కూర్చుని నిద్రపోతున్న సుమిత్ర కన్పించింది.

తృప్తిగా నవ్వుకున్నాడు....ఓసారి బయట నిలబడే కంపార్టుమెంటునంతా పరిశీలనగా చూశాడు. సుమిత్ర తప్పించి ఆ కంపార్టుమెంటులో ఎవ్వరూ లేరు.

రైలు కదిలింది.

ఎవరయినా ఆ కంపార్టుమెంటులో ఎక్కుతారేమోనని చూశాడు. ఎవ్వరూ ఎక్కలేదు. రైలు వేగం అందుకోక ముందే గబుక్కున ఆ కంపార్టుమెంటులోకి ఎక్కి వెళ్ళి సుమిత్ర ఎదురుగా కూర్చున్నాడు.

సుమిత్ర ఇంకా నిద్రపోతూనే వుంది. తెరచి వున్న తలుపులోనుంచి లోపలకు వీస్తున్న గాలికి ఆమె ముంగురులు చిన్నగా కదులుతున్నాయి.

"పాపం....ఈ పది రాత్రులనించీ నిద్రలేదేమో" అనుకున్నాడు సూర్యారావు.

సిగరెట్‌ను బయటకు తీసి ఓ సిగరెట్ ముట్టించాడు.

సుమిత్ర మొహాన్ని చూస్తూ సిగరెట్ కాలుస్తున్నాడతను.

## 4

కళ్ళు తెరిచింది సుమిత్ర.

ఎదురుగా కూర్చుని సిగరెట్ కాలుస్తున్న సూర్యారావుని చూసి అదిరిపడింది.

కళ్ళు నులుముకుని మళ్ళీ చూసింది....

"ఏమిటి సుమీ....అంత ఆశ్చర్యపోతున్నావ్? నేనే నీ ప్రియమైన భర్త....సూర్యారావుని" అన్నాడు అతను నవ్వుతూ.

"మీరేనా?" అన్నది సుమిత్ర ఇంకా ఆశ్చర్యంనించి తేరుకోలేక.

"అనుమానంగా వుందా?" అని ఆమె బుగ్గమీద వేలితో సున్నితంగా కొట్టాడు అతను.

"నాకు అంతా కలగా వుంది. మీరు నా ఎదురుగా ఎలా ప్రత్యక్షం కాగలిగారు?"

"ఇక్కడే ఇంతకుముందు ఆగిన స్టేషన్‌లో ఎక్కాను."

"ఈ స్టేషనుకు ఎందుకొచ్చారు? ఎప్పుడొచ్చారు?"

"రాత్రి పది గంటలకు వచ్చాను. ఓ ఫ్రెండు వూరు వస్తూ నన్ను కూడా రమ్మన్నాడు. నువ్వు ఈ ట్రెయినుకే వస్తున్నట్టు వుత్తరం రాశావు కదా! అందుకని అతనితో వచ్చి ఈ స్టేషన్‌నించి నీతో కలిసి వెచ్చగా ప్రయాణం చేద్దామని వచ్చాను" అన్నాడు సూర్యారావు సిగరెట్‌ను కింద పడేసి బూటు కాలితో నలిపి.

"పది రోజులకే అంత విరహం భరించలేక పోయారా?"

"అవును....పది రోజులంటే మాటలా? రెండువందల నలభై గంటలు. నువ్వు ఎలా వుండగలిగావో నాకు ఆశ్చర్యంగా వుంది."

"నేనూ వుండలేకనే ఈ ట్రెయిన్‌కు బయల్దేరింది. మా అమ్మ, చెల్లెళ్ళు ఇంకో నాలుగు రోజులు వుండమని బలవంతం చేశారు" అన్నది ఆమె.

"అలాగా?" అన్నాడతను.

"ఈ కంపార్టుమెంటులో కొత్తగా ఎవరయినా కొత్తగా ఎక్కారా?" అడిగింది సుమిత్ర.

"అవును.... నేనే."

నవ్విందామె.

"ఇప్పుడప్పుడే స్టేషన్ రాదు" అన్నాడతను నవ్వుతూ.

"అయితే ఏమంటారు?" అన్నది చిలిపిగా సూర్యారావు కళ్ళల్లోకి చూస్తూ.

"ఆ మాత్రం తెలీదా?"

తల వంచుకుంది సుమిత్ర సిగ్గుతో. వాళ్ళిద్దరికి పెళ్ళయి మూడేళ్ళయింది.

"రైలు వేగం తగ్గినట్టుంది" అన్నాడు సూర్యారావు లేచి నిలబడి.

"ఏమో నాకు తెలీటం లేదు" అన్నది సుమిత్ర.

"ఉండు....ఏదయినా ట్రాక్ రిపేరు జరుగుతుందేమో చూస్తాను" అని డోర్ దగ్గరకు వెళ్ళి దాన్ని వెనక్కు లాగి బయటకు చూశాడు.

రైలు రివ్వున దూసుకుపోతోంది. గాలికి అతని జుట్టు చిందరవందర అయింది.

"ఏయ్....సుమీ ఇలా రా....రైలు మలుపు తిరుగుతూ ఎలా కనిపిస్తుందో చూడు" అన్నాడు సూర్యారావు బయటకు చూస్తూ.

"మీకు అర్ధరాత్రి ఇదేం సరదా అండీ బాబూ" అంటూ డోర్ దగ్గరకు వచ్చి తల బయటకు పెట్టి ముందుకి చూసింది సుమిత్ర.

రైలు వంపు తిరుగుతోంది....

బయట అంతా చీకటిగా వుంది. నిశ్శబ్దంగా వుంది.

రైలు కంపార్టుమెంట్లలోని దీపాల వెలుతురు

మూసివున్న అద్దాల్లో నించి మసగ్గా బయటకు పడు తోంది.

"బావుంది కదూ?" అన్నాడు సూర్యారావు.

"అవును" అన్నది సుమిత్ర.

రైలు పెద్ద కాలువ మీదనించి వెళుతోంది చప్పుడు చేసుకుంటూ.

సుమిత్ర - సూర్యారావు వున్న కంపార్టుమెంటు వంతెన మీదకు వచ్చింది. అది మామూలు రైల్వేట్రాక్.

"అమ్మో....నీళ్ళంటే నాకు భయం" అని వెనక్కి వెళ్ళబోయింది సుమిత్ర.

కాని సూర్యారావు వెళ్ళనివ్వలేదు.

గబుక్కున సుమిత్ర చెయ్యపట్టి లాగి గట్టిగా రైల్లో నించి కిందకు నెట్టేశాడు.

రైల్లోనించి నీళ్ళల్లోకి పడిపోతూ పెద్దగా గుండెలు పగిలేలా ఆర్తనాదం చేసింది సుమిత్ర.

# 5

మరురోజు వుదయం తొమ్మిది గంటలకు నిద్రలేచాడు సూర్యారావు. స్నానం చేశాడు. నీట్ గా డ్రెస్ చేసు కుని బయటకు వచ్చాడు.

బయటకు వచ్చి యింటికి తాళం పెడుతుండగా పక్క పోర్షన్లో వున్నామె "రాత్రి మీరు ఇంట్లో లేరా?" అనడిగింది.

ఉలిక్కిపడ్డాడు అతను.

"ఎందుకు?"

"ఎందుకేమిటండీ? రాత్రి మన వీధిలో అందరూ రెండు గంటలవరకూ మేలుకునే వున్నారు. ఎవ్వరూ నిద్ర పోలేదు."

"ఎందుకు?"

"పన్నెండు గంటలప్పుడు ఈ వీధిలో ప్లీడరుగారింట్లో ఎవడో దొంగ పడ్డాడు. వాడు డబ్బు నగలు కాజేసి వెళుతుంటే ప్లీడరుగారి మూడో అమ్మాయి చూసి కేకలు పెట్టింది. వెంటనే అందరూ లేచారు. మేము కూడా లేచాం. మీరు బయటకు వస్తారేమోనని చూశాం. కాని రాలేదు. లోపల గడియా వేసివుంది. ఆయన తలుపు కొట్టారు కూడా. అయినా మీరు లేవలేదు."

"నాది మొద్దు నిద్ర....అంతే కాకుండా రాత్రి ఎందుకో మరీ మొద్దునిద్ర పట్టింది. ఇంతకు ముందే మెలకువ వచ్చింది" అన్నాడు కంగారును అణుచుకుంటూ.

"అదేమిటండీ.... మొహమంతా అలా పీక్కుపోయినట్టు అయిందేమిటి?" అన్నదామె మళ్ళీ.

"బాగా నిద్రపోయాను కదా" అంటూ నవ్వాడు.

"సుమిత్రగారు ఇవాళ వస్తుందన్నారు గదూ?"

"అవును....ఎందువల్లనో రాలేదు. తెల్లవారుజాముకే రావలసింది. మరి ఎందువల్ల రాలేదో!" అని తాళంచెవి ఆమెకు యిచ్చి "సుమిత్ర వస్తే ఇవ్వండి" అని రోడ్డు మీదకు వచ్చాడు.

గట్టిగా గాలి పీల్చుకున్నాడు.

హోటల్లో భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

సాయంత్రం వరకూ ఆఫీసులో వున్నాడు. ఆఫీసునించి బయటకు రాగానే టెలిగ్రాఫ్ ఆఫీసుకు వెళ్ళాడు.

సుమిత్రను వెంటనే బయల్దేరి రమ్మని అత్తగారింటికి టెలిగ్రాం ఇచ్చాడు.

టెలిగ్రాఫ్ ఆఫీసులోంచి బయటకు వచ్చేసరికి అరున్నర అయింది. వాచీ చూసుకుని అదే రోడ్‌లో వున్న ఓ

థియేటర్ కు నడిచాడు.

అయిదు నిముషాల్లో సూర్యారావు సినిమా చూడటంలో లీనమయిపోయాడు.

# 6

ఉదయం తొమ్మిది గంటలు దాటింది. స్నానం చేసి తల దువ్వుకుంటున్నాడు సూర్యారావు.

ఇంటి ముందు రిక్షా ఆగింది. ఆగిన రిక్షాలోంచి సూర్యారావు అత్తగారు శారదాంబ దిగింది.

"రండి....సుమిత్ర యేదీ?" అన్నాడతను.

"సుమిత్ర మొన్న రాత్రే యిక్కడకు వచ్చింది" అన్నదామె.

"మొన్న రాత్రా? మొన్న రాత్రి బయల్దేరి వస్తున్నట్టు వుత్తరం రాసింది. కాని రాలేదు."

"ఏమయిపోయిందో అల్లుడూ....నీకు వుత్తరం రాసినట్టుగానే అది రాత్రి రైలుకి బయల్దేరింది. ఎందువల్ల యిక్కడకు రాలేదో? ఏమయ్యిందో భయంగా వుంది" అన్నదామె కంగారుగా.

"కంగారు పడకండి. ఇంకెక్కడికయినా వెళ్ళిందేమో విచారిద్దాం" అన్నాడు సూర్యారావు మామూలుగా.

"ఇంకెక్కడికి వెళుతుంది?" అన్నదామె.

"ఏమో....ఎవరయినా స్నేహితుల యింటికో, మీ బంధువుల యింటికో వెళ్ళి వుండవచ్చు."

"చెప్పకుండా రైల్లో ఎక్కిన మనిషి యింకొకరి ఇళ్ళకు ఎలా వెళుతుంది?"

"ఎందుకు వెళ్ళకూడదు? స్టేషన్ లో ఎవరయినా స్నేహితురాలు కలిసి తమ వూరు రమ్మని పిలిచి వుండవచ్చు. అలా ఎవరితోనయినా కలిసి వెళ్ళిందేమో!"

"ఏమో.... నాకలా అనిపించటం లేదు అల్లుడూ! నాకేదో భయంగా వుంది. అమ్మాయి సంగతి నాకు బాగా తెలుసు. ఒకవేళ అది అలా ఎవరితోనయినా వెళ్ళినా మీకో, నాకో టెలిగ్రాం ఇస్తుంది కంగారుపడకుండా. ఇవ్వలేదంటే అది ఎవరింటికీ వెళ్ళలేదు. మధ్యలో నే మాయమయింది. అసలే రాత్రి ప్రయాణం....అందునా ఒంటరి ఆడది....ఏం జరిగి వుంటుందో.... నాకు భయంగా వుంది అల్లుడూ! ముందు పోలీసు రిపోర్టు ఇద్దాం" అన్నదామె భయంగా.

"పోలీసు రిపోర్టా?" కంగారు బయటకు కనిపించనీయకుండా అన్నాడు సూర్యారావు.

"అవును అల్లుడూ....పోలీసు రిపోర్టు యివ్వటమే మంచిది. ముందు ఇవ్వాలి. పోలీసులు కూడా ప్రయత్నం చేస్తేగానీ దాని విషయం తెలీదు."

"అలాగే ఇద్దాం. కాని ఇప్పుడే కాదు. ముందు మన ప్రయత్నాలు మనం చేద్దాం. ముందుగానే పోలీసు రిపోర్టు ఇస్తే ఈ విషయం నలుగురికీ తెలుస్తుంది. నా పరువు పోతుంది....ప్లీజ్, నన్ను అర్థం చేసుకోండి అత్తగారూ. ముందు మనం మనకు తెలిసిన వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి సుమిత్ర గురించి ఆరా తీద్దాము" అన్నాడు.

"ఏదో ఒకటి ముందు మనం బయల్దేరుదాం" అన్నదామె.

పక్క పోర్షన్‌లో వున్నామె-ఆమె అలా అంటూ వుండగానే "ఏమండోయ్ సూర్యారావుగారూ" అంటూ గబగబా ఇంట్లోకి వచ్చాడు. ఆమె చేతిలో తెలుగు దినపత్రిక వుంది.

"ఏమిటికి?" అన్నాడతను గబుక్కున.

"పేపర్లో ఈ ఫోటో చూడండి. సుమిత్రలా వుంది నాకు" అంటూ చూపించిందామె.

ఆత్రంగా పేపర్లోకి చూసింది శారదాంబ "సుమిత్రా" అంటూ.

క్షణం తర్వాత ఆమె ఘొల్లుమంది.

చాలా సేపటివరకూ సూర్యారావు ఆ ఫోటోని చూస్తూనే వుండిపోయాడు.

"ఎవరు సుమిత్రే కదూ" అన్నది పక్కపోర్షన్లో వున్నామె.

"అవును. అలాగే వుంది" అన్నాడతను.

పేపర్లో సుమిత్ర ఫోటో వెల్లికింతలా పడి వుంది. ఫోటో క్లియర్‌గా వుండటంవల్ల సులభంగానే గుర్తుపట్టటానికి వీలుగా వుంది.

"ఎంత పని చేశావే అమ్మాయ్" అని శోకాలు పెడుతోంది శారదాంబ.

ఫోటో కింద సుమిత్ర ఫోటోకి సంబంధించిన మేటర్ రాశారు—ఏదో కాలువలో దొరికిందనీ శవానికి సంబంధించినవాళ్ళు పోలీస్ స్టేషన్‌కి వెంటనే వచ్చి కలుసుకోవలసిందనీ రాసి వున్నది.

"సుమిత్ర ఎంత పని చేసింది?" అన్నది ప్రక్క పోర్షనామె.

"అమ్మాయ్ సుమిత్రా నాకేమిటే ఈ కడుపు కోత" అంటూ యేడుస్తోంది సుమిత్ర తల్లి.

సూర్యారావు ఏడుపు మొహం పెట్టుకుని అత్తగార్ని చూస్తున్నాడు.

చుట్టుపక్కల ఇళ్ళలో వాళ్ళు ఒక్కొక్కరే సూర్యారావు ఇంట్లోకి చేరుతున్నారు.

"నా పేరు రాఘవ" అన్నాడతను.

ఎర్రగా, పొడుగ్గా వున్నాడు. పైకి దువ్విన క్రాపు... చూడగానే తెలివిగల మనిషిలా అనిపించాడు.

"కూర్చోండి" అన్నాను.

నా ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

నేనో సిగరెట్ వెలిగించి అతనికి ఒకటి ఇవ్వ బోయాను.

"నాకు అలవాటు లేదు సార్" అన్నాడు.

నవ్వాను. ఈ రోజుల్లో సిగరెట్ తాగని యువకులు వుండరు. చాలా తక్కువమందిలో యితనొకడు అను కున్నాను.

"చెప్పండి....ఏం పనిమీద వచ్చారు?" అడిగాను పొగ బయటకు వదలి.

"నిన్నటి తెలుగు దినపత్రిక 'ప్రతిరోజు' చూశారా?" అడిగాడతను.

"చూశాను....ఎందుకు?"

"అందులో నీళ్ళల్లో పడి మరణించిన ఓ యువతి ఫోటో వేశారు. చూశారనుకుంటాను."

"అవును."

"ఆ యువతి మరణం గురించి మిమ్మల్ని దర్యాప్తు చెయ్యమని అడగటానికి వచ్చాను."

"ఆశ్చర్యంగా వుంది. ఆ యువతి ఎవరు? ఆమె మీకు ఏమవుతుంది?" అడిగాను.

"చెబుతాను....ఒక్క విషయం గుర్తుంచుకోండి జగదీష్‌గారూ! నేను చెప్పేది మీ దర్యాప్తుకు అవసర మయిన మేటర్. ఇంతవరకు ఎవ్వరికీ ఈ రహస్యం తెలి

యదు. మొదటిసారిగా మీకే చెబుతున్నాను. నేను చెబుతున్న ఈ విషయాన్ని మీరు రహస్యంగానే వుంచుతానని హామీ ఇవ్వండి" అన్నాడు రాఘవ.

"సారీ మిస్టర్. ఇటువంటి హామీలను నేను ఇవ్వలేను. అవసరమయితే మీరు చెప్పిన విషయాలను బయటపెట్టవలసి వుంటుంది. అవసరం లేకపోతే మాత్రం నేను ఆ రహస్యాలను బయటకు రానీయను."

"థాంక్స్.... ఈ రహస్యాలను బయటపెట్టవలసిన అవసరం రాదనే అనుకుంటాను. ఒకవేళ వచ్చినా బాగా ఆలోచించి బయట పెట్టండి. నేను నా గురించి భయపడటం లేదు. చనిపోయిన మనిషి మంచిది కాదని నలుగురికీ తెలియటం మంచిది కాదు."

"ఆల్ రైట్. ఇక మీరు చెప్పండి" అన్నాను సిగరెట్ను యాష్ ట్రేలో కుక్కి—.

"పేపర్లో ఫోటో పడిన యువతి పేరు సుమిత్ర. నేను-సుమిత్ర డిగ్రీలో క్లాసు మేట్సుం. ఇద్దరం ప్రేమించుకున్నాం. పెళ్ళి కూడా చేసుకోవాలనుకున్నాం. కాని మా ఇద్దరి కులాలు ఒకటి అవకపోవటంవల్ల సుమిత్ర తల్లిగారు ఒప్పుకోలేదు.

సుమిత్రకు తండ్రి లేడు. ముగ్గురు చెల్లెళ్ళున్నారు. తండ్రి సంపాదించిన ఆస్తి కొంత వుంది. తల్లి మనసును బాధ పెట్టటం ఇష్టంలేక సుమిత్ర—సూర్యారావును పెళ్ళి చేసుకుంది.

కాని మా యిద్దరి మధ్య వున్న సంబంధం సుమిత్ర పెళ్ళితో ఆగిపోలేదు. పెళ్ళికి పూర్వమే మా యిద్దరికీ శారీరక సంబంధం కూడా వుంది. పెళ్ళయినా అది అలా కొనసాగుతూనే వుంది. రెండు నెలలకీ మూడు నెలలకీ

ఏదో వంకతో సుమిత్ర ఈ వూరు వచ్చేది. ఓ వారం రోజులు వుండేది. ఇద్దరం కలుసుకుంటూ వుండేవాళ్ళం.

అయితే ఈ విషయం ఎవ్వరికీ తెలీదు. సుమిత్ర కూడా చాలా జాగ్రత్తగా వున్నది.

పదిహేను రోజుల క్రితం తల్లినీ, చెల్లెళ్ళనీ చూడాలని వున్నదని చెప్పి సుమిత్ర ఈ వూరు. వచ్చింది. వారం రోజుల్లోనే తిరిగి వస్తానని భర్తతో చెప్పిందిట. చెప్పినట్టుగా వారం రోజులకు వెళ్ళలేదు. పది రోజులు ఇక్కడే వుంది.

ఐదు రోజుల క్రితం తన వూరికి రాత్రి ఎక్స్‌ప్రెస్‌లో సుమిత్ర బయల్దేరింది. ఆ రోజు రాత్రి తను బయల్దేరి వస్తున్నట్టు భర్తకు వుత్తరం రాసిందిట. ఉత్తరం రాసినట్టుగానే నేను ఇంకో నాలుగు రోజులు వుండమని కోరినా వీల్లేదంటూ ఆ రాత్రికే ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరింది.

"ఎన్నో తారీకునో చెప్పండి కరెక్టుగా" అడిగాను.

"పన్నెండో తారీకు రాత్రి తొమ్మిది గంటల తర్వాత బయల్దేరే ఎక్స్‌ప్రెస్‌లో."

"పన్నెండు రాత్రి ఎక్స్‌ప్రెస్‌లోనా? అయితే అదే ఎక్స్‌ప్రెస్‌లో ఆ రాత్రి నేను కూడా ప్రయాణం చేశాను" అన్నాను మరో సిగరెట్ వెలిగిస్తూ.

"మీరు కూడా ప్రయాణం చేశారా?" అడిగాడు రాఘవ.

"అవును.... చెప్పండి" అన్నాను.

"ఏముంది? ఆ రైల్లో బయలుదేరిన సుమిత్ర, భర్త ఇంటికి చేరలేదు. మధ్యలోనే ఓ కాలువలో పడి చచ్చిపోయింది. ఆ ఫోటోనే నిన్నటి పేపర్లో వేశారు" అన్నా

డితను బాధగా.

నేను మాట్లాడలేదు....ఆలోచనలో పడిపోయాను.

"అవును. ఆమె నీళ్ళలో పడిపోతూ పెద్ద ఆర్తనాదం కూడా చేసిందట" అన్నాను.

"ఆర్తనాదమా?!...." ఆశ్చర్యంగా అడిగాడు రాఘవ.

"అవును. ఆ ట్రెయిన్‌లో ఎక్కిన ఇరవై నిముషాలకు నేను నిద్రపోయాను. తర్వాత యెప్పుడో మెలుకువ వచ్చింది. లేచేసరికి నా కంపార్టుమెంటులో కూర్చున్న మనుషులు యేదో విషయం గురించి మాట్లాడుకుంటు న్నారు. ఏమిటని అడిగితే ఐదునిముషాల క్రితం యెవరిదో స్త్రీ ఆర్తనాదం వినిపించిందని చెప్పారు.

"అయితే తప్పకుండా ఆ ఆర్తనాదం సుమిత్రదే అయి వుంటుంది. సుమిత్ర నీళ్ళలో పడిపోతూ ఆ ఆర్తనాదం చేసి వుండాలి" అన్నాడు రాఘవ.

"అవును....ఇంతకీ సుమిత్ర రైల్లోనించి అంత చీకట్లో నీళ్ళల్లోకి ఎందుకు పడిపోయి వుంటుంది? ప్రమాదవశాత్తు అయి వుంటుందా? లేకపోతే ఆత్మహత్య చేసుకుని వుంటుందా?"

"ఆత్మహత్య చేసుకుని వుండదు. ఎవరో సుమిత్రను రైల్లోనించి నీళ్ళలోకి నెట్టి హత్య చేశారు" అన్నాడతను గట్టిగా.

"ఇది హత్య అని మీరు గట్టిగా ఎలా చెప్పగలరు?" అడిగాను అతని కళ్ళలోకి చూస్తూ.

"అంతే కాదు. హంతకుడు యెవరో కూడా చెప్ప గలను" అన్నాడతను.

"ఎవరు?" ముందుకు వొంగుతూ అడిగాను.

"ఎవరో కాదు, సుమిత్ర భర్త సూర్యారావు."

"ఆమె భర్తా! ఎలా చెప్పగలరు? అతనెలా హత్య చేస్తాడు? అతను యెక్కడో తన వూళ్ళోనే వున్నాడు కదా?"

"లేదు. ఆ రోజు రాత్రి సుమిత్రను హత్య చెయ్యటానికి ముందుగానే బయల్దేరి వచ్చి వరంగల్లు స్టేషన్‌లో సుమిత్ర ఎక్కివచ్చే ఎక్స్‌ప్రెస్‌కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు."

"ఇదంతా మీకెలా తెలుసు? సూర్యారావు ముందుగానే వచ్చి వరంగల్లు స్టేషన్‌లో ఆమె ఎక్కివచ్చే ఎక్స్‌ప్రెస్‌కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడని?"

"ఇటునించి బయల్దేరే ఎక్స్‌ప్రెస్‌కు ఎగురుగా అటు వైపునించి కూడా ఓ ఎక్స్‌ప్రెస్ వస్తుంది. అందులో నా స్నేహితుడొకడు విజయవాడనించి వస్తున్నాడు. అతను కూడా మా క్లాసుమేటే. అతనికి సూర్యారావు తెలుసు. అతనికి సుమిత్ర యిక్కడినించి బయల్దేరిన రోజు రాత్రి సూర్యారావు వరంగల్ స్టేషన్‌లో ప్లాట్ ఫారంమీద కనిపించాడుట సిగరెట్టు కాలుస్తూ."

"అతన్ని మీ స్నేహితుడు సరిగ్గా గుర్తుపట్టాడో లేదో?" అన్నాను.

"అటువంటి సందేహం అవసరం లేదు. ఇప్పుడయినా అతను సూర్యారావును గుర్తుపట్టగలడు. అతనే నాతో ఈ విషయం ఆ మరురోజునే చెప్పాడు."

వెంటనే మాట్లాడలేదు నేను. నా మెదడులో ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి. రాఘవ చెబుతున్నదంతా రీజనబుల్‌గా వున్నట్లనిపిస్తోంది.

సుమిత్ర ఆత్మహత్య చేసుకోలేదు. ప్రమాదవశాత్తూ పడిపోలేదు. ఆత్మహత్య చేసుకుంటే అలా ఆర్తనాదం చెయ్యదు. ఎవరో ఆమెను బయటకు నెట్టివుండాలి. ఆ యెవరో సుమిత్ర భర్త సూర్యారావే అయివుండొచ్చు. ఏమయినా దర్యాప్తు మొదలుపెడితేగానీ అసలు విషయం బయటకు రాదు.

"ఇంకో విషయం జగదీష్‌గారూ....సుమిత్ర ఆ రైలుకు బయల్దేరి వస్తున్నట్టు ఆమె భర్తకు ముందుగా తెలుసు" అన్నాడు రాఘవ.

"ఒక్క విషయం చెప్పండి. సూర్యారావు—సుమిత్రను హత్య చెయ్యటానికి కారణం యేమిటి? మీ ఇద్దరికీ యిటువంటి సంబంధం వున్నట్టు అతనికి తెలుసా?" అడిగాను.

"తెలీదు. కాని తెలుసునని నా అనుమానం. ఎందుకంటే క్రితంసారి సుమిత్ర యిక్కడకు వచ్చి వెళ్ళిన తర్వాత ఆమెకు ఓ ఉత్తరం రాశాను. ఆ ఉత్తరాన్ని సూర్యారావు తీసుకున్నాడట. అప్పుడు సుమిత్ర ఇంట్లో లేదుట. ఆమె రాగానే ఆ ఉత్తరాన్ని చదవకుండానే ఆమెకు యిచ్చేశాడుట. సుమిత్రే ఈ విషయాన్ని మొన్న వచ్చినప్పుడు చెప్పింది. కాని నాకు నమ్మకం లేదు అతను ఆ ఉత్తరాన్ని చదవలేదంటే....చదివిన తర్వాతనే దాన్ని మళ్ళీ అంటించి సుమిత్రకు యిచ్చి వుంటాడు. అప్పుడే సుమిత్రను హత్య చెయ్యాలని ప్లాను వేసుకుని వుంటాడు. అందుకే సుమిత్రను ఆ ఉత్తరం గురించి అడిగి వుండడు. ఇది ప్లాను ప్రకారం జరిగిన హత్య...."అన్నాడు రాఘవ.

"అవును" అన్నాను తల వూపుతూ.

"జగదీష్‌గారూ....తప్పకుండా అతనే హంతకుడు ఐవుండాలి. అతన్ని పట్టుకోండి. అతనికి శిక్ష పడేలా చెయ్యండి. నేను ఫీజు యెక్కువగా యిచ్చుకోలేను. ఐనా నా శక్తికొద్దీ యిచ్చుకుంటాను. సుమిత్రను నేను పెళ్ళి చేసుకోక పోవచ్చును. కాని మా యిద్దరికీ యెప్పుడో పెళ్ళయిపోయినట్టు లెక్క....ఆమెను చంపిన ఆ దుర్మార్గుడికి కఠినమైన శిక్ష పడాలి...." అన్నాడు ఆవేశంగా రాఘవ.

"తప్పకుండా. మీరు మీ ఎడ్రస్, సుమిత్ర తల్లి వుండే యింటి ఎడ్రసూ యిచ్చి వెళ్ళండి. నేను దర్యాప్తు చేసి హంతకుడ్ని పట్టుకుంటాను" అన్నాను.

"థాంక్స్ సార్....ఇవిగో వెయ్యి రూపాయలు. ఖర్చులకు వుంచండి" అంటూ అతను పర్సులోంచి నోట్లు తీసి బల్లమీద వుంచాడు.

వాటిని తీసి జేబులో పెట్టుకున్నాను. తర్వాత అతను నే నడిగిన యెడ్రసులు యిచ్చి నమస్కారం చేసి వెళ్ళి వెళ్ళిపోయాడు.

నేను ఆలోచనలో పడిపోయాను.

## 8

రాత్రి పదిగంటలయింది. సూర్యారావు కుర్చీలో వెనక్కువాలి పడుకుని సిగరెట్టు కాలుస్తున్నాడు. అతని గడ్డం పెరిగిపోయి వుంది. రోజూ షేవింగ్ చేసుకుందామని అనుకుంటూనే చేసుకోకుండా బలవంతాన ఆ కోరికను ఆపుకుంటున్నాడు అతను.

భార్య పోయి యింకా పదిరోజులు అవకముందే తను నీట్‌గా తయారయి ఇదివరకటిలా తిరుగుతుంటే లోకం తనని అనుమానిస్తుంది.

సుమిత్ర ఆత్మహత్య చేసుకుందని పోలీసులను ఎట్లాగో నమ్మించి వాళ్ళకు కొంతడబ్బు ముట్టచెప్పి కేసు లేకుండా చేసుకున్నాడు. అందుకే సంతోషంగా వున్నా లోకం కోసం భార్య పోయినందుకు విచారం నటిస్తున్నాడు.

అతని ముందు టీపాయ్ వుంది. దానిమీద హేవార్డ్స విస్కీ బాటిలు వుంది. అతను నెమ్మదిగా ఒక్కడే ఇంట్లో కూర్చుని తాగుతున్నాడు.

బాటిల్లో వున్న విస్కీని గ్లాసులోకి వంచుతుండగా ఎవరో తలుపు తట్టారు.

అతను వెంటనే మాట్లాడలేదు. నిముషంసేపు మవునంగా వుండిపోయాడు.

బయట ఎవరో ఇంకా తలుపులమీద గట్టిగా కొడుతూనే వున్నారు.

పక్క పోర్షన్లో వుంటున్నవాళ్ళు యెవరయినా అయివుంటారనుకున్నాడు. కాని వాళ్ళు ఆ రోజు ఉదయమే యేదో వూరు అందరూ వెళ్ళిన విషయం గుర్తుకొచ్చింది.

"ఎవరు?" అన్నాడు సూర్యారావు.

"నేనే తలుపు తియ్యి...." అన్నాడు బయట మనిషి.

లేచివెళ్ళి తలుపు తెరిచాడు అతను.

లోపలకు వచ్చాడతను సూర్యారావును నెట్టుకుంటూ.

అతన్ని చూడగానే షాక్ కొట్టినవాడిలా అయిపోయాడు సూర్యారావు.

అతను యెవరో కాదు. ఏ మనిషి నయితే అతను మరచిపోవాలని అనుకుంటున్నాడో అతనే ఆ మనిషి....
తను తన భార్య హత్య విషయంలో యిరుక్కోకుండా

వుండటానికి సృష్టించుకున్న ఎలిబీని బద్దలు కొట్టగల మనిషి.

"తలుపులు మూసేయ్...." అన్నాడు అతను నవ్వుతూ.

"ఎందుకొచ్చావ్ నిరంజనం?" అన్నాడు సూర్యారావు తలుపులు మూసి వెనక్కి తిరిగి.

"అదేం మాటోయ్ ఫ్రెండ్....చక్కగా యింట్లో ఒక్కడివే కూర్చుని మందు కొడుతున్నావా? తప్పుకదూ మరో మనిషి తోడు లేకుండా మందు కొట్టకూడదని ఆ మాత్రం తెలీదూ నీకు?" అని ఓ కుర్చీని టీపాయ్ యెదురుగా లాక్కుని కూర్చున్నాడు.

"చెప్పు....ఇక్కడికెందు కొచ్చావ్?" కటువుగా అడిగాడు సూర్యారావు. అతనికి మనసులో భయంగా వుంది. అయినా తన భయాన్ని దాచుకుని లేని ధైర్యాన్ని తెచ్చుకుని అడిగాడు అతను.

"నీ భార్య ఆత్మహత్య చేసుకుందని విని నా సానుభూతి నీకు స్వయంగా తెలియబరుచుకుందామని వచ్చాను. ఈ గ్లాసులో కూడా దాన్ని కొంచెం వొంచు" అన్నాడు నవ్వుతూ.

"పిచ్చిగా వాగకు నిరంజనం....చెప్పు....యింత రాత్రివేళ నువ్వు యెందుకు వచ్చావ్ నా యింటికి?"

"నన్నింతగా నొక్కి నొక్కి అడుగుతున్నావంటే నా గురించి నువ్వు భయపడుతున్నావన్న మాట....అయితే నేను వూహించినది నిజమే."

"ఏమిటా నిజం?" ఖంగారుగా అడిగాడు సూర్యారావు.

"బలే తెలివిగా హత్య చేశావ్ గురూ—నీ

భార్యను....”

అంతే....సూర్యారావు ఈడ్చి నిరంజనం చెంపమీద కొట్టాడు.

నిరంజనానికి కళ్ళు తిరిగాయి.

“ఏమిటి నువ్వు వాగుతున్నది ఇడియట్.... నేను నా భార్యను హత్య చేశానా?” కోపంగా అన్నాడు సూర్యారావు.

“సూర్యారావ్....నువ్వు నన్ను కొట్టి బెదిరించి నా నోరు మూయలేవు. నువ్వు నీ భార్య పుట్టింటినించి బయల్దేరిన రోజు రాత్రి యింట్లోనే వున్నట్టు ఎలిబీ సృష్టించుకున్నట్టున్నావ్ ...అందుకే నిన్ను పోలీసులు వదిలారు. నీ భార్య ఆత్మహత్య చేసుకుందని నమ్మారు.

కాని ఆ రోజు అర్ధరాత్రి నువ్వు వరంగల్ స్టేషన్‌లో నాకు కనిపించావని నేను పోలీసులకు చెప్పానంటే నీ బతుకు ఏమవుతుందో ఆలోచించుకో....” అన్నాడు నిరంజనం.

ఆ మాటతో సూర్యారావు తెచ్చిపెట్టుకున్న ధైర్యం సడలిపోయింది. నిరంజనాన్ని బెదిరించటం ప్రమాదమనిపించింది. అతన్ని మంచిగా మాటలతో లొంగదీసుకోవాలనుకున్నాడు.

నిరంజనం అసలే క్రాక్....అతనికి యెవ్వరూ లేరు. ఏదో ఒక పని చేసి డబ్బు సంపాదించి బార్‌లో కూర్చుని తాగుతూ వుంటాడు. బార్‌లోనే సూర్యారావుకీ అతనికీ పరిచయమయింది.

“సారీ నిరంజనం....ఏదో కోపంలో వుండి నిన్ను కొట్టాను. ఏమనుకోకు. ఇంతకీ నువ్వనేదేమిటి?” అన్నాడు సూర్యారావు.

నిరంజనం మొహం వికసించింది సూర్యారావు అలా అనగానే.

"నువ్వు ఆ రాత్రి రైల్లోనించి నీ భార్యను నీళ్ళలోకి నెట్టి హత్య చేశావ్ కదూ?" అన్నాడు వెంటనే.

"అసలు విషయం నీకు తెలీదు నిరంజనం.... నేను నా భార్యను హత్య చెయ్యలేదు. ఇద్దరం డోర్ దగ్గర నిలబడి బయటి పరిసరాలను చూస్తూ మాట్లాడుకుంటున్నాం.... చీకటిగా వుండటంవల్ల నా భార్య కొంచెం ముందుకు జరిగింది. అంతే. కింద పడిపోయింది.

తర్వాత నాకు భయమేసింది. ప్రమాదవశాత్తూ పడిపోయినా నేనే ఆమెను నెట్టి హత్య చేశానని అంటారు. అందుకని నేను తర్వాత స్టేషన్‌లో దిగి తెల్లవారకముందే యింటికి వచ్చాను. నేను ఆ రాత్రి యిల్లు కదల్లేదని చెప్పాను. ఇదీ అసలు జరిగింది. అంతేగానీ నేను నా భార్యను హత్య చెయ్యలేదు...." అన్నాడు.

నవ్వాడు నిరంజనం అతను చెప్పింది విని.

"బలే గొప్ప కథ చెప్పావ్ గురూ....నువ్వు డిటెక్టివ్ కథలు రాయి. పెకోస్తావ్....అసలు నువ్వు వరంగల్లు స్టేషన్‌కు యెందుకు వెళ్ళాల్సి వచ్చింది? పోలీసులు ముందు నిన్ను యిదే ప్రశ్న అడుగుతారు....దీనికి నువ్వు జవాబు చెప్పలేవు.

దర్యాప్తు జరుగుతుంది! అసలు విషయం ఏది వుంటే అది బయటకు వస్తుంది. అప్పుడు నువ్వు ఏ జైలు కావాలనుకుంటే ఆ జైల్లో వుంటావ్....సరేనా....ఇదంతా యెందుకొచ్చిన గొడవ.... నేను చెప్పినట్టు చెయ్యి....ఏ గొడవా వుండదు" అన్నాడు నిరంజనం గ్లాసులో ఒంచుకున్న విస్కీని తాగిన తర్వాత.

"ఏం చెయ్యమంటావ్?" గబుక్కున అడిగాడు సూర్యారావు.

"ఓ పదివేలు ఇలా పారెయ్....నా నోరు మూసుకుంటాను.... నేను చూసిన దాన్ని మరచిపోతాను."

"పదివేలివ్వాలా? నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నావా?"

"నువ్వేదనుకుంటే అది. కాని నేను మాత్రం అలా అనుకోను....కొంతమంది సాక్ష్యం చెప్పటానికి డబ్బులిస్తారు. కొంతమంది సాక్ష్యం చెప్పకుండా వుండటానికి డబ్బు తీసుకుంటారు. అంతే...."

"పదివేలు నేను ఇవ్వను....నా దగ్గర అంత డబ్బు లేదు" అన్నాడు సూర్యారావు మొండిగా.

"మరి ఎంత ఇవ్వగలవు?"

"రెండువేలు ఇస్తాను."

"రేపు పొద్దున ఎవడయినా అడుక్కునేవాడొస్తాడు. వాడికివ్వు ఆ రెండువేలు."

"మరి ఎంతివ్వమంటావ్?"

"ఎనిమిదివేలకు తక్కువ తీసుకోను....యిది యింకేదో కేసు కాదు. హత్య కేసు....అందుకే ఎనిమిదివేలు...."

"సరే ఒప్పుకుంటున్నాను. కాని డబ్బు యిప్పుడు నా దగ్గరలేదు. రేపు సాయంత్రానికి ఎక్కడయినా సాధిస్తాను. నువ్వు ఇక్కడకు రావద్దు. నేనే నీ గదికి తీసుకొస్తాను" అన్నాడు సూర్యారావు.

"వద్దు....నువ్వు నా గదికి రావద్దు. రాత్రి తొమ్మిది గంటలకు నేనే యిక్కడకు వస్తాను. డబ్బు సిద్ధం చేసి వుంచు" అన్నాడు నిరంజనం.

"నీ యిష్టం....అలాగే" అన్నాడు సూర్యారావు.

"థాంక్ యూ బ్రదర్. నువ్వు జైలుకు వెళ్ళటం నాకు ఇష్టం లేదు. అందుకే నీతో ఈ బేరం కుదుర్చుకున్నాను. ఇదే ఇంకెవరయినా అయినట్లయితే నేరుగా వెళ్ళి పోలీసులకు చెప్పేవాడిని" అన్నాడు నిరంజనం విస్కీని గ్లాసులోకి వంచుతూ.

సూర్యారావు మాట్లాడలేదు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ వుండిపోయాడు.

## 9

వరంగల్ స్టేషన్‌లోకి అడుగుపెట్టాను. ఏదో ట్రెయిన్ రాబోతున్నదనుకుంటాను. స్టేషను నిండుగా జనం వున్నారు.

సాయంత్రం ఆరు గంటలు దాటుతోంది. బుకింగ్ కౌంటర్ దగ్గరకు వెళ్ళాను. నలుగురు మనుష్యులు లైన్‌లో నిలబడి టిక్కెట్లు తీసుకుంటున్నారు.

వాళ్ళు టిక్కెట్లు తీసుకుని అక్కడినించి వెళ్ళిపోయే వరకూ ఆగాను. వాళ్ళు వెళ్ళిపోగానే "క్షమించాలి" అంటూ నన్ను నేను పరిచయం చేసుకున్నాను బుకింగ్ క్లర్కుకు.

ఆయన మొహం వెడల్పయింది. సంతోషంతో "లోపలకు రండి" అన్నాడు.

లోపలకు వెళ్ళాను. ఆయన చూపించిన కుర్చీలో కూర్చున్నాను.

"చెప్పండి....ఏం పనిమీద వచ్చారు?" అడిగాడాయన నవ్వుతూ.

"ఓ హత్యకేసు దర్యాప్తు చేస్తున్నాను. మీరు నాకో ఇన్‌ఫర్‌మేషన్ ఇవ్వాలి."

"ఏమిటి?"

"ఈ నెల పన్నెండో తారీకు రాత్రి ఈ బుకింగ్‌లో

మీ కే వున్నారా? ఇంకెవరయినా వున్నారా?"

ఆయన ఒక్క నిమిషం ఆలోచించి "నేనే వున్నాను" అన్నాడు.

"అయితే ఈ ఫోటో చూడండి. ఈ మనిషి పన్నెండో తారీకు రాత్రి హైద్రాబాద్ నించి వచ్చే ఎక్స్‌ప్రెస్‌కు టిక్కెట్టు తీసుకున్నాడు" అంటూ పర్సు జేబులోవించి సూర్యారావు ఫోటోను ఆయనకు చూపించాను.

ఆయన ఫోటోను చూడటంతోనే "అవును ఇతను ఆ రాత్రి ఇక్కడే ఖమ్మానికి టిక్కెట్టు తీసుకున్నాడు" అన్నాడు.

"బాగా చూడండి.... ఇది హత్యకేసు.... మీరు చెప్పే ఈ విషయం మీద నా దర్యాప్తు ముందుకు సాగుతుంది" అన్నాను.

"అనుమానం లేదు. ఇతను నాకు ఇంతగా గుర్తుండటానికి కారణాలు రెండు: ఒకటి—ప్రస్తుతం ఒరిస్సాలో వుంటున్న నా బావమరిది కూడా ఇలాగే వుంటాడు. ఇతన్ని ఆ రాత్రి గబుక్కున చూడగానే అతనే అని అనుకున్నాను.... కాని కాదు. ఇంకోటి—అతను నాకు వంద రూపాయల నోటు యిచ్చాడు. చిల్లర లేదని అన్నాను. తర్వాత ఇరవై రూపాయల నోటు యిచ్చాడు. అంతే కాకుండా ఆ ట్రెయిన్‌కు చివరగా టిక్కెట్టు తీసుకొన్న మనిషి యితనే...." అన్నాడు బుక్కింగుక్లర్కు....

"థాంక్స్ సార్...." అని "ఇప్పుడు ఖమ్మం వెళ్ళే ట్రెయిను యేదయినా వుందా?" అని అడిగాను.

"మద్రాస్ ఎక్స్‌ప్రెస్ వుంది" అన్నాడాయన.

"అయితే ఓ టిక్కెట్టు యివ్వండి" అన్నాను. పర్సులోంచి డబ్బులు తీసి ఇచ్చాను.

టిక్కెట్టు తీసుకుని ఆయనకు మరోసారి థాంక్స్ చెప్పి ప్లాట్ ఫారం మీదకు వచ్చాను.

ఏడుగంటలు దాటుతుండగా వచ్చింది ఎక్స్ప్రెస్....

ఎక్కాను.

వెంటనే బయల్దేరింది రైలు.

రైలుతో పాటు నా ఆలోచనలు మొదలయినాయి.

రాఘవ ఈ కేసును దర్యాప్తు చెయ్యమని చెప్పి వెళ్ళిన తర్వాత సుమిత్ర తల్లిగారింటికి వెళ్ళాను. పాపం. ఆమె తన కూతురు ఎందుకు ఆత్మహత్య చేసుకుందో అర్థం కాక ఏడుస్తోంది.

ఇది నాకు ఆత్మహత్యలా అనిపించటం లేదనీ, హత్య అయివుండవచ్చుననీ చెప్పి ఆమెదగ్గర సుమిత్ర, సూర్యారావుల ఫోటోలు తీసుకున్నాను.

వరంగల్లు స్టేషన్ బుక్కింగ్ క్లర్కు సూర్యారావు ఫోటోను గుర్తుపట్టగానే తప్పకుండా హంతకుడు అతనే అని నిర్ణయానికొచ్చాను. లేకపోతే అతను ట్రెయిన్లో తన దగ్గరకు వస్తున్న భార్యను ముందుగానే వచ్చి కలుసుకోవలసిన అవసరం యేమున్నది?

రాఘవ స్నేహితుడు ఆ రాత్రి చూసింది సూర్యారావునే. అతను పొరపాటు పడలేదు.

తొమ్మిది గంటలు కావస్తూండగా ఎక్స్ప్రెస్ ఖమ్మం స్టేషన్లో ఆగింది.

గబగబా స్టేషన్ బయటకు వచ్చాను.

ఓ రిక్షా ఎక్కి పోలీస్ స్టేషన్కు పోనివ్వమన్నాను.

రిక్షావాడు నా వైపు ఆశ్చర్యంగా చూసి రిక్షా తొక్కటం మొదలుపెట్టాడు.

అతను హంతకుడు అనటానికి కావలసిన ఓ ఆధారం

దొరికింది. ఇక మిగిలిన కొన్ని పద్ధతుల ద్వారా అతని చేత నిజాన్ని ఒప్పించాలి. అందుకు పోలీసుల సహాయం ఎంతయినా అవసరం.

ఖమ్మం ఇన్స్పెక్టర్ నాకు బాగానే స్నేహితుడు. అతన్ని, పోలీస్‌లను వెంటపెట్టుకుని వెళితే మరింత సులభంగా అవుతుంది.

రిక్షా పోలీస్ స్టేషన్ ముందు ఆగింది.

దిగి అతనికి డబ్బులిచ్చి లోపలకు నడిచాను.

లోపల వున్నాడు ఇన్స్పెక్టర్ విశ్వనాథ్....

నన్ను చూడగానే "హల్లో ఫ్రెండ్....ఏమిటీ రావటం....ఇప్పటికి గుర్తుకొచ్చానా" అన్నాడు లేచి నిలబడి ఆప్యాయంగా నా చేయి నొక్కి....

"ఇప్పుడయినా నిన్ను చూడటానికి రాలేదు బ్రదర్! ఈ వూళ్ళో వున్న ఓ హంతకుడిని నీకు పట్టివ్వటానికి వచ్చాను" అన్నాను నవ్వుతూ.

"హంతకుడా? ఎవరు?" అడిగాడు అతను.

చెప్పాను.

"అలాగా" అని అప్పటికప్పుడే ఇద్దరు కానిస్టేబుల్స్‌ను తీసుకుని జీపులో బయల్దేరాడు.

ఐదు నిముషాల్లో జీపు సూర్యారావు యింటి ముందు ఆగింది. సుమిత్ర తల్లి అల్లుడి ఇంటి గుర్తులను బాగానే చెప్పింది.

ఆ ఇంటికి చుట్టూ గోడలు లేవు.

వాచీ చూసుకున్నాను జీపు దిగగానే. తొమ్మిదిన్నర కావస్తోంది.

"ఇదే ఇల్లు" అన్నాడు విశ్వనాథ్ తలుపుల ముందుకు వెళ్ళి నిలబడి.

పక్క పోర్షన్ని చూశాను. తాళం వేసి వుంది.

సూర్యారావు యింటి తలుపులు మూసి లోపల గడియ పెట్టబడి వున్నాయి.

హేండ్ స్టిక్ తో తలుపుమీద చప్పుడు చేశాడు ఇన్స్పెక్టర్.

లోపల యెటువంటి అలికిడీ వినిపించలేదు. ఎవ్వరూ తలుపులను తెరవలేదు.

ఓ కానిస్టేబుల్ వెనుకవైపు గోడ ఎక్కి చూసి వచ్చాడు. వెనుక తలుపులు కూడా లోపల గడియపెట్ట బడి వున్నాయిట.

అంటే సూర్యారావు ఇంట్లోనే వున్నాడు.

ఇంట్లో వుండి తలుపులను బాదుతున్నా తెరవకుండా యెందుకు వుంటాడు?

కిటికీ తలుపులు కూడా మూసి వున్నాయి. కాని కిటికీ సందుల్లోనించి లోపల వెలుగుతున్న దీపం కాంతి బయటకు వస్తోంది.

తలుపులను విరగ్గొట్టమన్నాడు విశ్వనాథ్ కానిస్టేబుళ్ళను.

క్షణాలమీద తలుపులు విరిగాయి.

లోపలకు వెళ్ళి ముందుగదిలో దృశ్యం చూసి స్థంభించి పోయాము.

నిరంజనం శవం వెల్లికింతలా పడి వున్నది. దాని ప్రక్కనే చేతిలో కత్తితో పిచ్చివాడిగా నిలుచున్నాడు సూర్యారావు.

"మైగాడ్" అన్నాను అప్రయత్నంగానే.

—: ఐపోయింది :—

# (ఆరవ భాగము)

రాణా వేగంగా టైపు చేయబడ్డ ఆ జాబితాని చదవసాగాడు.

పూర్తిచేసి, తల విదిలించి, మళ్ళీ చదవసాగాడు.

ఈసారి నెమ్మదిగా—

"ఒకటో రెండో తెల్సున్న పేర్లలా వున్నాయి. కానీ...." మళ్ళీ తల విదిలించాడు రాణా నిస్సహాయిగా, నిరుత్సాహంగా.

"స్కూలు పేరు రణధావే. రణధావే ప్రైమరీ స్కూల్! బెల్ రింగయిందా యిప్పటికైనా?"

"అదే అనిపిస్తోంది, కాని ఖచ్చితంగా చెప్పలేను."

"నువ్వు ఖచ్చితంగా చెప్పలేవని నాకు తెల్సు మి.... స్ట....ర్...." విసురుగా వినబడింది గోడదగ్గిర్నుంచి ఇన్‌స్పెక్టర్ కంఠం.

"లెట్ మీ హేండిల్ దిస్ రైనా!" కోపంగా అన్నాడు సూపరింటెండెంట్, తన క్రింది ఉద్యోగి ప్రదర్శిస్తున్న అనవసరపు కాఠిన్యాన్ని చిరాకుపడ్తూ.

"ఆల్ రైట్ మిస్టర్ రాణా!" ప్రశాంతంగా పల్కింది మెహ్రోత్రా కంఠం. "మేం యింకా యిన్వెస్టిగేషన్ చేస్తున్నాం. కాబట్టి నువ్వింకా యిక్కడే వుండాల్సి వుంటుంది."

"ఆర్యూ అరెస్టింగ్ మీ?" అడిగాడు రాణా వింతగా చూస్తూ.

"సర్టెన్లీ నాట్. కాని ఈ పాటికి విషయం అర్ధమై వుండాలి. పరిస్థితులు అనుమానాస్పదంగా వున్నాయి."

"నిజమే. కానీ లూసీ మాటేమిటి? యిప్పుడు నేనామె దగ్గరుండడం చాలా అవసరం."

"ఆమెకేం ఫర్వాలేదు."

"ఎక్కడుంది లూసీ?"

"ప్రస్తుతాన్కి జస్లోక్ హాస్పిటల్‌లో-అండర్ హెవీ సెడేషన్. ఆమె ఇంకా షాక్‌లో వుందనే చెప్పాలి."

"బట్....డోంట్ యూ సీ....ఆమె ప్రస్తుత పరిస్థితికి కారణం ఆ పొగమంచు .... ఆ విషమేఘం.... యిదంతా దాని రియాక్షన్...."

"అది కారణమో కాదో మేము త్వరలో తేల్చుకుంటాం. బట్ టెల్ మి సమ్‌థింగ్ మిస్టర్ రాణా! మనుషుల్ని పిచ్చివాళ్ళను చేస్తూ ఈ విషమేఘం ఊళ్ళలో పడి, తేలుతూ పోతుంటే మాకెందుకు ఫిర్యాదులు అందలేదు?" సన్నగా కోపం ధ్వనించిందా పోలీస్ అధికారి కంఠంలో—

"ఐ డోంట్ నో! బహుశా విషమేఘం మొత్తం ప్రాంతాన్నంతా కవర్ చేయడంలేదు. ఒక విషయం మర్చిపోకండి! అక్కడ చాలా బహిరంగ ప్రదేశం వుంది. అందువల్లనే యింకా ఎక్కువమంది దానికి కాంటాక్ట్ అయి వుండకపోవచ్చు! మరో ముఖ్య విషయం! విషమేఘం ప్రభావం-మనిషిమీద వెంటనే చూపించదు. మేం నిన్న ఆ విషమేఘంలో నడిచాం. మనిషి శరీరంలో మార్పు తీసుకురావడాన్కి దాన్కి కొంత టైం పట్టవచ్చు."

"కాని నువ్వు అగాధంలోంచి బైటికి వచ్చినవెంటనే పిచ్చివాడివైనట్లు చెప్పావ్?"

వెక్కిరింతగా వినబడింది క్రైంబ్రాంచ్ డిటెక్టివ్ రైనా కంఠం.

"తీవ్రమైన మోతాదులో గాస్ ప్రభావం నా మీద పడింది! నేను ఆ విచిత్రమైన గాస్‌కి బలైపోయిన మొట్టమొదటి వ్యక్తిని. ఐ వజ్ యిట్స్ ఫస్ట్ విక్టిమ్" పిడికిలి

బిగించి పేదుల్ని గుద్దాడు ఉద్రేకంగా రాణా.

"అయితే ఈ ఒక్క విషయం చెప్పు మిస్టర్ రాణా!" శాంత గంభీరస్వరంతో అన్నాడు సూపరింటెండెంట్ మెహ్రోత్రా "నువ్వు యిప్పుడు పిచ్చివాడిగా ఎందుకు లేవ్? లేక—పిచ్చివాడివేనా?"

హఠాత్తుగా ఆ గదిలో భయంకర నిశ్శబ్దం అలుము కుంది!

మూడు జతల కళ్ళు ఆతృతగా రాణా కళ్ళల్లోకి చూస్తున్నాయ్.

ముగ్గురు పోలీసు మనుషులూ అతని జవాబుకోసం ఉత్కంఠతంతో ఎదురు చూస్తున్నారు!

"లుక్ జంటిల్మెన్" హీనంగా పల్కాడు రాణా. "ఐ జస్ట్ డోంట్ నో. అ యామ్ నాటె డాక్టర్.... అయామ్ నాటె ఎ సైంటిస్ట్. బహుశా మినిస్ట్రి ఆఫ్ డిఫెన్సీ మీ ప్రశ్నకు జవాబు చెప్పవచ్చు."

ఇద్దరు క్రైంబ్రాంచ్ మనుషులూ ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు....

"వాడు యు మీన్ బై దట్?" కంగారుగా అడిగాడు మెహ్రోత్రా.

"ఖుల్నా ప్రాంతంలో మిలటరీ యిన్స్టాలేషన్స్ ఉన్నాయ్. వాళ్ళు ప్రయోగాలు చేస్తుంటారు.... ప్రమాద కరమైన ప్రయోగాలు.... దేశ రక్షణకోసం!.... వాళ్ళ దగ్గరకిపోయి జవాబులు వెతుక్కోండి!"

కోపంగా ముందుకు దూసుకువస్తున్న రైనాను చేత్తో వారించాడు మెహ్రోత్రా. "నీ ఉద్దేశం దీని కంతటికీ కారణం రక్షణశాఖే అనా? వాళ్ళే ఒక విధమైన నెర్వ

గాస్ రిలీజ్ చేశారనా?"

"ఫర్ గాడ్ సేక్! ఐ డోంట్ నో. ఆ అవకాశం ఉందని మాత్రం నేను చెబుతున్నాను."

"ఓహ్....సర్! యితని ప్రేలాపనలు మనం యింకా వినాలంటారా?" రైనా, రాణామీద కరికేంత ఉద్రేకంగా ఉన్నాడు.

"అక్కర్లేదు. నువ్వు చెప్పింది నిజమైతే మిస్టర్ రాణా, ఆ వివరాలు కూడా అతిత్వరలో తెల్సుకుంటాం. మేము నిశ్చయంగా తెల్సుకోనేదాకా నువ్వు యిక్కడే ఉండక తప్పదు."

"ఓకే....ఓకే....కాని లూసీని జాగ్రత్తగా గమనించండి!" అభ్యర్థించాడు రాణా నిస్సహాయంగా.

"షి విల్ బీ యిన్ సేఫ్ హాండ్స్ మిస్టర్ రాణా. ఐ కెన్ ప్రామిస్ యూ దట్!"

* * *

"మిస్టర్ రాణా! మీకు క్షమాపణ చెప్పుకోక తప్పదు" అన్నాడు సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్, తన టేబుల్ అవతల నిలబడ్డ రాణాని కూర్చోమని సైగ చేస్తూ.

"న్యూక్లు సంఘటన గురించి వివరాలు మీకు అంది ఉంటాయ్."

సూపరింటెండెంట్ ముఖంలో విషాద ఛాయలు కమ్ముకొన్నాయ్. ఒక క్షణంపాటు తటపటాయించి తల ఊపాడు.

రాణా అలసటగా నిట్టూర్పు విడిచాడు.

తెల్లవారుఝాము నాలుగు గంటలైంది....రాత్రి అంతా ఒకే ఒక కుర్చీ, మంచం ఉన్న ఓ చిన్న డిటె

న్షన్ రూమ్‌లో చిరాగ్గా కాలం గడిపాడు రాణా.

ఎలాగో నిద్ర తెచ్చుకుంటే అప్పుడే కాస్త కునికి పాట్లు పడుతున్న రాణాను లేవగొట్టి యే విషయం చెప్ప కుండా మెహ్రోత్రా ఆఫీసుకు తీసుకు వచ్చాడు సి.ఐ.డి. రైనా.

ఇద్దరు డిపార్టుమెంట్ మనుషులూ పూర్తిగా అలిసి పోయి ఉన్నారు. రాత్రంతా భావ్‌నగర్ పరిసర ప్రాంతాల్లోని పోలీస్ స్టేషన్‌లకు ఫోన్ కాల్స్ చేస్తూ, యేమైనా విచిత్ర సంఘటనలు జరిగాయేమో నని విచా రిస్తూ—

కాంబే పోలీస్ స్టేషన్ నుండి అందిన రిపోర్టు వారిద్దరి మతులను ఎగరగొట్టింది.

"ఏం జరిగిందో చెప్పండి" అడిగాడు రాణా.

"ముప్ఫై ఏడుగురు విద్యార్థులు గల క్లాసులో ఒకే ఒక కుర్రాడు ఫైర్ యాక్సిడెంట్ నుండి తప్పించుకో గలి గాడు. ఆ కుర్రాడు యింకా షాక్‌లో ఉన్నాడు. మొట్ట మొదట యెవరిదో పొరబాటువల్ల మంట యేర్పడి ప్రమాదం సంభవించిందని భావించాం.... కాని తర్వాత.... ఆ కుర్రాడు కొన్ని విచిత్రమైన విషయాలు చెప్పాడు." మెహ్రోత్రా రివాల్వింగ్ ఛేర్‌లో రాణా కెదురుగా తిరి గాడు.

"మొట్టమొదట డాక్టర్లు కూడా ఆ కుర్రాడు అగ్ని ప్రమాదంచూసి భయపడిపోయి హిస్టీరికల్‌గా మాట్లాడు తున్నాడని భావించారు. కాని మృతదేహాలకు సంబం ధించిన కొన్ని విచిత్ర విశేషాలు బైటపడగానే కుర్రాడి స్టేట్‌మెంట్‌కి ప్రాధాన్యత యివ్వాల్సి వచ్చింది."

ఇన్‌స్పెక్టర్ రైనా కలగజేసుకుంటూ అన్నాడు.

"చాలా శరీరాలు నగ్నంగా వున్నాయి. వాళ్ళు ధరించిన దుస్తులు మంటలకు తగలబడిపోయినా, కనీసం కొన్ని గుడ్డముక్కలు లేదా కొన్ని నూలుపోగులు శరీరాన్ని అంటుకొని ఉండాలి. అవి లేవ్."

చిన్నగా దగ్గి, మెహ్రోత్రా కంటిన్యూ చేశాడు. "ఉద్దేశపూర్వకంగా ఈ అగ్ని ప్రమాదం జరిగినట్లు తోస్తోంది మిస్టర్ రాణా! ఓ వ్యక్తి మృతదేహం వద్ద ఒక పెట్రోల్ డబ్బా దొరికింది. ఆ వ్యక్తికి ఒక చేయి లేదు. కాలిపోయిన ఆ వ్యక్తి శరీరం ఓ డిప్యూటీ హెడ్మాస్టర్ దిగా గుర్తించబడింది. పేరు పరంజ్యోతి."

రాణా కడుపులో ఏదో కెలికినట్లయింది.

తను యీ ప్రమాదాన్ని నివారించ గలిగేవా డేమో?....

"ఈ కుర్రాడి ద్వారా సంపాదించబడిన లోకల్ పోలీస్ యిన్ఫర్మేషన్ ప్రకారం—ఈ సంఘటన—డ్రిల్లు క్లాసులో మొదలైంది. మధ్యలో హఠాత్తుగా విద్యార్థులు డ్రిల్లు మాస్టారుపై విరుచుకు పడ్డారు. మూకఉమ్మడిగా అతన్ని చుట్టుముట్టి చిత్రహింసలు చేశారు! అతను స్పృహ కోల్పోయాడు—తర్వాత రెండో టీచర్—పరంజ్యోతి లోనికి వచ్చాడట. అప్పుడు అతనిపై ఎటాక్ చేశారు విద్యార్థులు. ఆ కుర్రాడు కథ చెబుతూ యీ పాయింట్ దగ్గర కొచ్చేసరికీ హిస్టరీకల్ గా మారుతున్నాడు. తర్వాత యేం జరిగిందో నిర్ధారణగా తెలీడం లేదు. కాని ఈ కుర్రాడు తప్ప మిగతా పిల్లలందరూ పిచ్చి వాళ్ళుగా, రెచ్చిపోయిన జంతువుల్లా, రాక్షసుల్లా ప్రవర్తించారని తెలుస్తోంది...."

"కుర్రాడు తప్ప—వాట్ డు యు మీన్ బై ఇట్?

అతను పిచ్చివాడు కాలేదా?"

"డాక్టర్లు అలా అనుకోవడంలేదు. దారుణమైన, పైశాచికమైన ఆ సంఘటన చూసి తట్టుకోలేక ఏర్పడిన షాక్ అంటున్నారు.

హిస్టీరికల్—ఎస్—కాని పిచ్చివాడు మాత్రం కాలేదు. డాక్టర్లు ఘంటాపదంగా చెబుతున్నారు. మా ఉద్దేశం కూడా అదే."

"మీ ఉద్దేశానికి ఆధారం?"

"నువ్వు చెప్పిన పొగమంచు కథకీ, దీనికీ సంబంధం ఉన్నట్లు నిర్ధారణ కావడం."

మెహ్రోత్రా టేబుల్ అంచు వారగా కూర్చున్న ఇన్‌స్పెక్టర్ రైనా అందుకొన్నాడు. "విద్యార్థులు స్కూలు బస్సుమీద విహారయాత్రకు బయలుదేరిన రోజున యీ కుర్రవాడు అనారోగ్యంగా ఉన్నాడు. హాస్టల్ మాట్రన్—చలిజ్వరంతో బాధపడుతున్న అతన్ని—పంపడానికి ఒప్పుకోలేదు.

నిన్నటి రోజున అతను డ్రిల్లు క్లాసుకు అటెండ్ అయ్యాడు. కాని అప్పుడే జ్వరం తగ్గుముఖం పడుతుండడం వల్ల డ్రిల్లులో పాల్గోలేదు. దూరంగా కూర్చున్నాడు స్నేహితుల్ని చూస్తూ. అదృష్టవశాత్తూ అతన్ని మిగతా విద్యార్థులు గమనించ లేదు—పట్టించుకో లేదు—కాని అతను వారు అకారణంగా పైశాచికంగా కొట్టుకు చావడం గమనిస్తూనే ఉన్నాడుట.... పూర్ లిటిల్ లాడ్!"

కొద్ది క్షణాలు ఆ గదిలో నిశ్శబ్దం అలుముకొంది.

"యిప్పుడు యేం చేయదల్చుకొన్నారు?" అడిగాడు రాణా.

"ఆ పొగమంచు వేరెబౌట్స్‌ని ట్రేస్ చేయడం కోసం ప్రయత్నిస్తున్నాం. రాత్రంతా ఆ ఏరియా చుట్టు ప్రక్కల స్టేషన్లతో చర్చించాం. ఏమన్నా అసాధరణ సంఘటనలు జరిగితే వెంటనే తెలియపర్చమన్నాం" మెహ్రోత్రా టేబుల్ మీద ఉన్న కాగితాల్ని చేత్తో పట్టుకు చూపించాడు. "చాలా రిపోర్టు లందాయ్. ఎన్నో అసాధారణ సంఘటనలు జరిగాయ్. కాని అలాంటివి జరుగుతూనే ఉంటాయ్. అసలు సమస్య పొగమంచుకు అంటగట్టగల సంఘటనలు విడదీయడం."

"నా మీద నమ్మకం కల్గిందా?"

"యిప్పటికి—నీ మీద అపమ్మకం లేదని మాత్రం చెప్పగలం. మాకు యింకా ఎవిడెన్స్ కావాలి."

"ఇంకా ఎవిడెన్స్ కావాలా?"

బ్రద్దలవబోతున్న బాంబులా చూశాడు రాణా.

"కొంత ఎవిడెన్స్ లేకపోలేదు. కొద్ది రోజుల క్రితం జరిగిన గొడ్డలి హత్యలు—కాలా అనబడే చిన్నసైజు దొంగ—మాజీ మిలటరీ వ్యక్తి విశ్వనాథ్ అనే అతన్ని, అతని భార్యనీ, యింట్లో ఉండే మరో యిద్దరు స్త్రీలనీ హతమార్చాడు. తర్వాత అదే ఆయుధంతో తనను, తానే చంపుకున్నాడు. అన్ని మూకుమ్మడి హత్యలు చేయవల్సినంత కక్ష—ఆ హంతకుడికి లేదు. అదే ఏరియాలో, ఓ రైతుని, అతని పెంపుడు గేదెలు ప్రాణం పోయేదాకా పొడిచి పొడిచి చంపాయి.

ఓ పూజారి—ఆలయంలోకి వచ్చిన భక్తులను బూతులు తిడుతూ శూలంతో చంపబోయాడు. తర్వాత తనను తానే చంపుకున్నాడు. యింకా చాలా సంఘటనలు జరిగాయి. కాని అవి పీటికంటే చిన్న సంఘటనలుగా

పేర్కొనాలి. మేం వివరంగా మరికొన్ని రిపోర్ట్స్ పంపమని అడిగాం. ప్రస్తుతం ఆ విష మేఘం ఆచూకీ కోసం గాలిస్తున్నాం."

"అది ఎక్కడో ఉండొచ్చు."

"మేం పరిశోధించి త్వరలో లొకేట్ చేస్తాం"

"ఆల్ రైట్. వాటీజ్ యువర్ నెక్స్ట్ స్టెప్?"

"కేసులకి సంబంధించిన ఆధారాలన్నీ క్రోడీకరిస్తాం. తర్వాత ఎవిడెన్స్ అంతా హోమ్ సెక్రెటరీకి పంపే ప్రయత్నం, పోలీస్ కమీషనర్ ద్వారా జరుగుతుంది."

"ఈ లోపుగా ఈ రాష్ట్రంలో సగంమంది పిచ్చివాళ్ళు అవుతారు."

"నో మిస్టర్ రాణా! వేగంగా పని చేయాలనే మా ఆరాటం" సూపరింటెండెంట్ ముందుకి వంగాడు. "హోమ్ సెక్రెటరీ ముందుకు వెళ్ళేటప్పుడు పరిపూర్ణమైన సాక్ష్యాధారాలతో వెళ్ళాలి. ఐ నీడ్ ఎ క్లియర్ కేస్."

"క్లియర్ కేస్? అంటే—యింకా దారుణాలు జరగాలని మీరు కోరుకుంటున్నారు. అవునా?"

"........నిజం చెప్పాలంటే........అవును!"

నివ్వెరపోతూ నోరు తెరుచుకుండిపోయాడు రాణా.

"....కానీ దానర్థం నేను ఏమీ జాగ్రత్తలు తీసుకోవడం లేదని కాదు" కంగారుగా చెప్పాడు మెహ్రోత్రా. "తూర్పు ప్రాంతంలో పోలీసు బలగాన్ని అలెర్ట్ చేశాం."

"ఏమిచ్చారు ఇన్‌స్ట్రక్షన్స్?"

"ప్రమాదకరమైన విష మేఘం ఉనికి గురించి పరిశోధించమని చెప్పాం. విష మేఘం ప్రభావంవల్ల ఏర్పడే చిన్నా, పెద్దా సంఘటనల్లో వెంటనే కలగజేసుకోమని

ఆర్డర్స్ పంపాం."

"ప్రధాన చర్య అదికాదు—ప్రజలను ముందుగా ఈ ప్రమాదాన్ని గురించి హెచ్చరించాలి. ఆ విషమేఘం దారినుండి తప్పుకోమని చెప్పాలి."

"మిస్టర్ రాణా! మొట్టమొదటి సారిగా యీ విష మేఘం అంటూ ఒకటి వుందని మేము నిర్ధారించుకోవాలి. తర్వాత పరంపరలుగా ఏర్పడుతున్న ఈ దుర్ఘటనలకు ఆ విషమేఘమే కారణమని మేము రుజువు చేయాలి."

"కాని నా మాటలను నమ్మరని యిందాక మీరు చెప్పారు."

"నేను నమ్మడం ముఖ్యంకాదు మిస్టర్ రాణా! నా పైఅధికారులను నేను నమ్మించడం ముఖ్యం. నువ్వు చెప్పినట్లా చేసే అధికారం నాకు లేదు."

"సో, మరికొంతమంది ప్రజలు బలికావడం కోసం మీరు యెదురు చూస్తున్నారన్న మాట."

"మరికొద్ది గంటల తర్వాత—ఆ పొగమంచు, లేదా విషమేఘం—మరికొంత మంది ప్రజలపై తన ప్రభావం చూపుతుంది. అప్పుడు మాకు మరికొంత సాక్ష్యం లభిస్తుంది. ఇప్పట్లో మేం చేయగలిగిందేమీ లేదు."

వ్యంగ్యంగా అన్నాడు రాణా. "పిచ్చిరేగిన జనాన్ని లాకప్‌లో తోయడం తప్ప."

"చిన్నపిల్లాడిలా మాట్లాడకు మిస్టర్ రాణా! మేం యేం చేయాలని నీ వుద్దేశం?

రేడియోలో బ్రాడ్‌కాస్టు చేయించమంటావా, ఈ పొగమంచుని ఎవరుచూసినా దగ్గరలోవున్న పోలీస్ స్టేషనుకు వెంటనే రిపోర్టు చేయమని? అలాచేస్తే ఏం జరుగుతుందో తెల్సా.

ఒకటి—మా డిపార్టుమెంట్ ప్రజల దృష్టిలో నవ్వుల పాలవుతుంది.

రెండు—ఈ ప్రచారం కొంతమంది ప్రజానీకంలో భయాందోళనలు రేకెత్తిస్తుంది.

కాని ఏ లక్ష్యంతో?

ఆ పొగమంచు ఈ పాటికి విడిపోయి, మాయమయి పోయి వుండొచ్చు. లేకపోతే — దాని ప్రభావాన్ని కోల్పోయి వుంటే?

ఆ పొగమంచుకీ — జరిగిన దుర్ఘటనలకీ సంబంధం లేదని 'తర్వాత' రుజువయితే?

ప్రజల్లో అనవసర భయాందోళనలు రేకెత్తించిన నేరానికి మేం ఏమవుతాం?

పార్లమెంటులో ప్రతిపక్షం ఏమంటుంది?

మా ఉద్యోగాలు ఏమవుతాయి?

మా పరువు ప్రతిష్టలు....డిపార్టుమెంట్ పరువు ప్రతిష్టలు ఏ గంగలో కలుస్తాయి?

వీటన్నిటికీ నువ్వు బాధ్యత వహించగలవా?" బరువుగా వూపిరి పీలుస్తూ ఆగిపోయాడు సూపరింటెండెంటు మెహ్రోత్రా.

రెండు నిమిషాలపాటు ఆ గదిలో మళ్ళీ నిశ్శబ్దం అలుముకుంది. "వెరీవెల్" మోకాళ్ళమీద మోచేతులు ఆన్చి చేతులు రుద్దుకుంటూ అన్నాడు రాణా. "నే నిప్పుడు లూసీని చూడాలి. ఐ వాంట్ టు గో టు హాస్పిటల్."

"అఫ్‌కోర్స్" నవ్వాడు మెహ్రోత్రా. "కాని నువ్వు యిక్కడ వుండటం మంచిది."

"వాట్ ది హెల్...."

"నువ్వు యిక్కడవుంటే నాకు కొన్ని విషయాల్లో

సహాయపడగలవ్ మిస్టర్ రాణా! డిటెక్టివ్ యిన్స్పెక్టర్ రైనా హాస్పిటల్‌కి ఫోన్ చేసి కనుక్కుంటాడు లూసీ కండిషన్ గూర్చి. ఇప్పుడు టైం ఎంతయిందో మర్చిపోతున్నావ్. ఈ సమయంలో విజిటర్స్‌నెవ్వరినీ హాస్పిటల్ అనుమతించదు."

సూపరింటెండెంట్ సైగ నందుకుని రైనా ఆ గదిలోంచి మాయమయ్యాడు.

"సో, మేం ఏ పరిస్థితుల్లో వున్నామో నీకీ పాటికి అర్థమయి వుండాలి" సంభాషణ కొనసాగిస్తూ శాంతంగా పలికాడు మెహ్రోత్రా.

"ఖచ్చితంగా నాకేమీ అర్థంకాలేదు." చిరాగ్గా బదులు చెప్పాడు రాణా. కొద్ది క్షణాల్లో ఆ గదిలోకి వచ్చాడు ఇన్స్పెక్టర్ రైనా.

అతని ముఖం సీరియస్‌గా వుంది.

రాణా ఉనికిని నిర్లక్ష్యం చేస్తూ, రైనా టేబుల్ చుట్టు తిరిగి మెహ్రోత్రా చెవిలో రహస్యంగా గుసగుసలాడాడు.

"ఓహ్! ఫర్ గాడ్ సేక్!" అవమానంతో, అసహనంతో చివాలున పైకిలేచాడు రాణా.

"ఇట్సాల్ రైట్ మిస్టర్ రాణా!" రాణా సహనాన్ని వేడెక్కించడం యిష్టంలేక వేగంగా చెప్పాడు మెహ్రోత్రా. "రైనా ఫోన్ చేశాడు. కొద్దిగంటల క్రితమే లూసీని విడుదల చేసినట్లు హాస్పిటల్ అథారిటీస్ చెప్పాయి. పేషెంట్ విడుదల ఆమె తండ్రి సంరక్షణలో జరిగింది."

రాణా పిచ్చివాడిలా చూసాడు.

మెహ్రోత్రా అన్నాడు ఇబ్బందిగా. "అయాం సారీ. బహుశా వారు చేయగలిగిందేమీ లేదు. లూసీ దాదాపు

కోలుకున్నట్లు కనబడిందట. హాస్పిటల్ వాళ్ళకు యిష్టం లేకపోయినా, ఆమె తండ్రి యింటికి తీసుకుపోతానని పట్టు పట్టాడట. కొద్దిరోజులు యింకా తమ అబ్జర్వేషనులో వుంచాలని అనుకున్నారట. కాని హాస్పిటల్ వాళ్ళు అంతకుమించి బలవంత పెట్టలేరుగా...."

* * *

నిర్మానుష్యంగా వున్న బొంబాయి వీధుల్లోంచి నగర శివార్లలోకి ఆ తెల్లవారు జామున ఓ పోలీస్ కారు రాకెట్ లాగా దూసుకుపోతోంది.

తెలుపు, నీలం రంగుల్లోవున్న ఆ అంబాసిడార్ కార్లో వున్న ముగ్గురు వ్యక్తులు మౌనంగా, గంభీరముద్రలో ఎవరి ఆలోచనల్లో వారు నిమగ్నమై వున్నారు.

రాణా తలుపువారగా కూర్చుని వున్నాడు, భయాందోళనతో—తదేకంగా బయటికి చూస్తూ.

లూసీ నిజంగా కోలుకుందా?

విషమేఘం ప్రభావంనుండి అప్పుడే ఆమె తప్పించుకో గలిగిందా? ఆమె నిజంగా పొగమంచులో ఎక్కువగా యెక్స్పోజ్ కాలేదు.

అదొక్కటే ధైర్యం రాణాకి.

క్రయింబ్రాంచి యిన్స్పెక్టర్ రైనా, వెనకసీట్లో రాణా పక్కగా కూర్చునివున్నాడు.

అతనిలో ఒకవైపు అపనమ్మకం—మరొకవైపు వుత్సుకత. ఈ రెండిటితో కూడిన ఆలోచనలు సమస్యలుగా మారి అతని మస్తిష్కాన్ని దొలిచేస్తున్నాయి.

రాణా అవసరంగా హడావుడి చేస్తున్నాడా?

మొత్తం కథంతా అసహజంగానే కనబడుతోంది.

పొగమంచేమిటి?

మనిషి పిచ్చివాడుగా మారడమేమిటి?.

కొంతసేపు తర్వాత ఆలోచనల్లోంచి ఉలిక్కిపడి వాచీ చూసుకున్నాడు రైనా.

**5-10.**

గుడ్ గాడ్! తను పూర్తిగా అలిసిపోయాడు. రాత్రి అంతా నిద్రలేదు—ఈ కాశీమజిలీ కేసు గురించి.

"డ్రయివర్! ఎడంవేపు తిప్పి ముందుకు పోనియ్. ఎక్కడాపాలో చెప్తాను" అన్నాడు రాణా.

పోలీస్ కార్ నిర్మానుష్యంగావున్న వీధిలోకి ప్రవేశించింది.

రాణా డ్రయివర్ భుజాన్ని తట్టాడు, లూసీ యిల్లు చూడగానే.

"అదే" చూపించాడు.

అది పెద్దమేడ.

బయట చిన్నతోట—ఐరన్ గేడ్.

లూసీ తండ్రి హెన్రీకస్—ఆంగ్లో యిండియన్.

పారిశ్రామిక వేత్త. లక్షలకు అధిపతి!

రాణా—హెన్రీకస్ చాల తక్కువసార్లు కలుసుకున్నారు.

ఒకరిపై ఒకరికున్న అయిష్టత వార్ని దగ్గరకు కలుపలేదు.

"స్టుపిడ్ ఓల్డు బగర్" కసిగా తిట్టుకున్నాడు రాణా. విషమేఘం గురించి ఆ ముసలాడికేం తెలుసు?

తననుంచి దూరం చేయడానికా ఎంతో ప్రేమ కురిపించి హాస్పిటల్ నుంచి ఆమెను తీసుకుపోయింది?

నిశ్చల వాతావరణంలో మేడ-తలుపులు చూశాడు రాణా, తలపైకెత్తి.

ఎక్కడా అలికిడిలేదు.

నిర్మానుష్యం—

నిస్తబ్దత—

"ఇంట్లో వాళ్ళంతా నిద్రలో వున్నట్లు కనబడుతోంది" వ్యంగ్యంగా అన్నాడు రైనా.

రాణా అతనివైపు నిర్లక్ష్యంగా చూస్తూ తలుపు తెర్చుకుని కారు దిగాడు.

"జోషి! నువ్విక్కడే వుండు!"

అతని వెనగ్గా డ్రయివర్‌కి చెప్పిన రైనా మాటలు వినబడ్డాయ్.

రాణా గేటువద్దకు నడుచుకుంటూ వెళ్ళాడు.

పెద్దపెద్ద అంగలేసుకుంటూ రైనా అతన్ని చేరుకున్నాడు.

"నువ్వు 'అనవసరంగా' కంగారుపడి యెటూకాని ఈ సమయంలో ఇంట్లో వాళ్ళని లేపడం బాగుండదేమో" గొణిగేడు రైనా.

"లేపకపోతే నాకు బాగోదు." గేటు తెరచుకొని తెల్లని ముఖద్వారాన్ని చేరుకున్నాడు రాణా.

గడియపెట్టి లేకుండా, తలుపులు దగ్గరగా వేసివుండడము గమనించి రాణా కంగారు పడ్డాడు.

అతని గుండెలు దడదడ లాడాయ్....

• • •

ఊపిరి బిగబట్టాడు రాణా.

తలుపు హేండిల్ మీద చెయ్యివేసి మెల్లగా లోనికి తోసాడు.

టేబుల్ లైట్ ఫోకసింగ్ ఓ వారగా పడుతోంది.

బెడ్ మీద ఓ ఆకారం పడుకుని వుంది.

బుగ్గలు లోతుకుపోయి, తెల్లగా పాలిపోయిన ముఖం! ఇంటి పై కప్పుకేసి చూస్తున్న రెండుకళ్ళు....

ఇదే వారికి కనబడిన దృశ్యం.

"హెన్రీకస్!" పరిగెట్టాడు రాణా బెడ్ వైపు.

కళావిహీనంగా వుంది అతని ముఖం. రెండు కళ్ళలో తీవ్రమయిన భయాందోళనలు వ్యక్తమౌతున్నాయి.

రాణాను చూసి అతను పెదవులు కదపబోయాడు.

ఇన్స్పెక్టర్ రైనా, రాణాను తోసుకుంటూ ముందు కొచ్చి హెన్రీకస్ ముందు నిలబడ్డాడు. "సర్! ఏమైంది? ఆర్ యూ ఇంజర్డ్?" ఆత్రంగా ప్రశ్నించాడు.

ఒక్కక్షణం హెన్రీకస్ చూపులు రైనావైపు నిల్చిపోయి తిరిగి ప్రక్కకు మళ్ళాయి రాణావైపు.

"ను....నువ్వే చేయించావ్" హీనస్వరంతో పలికింది హెన్రీకస్ గొంతు. "ఆమె.... చేత....ను....నువ్వే.... ఈ పని చేయించావ్...."

రాణాకు ఏమ్మాట్లాడడానికీ నోరు పెగలడం లేదు.

అతని మస్తిష్కంలో రకరకాల ఆలోచనలు పాము పిల్లలా కదుల్తోన్నాయి.

వృద్ధుడి మీదకు వంగాడు రాణా. "లూసీ ఎక్కడ?"

"ఎందుకు....ఎందుకు లూసీ యిలా చేసింది?" హెన్రీకస్ చూపులు క్రిందికి వాలాయ్....అతని పొట్టవైపు.

అతన్ని కప్పివున్న దుప్పటిని తటాలున వెనక్కి లాగేడు రైనా.

అంతే!

ఇద్దరి ఊపిరీ స్తంభించిపోయింది!

ఒక కత్తెర హెన్రీకస్ పొట్టలో దిగబడి వుంది.

అతని పైజామా, బెడ్ షీట్, పరుపు....రక్తంతో

తడిసిపోయి వున్నాయి.

"ఓహ్ మైగాడ్ .... మైగాడ్ ...." ఆ దారుణ దృశ్యాన్ని చూడలేక, తల ప్రక్కకు తిప్పుకున్నాడు రైనా.

అతను రాణావైపు గిరుక్కున తిరిగాడు.

"రాణా! నేను వెంటనే జోషితో చెబుతాను వైర్ లెస్‌లో అంబులెన్స్ పిలవమని. మనం త్వరపడితే ఈయన ప్రాణాలు కాపాడేందుకు అవకాశం వుంటుంది. తలకింద ఎత్తుగా తలగడాలు పెట్టు దగ్గువచ్చి నెత్తురు కక్కకుండా. కత్తెర మాత్రం ముట్టుకోవద్దు. డోంట్ ట్రై టూ పుల్ ఇట్ ఔట్." తలుపుగుండా బయటకు పరిగెత్తాడు రైనా.

మెట్లమీద మూడేసి మెట్లకో అడుగు చొప్పున దూకుతున్న చప్పుడు వినిపిస్తోంది.

రాణా, దుప్పటిని తిరిగి గాయం మీద కప్పాడు.

అతనికి కడుపులో దేవుతున్నట్లుంది.

గాయాన్ని చూసి కాదు.

లూసీ—దారుణంగా తన తండ్రి పొట్టలో కత్తెర నాటినందుకు!

హెన్రీకస్ మాట్లాడడానికి ప్రయత్నిస్తుండటం గమనించి రాణా అతని మీదకు వంగాడు.

"ఎ....ఎందుకు యిలా చేసింది? అదంటే నాకెంతో ప్రేమ.... దానికి తెలుసా సంగతి."

"ఆమె దీనికెంత మాత్రం బాధ్యురాలు కాదు" తగ్గు స్వరంతో అన్నాడు రాణా, కంఠం రెచ్చిస్తే అది వృద్ధుడికి మరింత ప్రమాదమని భావించి.

"లూసీ ఓ విధమయిన విషవాయువుకి కాంటాక్ట

అయింది. అందువల్ల ఆమె మెదడు చెదరిపోయింది. దట్సాల్! బిలీవ్ మీ మిస్టర్ హెన్రీకస్!"

హెన్రీకస్ కళ్ళు ఒక్కసారి విచిత్రంగా చూసాయ్ విషయం అర్థం చేసుకుంటున్నట్లుగా.

ఆ మాటలు అతనికి అర్థంకాలేదు. కాని బాధ ఉపశమించినట్లైంది అతనికి.

'లూసీ మానసిక పరిస్థితి బాగోక తనను చంపబోయింది. అంతా క్షణికోద్రేకం' అన్న అవగాహన అతన్ని సంతృప్తి పరిచింది. అతను మళ్ళీ చెప్పనారంభించాడు. "నిన్న తీసుకొచ్చాను దాన్ని యింటికి హాస్పిటల్ నుంచి.... వాళ్లు చెప్పారు నువ్వామెను.... కొట్టావని...." అతని హీనస్వరంలో కోపం స్పష్టంగా ధ్వనించింది.

"నో, నే నామెను ఏమీ చేయలేదు." రాణా ఒప్పించడానికి ప్రయత్నిస్తూ అన్నాడు. "దానికంతటికీ కారణం ఆ పాయిజనస్ గాస్."

మేడక్రింది నుంచి కెవ్వన వినబడింది.

పొలికేక!

అదిరిపడి లేచాడు రాణా.

అది పురుషుడి ఆర్తనాదం!

ఇన్‌స్పెక్టర్ రైనా!?

మృత్యుముఖంలో వున్న వృద్ధుడ్ని వదలిపెట్టి - మెరుపులా బయటకి పరిగెత్తాడు రాణా!

బల్లలు.... కుర్చీలు.... విరిగి పడుతున్న శబ్దం.

కేకలు....

రీడింగ్ రూమ్ నుంచి వస్తున్నాయ్....

తారాజువ్వలా గదిముందుకు పరిగెట్టి దబాలున తలుపు తోసాడు రాణా.

అంతే!

కాళ్ళు నేలకు అతుక్కుపోయినట్లు నిలబడిపోయాడు రాణా.

ఇన్‌స్పెక్టర్ రైనా నేలమీద బోర్లా పడివున్నాడు. అతని నుదురుచిట్లి రక్తం కారుతోంది.

లూసీ అతని ఎదురుగా నిలబడి వుంది ఉక్రోషంగా చూస్తూ, చేతిలో పగిలిన గాజు పలకతో.

ఆ అద్దానికి సంబంధించిన మిగతా గాజు ముక్కలు ఆమె కాళ్ళచుట్టూ చిందర వందరగా పడివున్నాయి.

అద్దం పలకవున్న ఆమెచేయి పైకి లేచింది. రైనా మెడ వెనుక భాగంలో దిగేందుకు.

"లూసీ!"

అరిచాడు రాణా.

ఠక్కున ఆగిపోయి, తల త్రిప్పి చూసిందామె.

ఒక్కక్షణం అతన్ని గుర్తించినట్లుగా ఆమె భావాలు మారాయి....

నవ్వుతూ ఆమె రాణావైపు నడిచింది.

రాణా ఆగి, చేయి చాచాడు. "లూసీ!" పిల్చాడు ప్రేమగా.

నవ్వుతున్న ముఖం, హఠాత్తుగా అసహ్యంగా మారిపోగా, గుర్రుగా శబ్దంచేస్తూ అతనివైపు ఛెంగున దూకిందామె చేతిలోని ఆయుధాన్ని, అతని ముఖంపై దింపుతూ.

రాణా చటుక్కున వంగి, మోచేత్తో ఆమె నడుం మీద బలంగా పొడిచాడు.

గత అనుభవాన్నిబట్టి రాణాకు తెల్సు—బలం ఉప

యోగించకుండా లూసీ లొంగదని.

అరచేయి తెగి రక్తం ఓడుతున్న చేత్తో, ఆమె గాజు ముక్కను పట్టుకుని, గోడవద్ద నుండి రెచ్చిపోయిన పులిలా దూకింది—రాణామీదకు.

సర్రున గీసుకుంది రాణా బుగ్గమీద—గాజు పలక. రక్తం ఉబుకుతూ, మెరుపులా యేర్పడింది సన్నని చార చర్మాన్ని భగ్గున మండిస్తూ. రాణా ఉద్రేకంగా కదిలాడు. ఆమె కుడిచేతిని గట్టిగా పట్టుకుని వెనక్కి విరుస్తూ ఛెళ్ళున చరిచాడు ముఖంమీద.

బాలన్స్ తప్పి తూలిపడింది లూసీ.

ఆమె చేయిమీద ఒత్తిడి ఎక్కువ చేశాడు రాణా.

కీచుగా అరుస్తూ—గాజు పలక వదిలేసింది లూసీ.

రెండు చేతుల్తో ఆమెను పైకి ఎత్తుతూ, ఆమె చేతులు వెనక్కి విరిచి పట్టుకున్నాడు రాణా.

లూసీ కేకలు పెడుతోంది, గింజుకుంటూ....

రాణా యెలాంటి దయాదాక్షిణ్యాలు చూపలేదు.

ఇన్‌స్పెక్టర్ రైనా తూలుకుంటూ లేచి నిలబడి, తల విదిలించుకొని ఆ దృశ్యాన్ని విచిత్రంగా చూస్తున్నాడు.

"గుడ్ గాడ్! నీ మాటలు నమ్మనందుకు యిప్పుడు ఆశ్చర్యపోతున్నాను."

"రాతిబొమ్మలా అలా నిలబడిపోకు!" అర్చాడు రాణా "కట్టడానికి ఏమైనా పట్రా."

గుమ్మంలోంచి అదృశ్యమై, రెండు క్షణాల్లో తిరిగి ప్రత్యక్షమయ్యాడు రైనా, చేతిలోని కర్టెన్ తాడుతో.

పోలీస్ కార్‌—డ్రైవర్ జోషీ ఈలోగా అక్కడ ప్రత్యక్షమయ్యాడు. "అంబులెన్స్ రెండు నిముషాల్లో

యిక్కడ వుంటుంది సార్!" రైనాకు చెప్పాడు ఎదురుగా దృశ్యాన్ని—విచిత్రంగా చూస్తూ.

"రైట్, మేడమీద గదిలో ఓ వ్యక్తి సీరియస్ కండిషన్‌లో ఉన్నాడు. నువ్వతన్ని చూస్తూ ఉండు" ఇన్‌స్పెక్టర్ రైనా బాధగా మెడ రుద్దుకుంటూ అన్నాడు.

"అయామె బ్లడీ ఫూల్!" మూల్గాడు రైనా. "డ్రైవర్‌తో మాట్లాడి తిరిగి యింట్లోకి వస్తుండగా స్టడీ రూమ్ తలుపు మూసుకోడం గమనించాను. బహుశా మనం కార్లో వచ్చి బయట ఆగగానే ఆమె లోపల దాక్కుని ఉండాలి. నేను మళ్ళీ లోపలికి వచ్చినప్పుడు ఆమె బయటకు రాబోతూ తిరిగి దాక్కుంది."

"ఏమయింది?" అడిగాడు రాణా, లూసీ చేతులు ప్లాస్టిక్ తాడుతో బంధించి, ఆమెను సోఫాలో కూర్చోబెడుతూ.

"స్టడీ రూమ్‌లోకి పరిగెట్టాను. హఠాత్తుగా తగిలింది దెబ్బ. చేతిలో అద్దం పలకతో నా కోసం ఎదురుచూస్తూ తలుపు వెనక దాక్కుందని నాకు తెలియదు. నాకు నేలమీద పడ్డం మాత్రమే గుర్తుంది. ఒక స్త్రీకి యింత బలం ఉంటుందని తెలీదు. సైతాన్‌కీ బచ్చీ...."

"వాచ్ యువర్ మౌత్ రైనా!" ఉద్రేకంగా అన్నాడు రాణా.

లూసీ ముఖాన్ని చేతుల్లోకి తీసుకుంటూ ఆమె ముందు మోకాళ్ళమీద కూర్చున్నాడు రాణా.

"లూసీ కెన్ యూ హియర్ మీ?" బెంగగా అడిగాడు రాణా "కెన్ యు అండర్‌స్టాండ్ మీ?"

ఆమె తల తిప్పి అతని ముఖంలోకి సూటిగా చూసింది, చాలాసేపు.

"బాస్టర్డ్" అన్నదామె.

చెప్పు తీసుకుని ఛెళ్ళున కొట్టినట్టయింది రాణాకి.

ఆమె ముక్తసరిగా ఆ మాట పలికిన విధానానికి మరీ బాధపడ్డాడు రాణా.

"ఆమె నిన్ను గుర్తించలేదు రాణా! కాంట్ యూ సీ దట్?" అన్నాడు రైనా ఓదార్పుగా.

"లేదు. ఆమె నన్ను గుర్తించలేదు" రాణా ముఖంలో మబ్బులు కమ్మాయి. "అసలు ఎప్పటికైనా గుర్తిస్తుందా అన్నదే నా అనుమానం."

* * *

ఈసారి రాణా, లూసీ వెంట జస్లోక్ హాస్పిటల్ కి చేరుకున్నాడు. ఆమె తండ్రి అంబులెన్స్‌లో—దగ్గరగా ఉండడంచేత మాతుంగాలోని సియాన్ హాస్పిటల్ కి తరలించబడ్డాడు.

అంతకు ముందు లూసీని ట్రీట్ చేసిన డాక్టర్‌తో ఆత్రుతగా మాట్లాడుతూన్న రాణాను అక్కడే వదిలిపెట్టి, ఇన్‌స్పెక్టర్ రైనా హెడ్‌క్వార్టర్స్‌కి వెళ్ళిపోయాడు, జరిగిన విషయం రిపోర్ట్ చేసేందుకు.

అప్పటికే గందరగోళంతో అట్టుడికిపోతోంది పోలీస్ హెడ్‌క్వార్టర్స్!!

నెమ్మదిగా వార్త సోకింది రైనా చెవులకి.

రైనా గాభరాగా, మెహ్రోత్రా ఆఫీసులోకి పరిగెట్టాడు.

అతను విన్న వార్త అక్కడ నిర్ధారణ చేయబడింది! పోలీస్ సూపరింటెండెంట్ మెహ్రోత్రా-వెంటనే శైలు దేరి ఉన్నపాటుగా రాణాను హెడ్‌క్వార్టర్స్‌కి తీసుకు రావాల్సిందిగా ఆదేశించాడు, రైనాని. (సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ము ఖ చి త్రా ల కు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగడం సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## సైకిలు దొంగ

జేబులు తడుముకున్నాను నేను. రూపాయినోటు తగిలింది. రేవు తలుచుకుంటే భయమేసింది నాకు.

ఏదో చిన్న దొంగతనం చేస్తేగాని రోజు గడిచేలా లేదు.

ఆలోచించాను. ఎలా?

ఎదురుగా చిన్న పెంకుటిల్లు.

రాత్రి పదకొండు గంటలు కావస్తున్నది.

రోడ్డుమీద జనసంచారం పెద్దగా లేదు.

అతి ప్రయత్నంమీద వీధితలుపు తెరవగలిగాను.

అంతా చీకటిగా వుంది.

ప్రక్క గదిలోనుండి మాటలు గుసగుసగా వినిపించి ఆగిపోయాను. తలుపు రంధ్రంద్వారా లోపలికి చూశాను.

భార్యాభర్తలనుకుంటా....మాంచి శృంగార ఘట్టంలో వున్నారు. ఇది సమయం కాదని వెనుదిరిగాను.

చీకట్లో చేతికి ఏదో తగిలింది.

సైకిలు....తీసుకెళ్ళి రెండ్రోజులాగి అమ్మితే ఓ మూడు వందలు రావచ్చు....వుషారొచ్చింది నాకు.

సైకిలును జాగ్రత్తగా బయటకు ఎత్తుకొని వచ్చాను. తలుపు జారవేసి సైకిలును నడిపించబోయేను. తాళంవేసుంది

....ఎంతో ప్రయత్నం చేసేను తీద్దామని....రాలేదు....

దగ్గర్లో రెండుమూడు సైకిళ్ళ షాపులు తెరచివున్నాయి.

కాని....వీళ్ళతో తాళం తీయించడం... అందునా తెల్సిన వాళ్ళుంటే....

కొరివితో తల గోక్కోవడం నాకిష్టంలేదు ...

అతి కష్టంమీద ఓ మూడు పర్లాంగులు దొర్లించేను.

ఇంచుమించు అన్ని షాపులు మూసేసి వున్నాయి.

రోడ్డుమీద జన సంచారమే లేదు .... దూరంగా....ఓ సైకిలు షాపును చూడగానే వుషారొచ్చింది.

ఓ 15 యేళ్ళ కుర్రాడు బయట కూర్చొని వున్నాడు.

నేను అక్కడికి వెళ్ళి "వెధవది....సైకిలు తాళం ఎక్కడో పడిపోయింది. బజారుపని అయిపోగానే తిన్నగా యింటికి పోయానుకాదు....అనవసరంగా సినిమాకి వెళ్ళి తాళంపడేసుకు వచ్చేను. ఛీ।ఛీ।" అన్నాను విసుక్కుంటు న్నట్టు నటిస్తూ....ఇది దొంగిలించి తీసుకువచ్చినట్టు అతనికి అనుమానం కలగకుండా వుండాలనీ....

అతనూ "కొట్టు మూసేసామండి....నేను యింటికివెళ్ళి పోతున్నాను...." అన్నాడు సైకిలుకేసి ఎగాదిగా చూస్తూ.

"బాబ్బాబు। నేను అర్జంటుగా ఇంటికి వెళ్ళిపోవాలి. నీ కష్టం వుంచుకోనులే....రూపాయిస్తాను...." అని నోటు తీసి అతనికి ఆశచూపించేను.

కళ్ళు రెపరెపలాడేయి అతనికి....డబ్బంటే చేదామరి....

"లేదండి। నేను వెంటనే వెళ్ళిపోవాలి....పోనీ....ఓ పని చేయండి....లోపల మా బోయ్ వున్నాడు....వాడితో ప్రయత్నం చేసుకోండి. ఆ రూపాయేదో వాడికే యివ్వండి" అంటూ లోపలికి వెళ్ళి ఆ కుర్రాడిని లేపి ఏదో చెప్పాడు....

వాడు ఆశ్చర్యంగా కళ్ళింత చేసుకున్నాడు....

బహూశ నేను యిస్తాన్న రూపాయి గురించి చెప్పి వుంటాడు....ఒక్కసారిగా లేచి కళ్లు నులుముకుంటూ బయటికి వచ్చేదు....వెంటనే అతను సైకిలెక్కి వెళ్ళిపోయేదు.

ఈ కుర్రాడు పాత తాళాలేవో చాలా తెచ్చి ప్రయత్నించ సాగాడు .... ఎంతసేపటికీ రావడంలేదు .... ఇదెక్కడి సంతరా బాబూ....అన్పించింది....

అసహనంగా వుంది నాకు....

నా కంగారు ఎక్కడ పసిగడతాడేమో నని నేనుకూడా ఆ పాత తాళాలతో ప్రయత్నించుతున్నాను....

షుమారు పావుగంట నుంచి ప్రయత్నిస్తున్నా ఎంతకీ రావడం లేదు. ఇంతలో—

ఇందాక సైకిలుమీద వెళ్ళినతను .... ఇంకో లుంగీవాలా....ఇతన్ని యెక్కడ చూశానబ్బా....ఆ....గుర్తుకు వచ్చింది....ఆ గదిలో....నగ్నంగా పెనవేసుకుని శృంగార ఘట్టంలో తేలియాడుతున్న జంటలోఅతను....చేతికర్రతో. వచ్చి....వచ్చిందే తడవుగా నన్ను నాలుగు బాది దగ్గర్లో వున్న పోలీసు స్టేషనులో అప్పచెప్పి వెళ్ళిపోయేరు....

ఇంతకూ యీ సైకిలు నేను దొంగిలించానని యెలా తెల్సింది వీళ్ళకు....ఎంత బుర్ర బద్దలుగొట్టుకున్నా లోపం ఎక్కడ జరిగిందో నా కర్థం కాలేదు.

ఆ తర్వాత తెలిసింది—ఆ షాపు, ఆ యింటి యజమానిదనీ, అతడు వాళ్ళబ్బాయి అనీ, తాము వచ్చేవరకూ సైకిలు తాళం తీయకుండా టైమ్ పాస్‌చేయమని, ఆ బోయ్‌కి చెప్పేడనీ.

నే నిప్పుడు జైలులో కటకటాలు లెక్కబెడుతూ కూర్చున్నాను.

—కె.పి.ఎస్.ఎన్. మూర్తి, రాజమండ్రి.

